AMSA

NTARY

NGS

శ్రీ ర స్తు.

# రఘువంశమహాకావ్యము

## 6 - స ర్గ లు.

పదచ్ఛేద అర్థ అకాంక్ష శబ్ద సమాస తాత్పర్య
వ్యాఖ్యానసహితము.




వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

చె న్న పు రి.

శ్రీరస్తు.

మహాకవి శ్రీకాళిదాసకృతము

# రఘువంశ మహాకావ్యము

శ్లోకపదచ్ఛేదాకాంక్షాశబ్దరూపసమాసధాతురూప

వ్యాఖ్యాభావ సముల్లసితము.



(క్రొత్తకూర్పు.)

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1926.

# పీఠిక.

అపౌరుషేయంబు లగు వేదంబులును, దదుపబృంహణము లగు సకలస్మృతీతిహాస పురాణములును, వేదాంగంబు లగుశిక్షావ్యాకరణాదులును, దక్కంగలసకలవాగ్జాలంబును, సంస్కృతభాషయంద యుండుటంజేసియు, సంస్కృతపదములే సకలవైకృతభాషలయందుఁ దత్సమతద్భవములుగాఁ గానంబడుచుండుటంజేసియు, సంస్కృతభాష యనాదియు భాషల కెల్ల మాతృభూతయు నని పండితు లెల్లరు వక్కాణించెదరు. తెలుఁగు, ఇంగ్లీషు, హిందీ మున్నగు దేశభాషలవలె సంస్కృతభాష సంభాషించుటకు లింగవిభక్తిధాతురూపాదిజ్ఞానంబు లేక వలనుపడదు. అట్టినిర్దుష్టం బగుసంస్కృతభాషాపూర్ణపరిచయమునకు మొదటిది కావ్యపరిజ్ఞానము, రెండవది శాస్త్రపరిజ్ఞానము సాధనములుగ నున్నవి. ఈవిషయమై కాళిదాసాదిమహాకవులకుఁ బూర్వకాలమునందు సరసము లగుకావ్యములు లేనందునఁ బండితులు విద్యార్థుల కాదికావ్యమగుశ్రీరామాయణమునే ప్రవచనముఁ జేయుచు వచ్చిరి.

పిదప సరస్వత్యవతారము లగుకాళిదాసాదిమహాకవు లవతరించి రఘువంశము మున్నగుహృద్యములగుకావ్యముల రచించినవెనుక మహర్షిప్రోక్తంబును సకలపురుషార్థసాధనంబును నాదికావ్యంబు నగుశ్రీరామాయణమే ప్రవచనంబున మూలఁబడినది. దీనింబట్టియే రఘువంశముయొక్క ప్రాశస్త్యమును బుద్ధిమంతులూహింపవచ్చును. ఇంతియకాక యార్యావర్తమునందకాక యితరదేశములందును బండితులు విద్యార్థులకు విద్యాప్రారంభంబునఁ దప్పక రఘువంశకావ్యమునే ప్రవచనముఁ జేయుచున్నారు. వేయేల! విజ్ఞులకు నల్పజ్ఞులకుంగూడ వారివారియోగ్యత కనుగుణంబుగ హృదయముల నానందింపంజేయు రఘువంశమును లోకములో సంస్కృతవిద్యార్థియగు ప్రతిబాలుండును దప్పక చదువక యుండఁడని దృఢముగాఁ జెప్పవచ్చును.

ఇట్టిరఘువంశమును రచించినమహాకవి కాళిదాసు. కాళికాదేవి నుపాసించి తత్కటాక్షంబున నఖిలవిద్యలం గాంచినవాఁడు గాన నీయనకీ పేరువచ్చినది. ఈయన జీవించియుండుకాలమును గుఱించి చరిత్రకా

రులు పలు తెఱంగుల వ్రాసియున్నను క్రీస్తుశుపూర్వము 1-వ శతాబ్దము నందు విక్రమార్కసభాలంకారంబై యుండెనని కడపటిచరిత్రకారుల యభిప్రాయమై యున్నది. ఈయన రఘువంశాది మహాకావ్యత్రయ మును, శాకుంతలాదిరూపకత్రయము నొనర్చి దిగంతవిశ్రాంతకీర్తిం గైకొనిన మహాకవి. ఈయనచరిత్రము విపులముగా మఱియొకచోఁ బ్రస్తుతించెదము.

ఇట్లు సకలకావ్యరత్నం బనాఁబరఁగు రఘువంశమునకు విద్యా ర్థిజనులకు సుబోధంబుగ 1 మల్లినాథ, 2 హేమాద్రి, 3 చారిత్రవర్ధన, 4 దక్షిణావర్త, 5 నాథ, 6 సుమతివిజయ, 7 వల్లభ, 8 ధర్మమేరు, 9 విజయగణి, 10 విజయానందసూరిచరణసేవక, 11 దినకరమిశ్ర ప్రభృతు లనేకులు వ్యాఖ్యానముల రచించిరి. వీరలలోఁ గడపటివ్యాఖ్యాత మహోపాధ్యాయ కోలచలమల్లినాథసూరి. ఈయన క్రీస్తుశ. 14 శతా బ్దములోనుండినవాఁడు. ఈయన వ్రాసినవ్యాఖ్యానమువలనఁ దక్కిన వ్యాఖ్యానములన్నియు మూలఁబడినవి. ప్రాచీనవ్యాఖ్యానంబులన్నింటి కన్న నుత్తమంబని పండితులచేఁ గొనియాడంబడునదియు, సర్వసామా న్యంబుగ విద్యార్థులచేఁ బఠింపఁబడుచున్నదియు మల్లినాథసూరివ్యా ఖ్యానంబ యగు. ఇట్టిహృదయంగమంబగు వ్యాఖ్యానంబున్నను భాషా పరిచయము లేనిప్రారంభదశయందుండు విద్యార్థులు శ్లోకార్థమును గ్రహించుట దుర్ఘటము.

అట్లుగాక పూర్వకాలమునందువలెఁ జిరకాలము గురుసన్నిధా నంబున శుశ్రూషయొనర్చి విద్యను లభింపరాదా! యనిన నాంగ్లభాషా ప్రచురములగు మనదేశంబుల సంస్కృతముఁ బూర్తిగా నభ్యసించి నను దుదకుఁ దగినయుద్యోగాదులు లేక జీవనము జరుగుటయుఁ గూడఁ గష్టతరమగుచున్నది. కాఁబట్టియే యీకాలంబునఁ "బొరుగింటి పుల్లగూరరుచి" యనునట్లు పరకీయయగు నాంగ్లభాషామణిని రుచిమ రిగియుండుటచే స్వీయ యగుసంస్కృతభాషాసతి మొగముఁజూచు వారు గూడ నరుదు. ఎట్టకేలకుఁ బఠింపఁదలఁచినను నాసమయమున కాగ్రామంబునఁ బ్రవక్త లగుపండితులు లేకయుఁ బరదేశమునకేగి చదువుదమన్న నచట భోజనాది సౌకర్యములు గలుగకయుఁ గలిగినను

నచ్చుటి వసతి శరీరారోగ్యమును గలుగఁజేయకయుఁ జేసినను నుపాధ్యాయులు శ్రద్ధతోఁ బాఠప్రవచనము సేయకయు నిట్లు పలువిధముల విద్యార్థిజనంబులు పడుపాట్లు మనము చూచుచునేయున్నాము. ఇఁక నాంగ్లభాషాప్రవీణులయి యుద్యోగములఁ జేయుచు విహారసమయముల సంస్కృతభాషామృతంబుఁ జవిచూడఁ గోరువిలాసిజనము లొందుచింత యింతంతనఁ దరము గాదు.

ఇట్టికష్టములన్నియుఁ దీరునట్లు రఘువంశము మొదటియాఁఱుసర్గములును సుబోధంబుగ సాహితీవిదు లగు బ్రహ్మశ్రీ, గొల్లాపిన్ని. సదాశివశాస్త్రులవారి సాహాయ్యంబునఁ బ్రతిశ్లోకమునకుఁ బదచ్ఛేదము, అర్థము, ఆకాంక్ష, శబ్దరూపసమాస ధాతురూపములు, భావము, మల్లినాథవ్యాఖ్యానము—వీనింజేర్చి గురువు నాశ్రయింపకయే తమంతట శ్లోకార్థభావముల నెఱుంగునట్లొనర్చి. క్రీ. 1856-వ సంవత్సరమునందు శ్రీరామనవమినాఁడు ప్రథమముద్రణముం బూర్తిగావించితిమి. తరువాత నచిరకాలములోనే యాపుస్తకములన్నియు దేవభాషాభిమానులహస్తంబుల నలంకరించుటంజేసి మరల ద్వితీయ తృతీయముద్రణములఁగూడ నొనరించితిమి. ఐనను గొంతవఱకు సంస్కృతభాష యభివృద్ధిఁ గాంచుటంజేసి యవియన్నియుఁగూడ విద్యార్థిజనగృహీతంబు లగుటవలనఁ బ్రకృతకాలమునకుఁ దగురీతిఁ దాత్పర్యాదులు మఱియుఁ దేటతెల్లంబుగఁ దెలియునటుల వైయాకరణు లగు శ్రీమాన్-ఉత్పల. కౌశిక. వేంకటనరసింహాచార్యులవారిచేఁ బరిష్కరింపించి నాల్గవముద్రణమును బూర్తి గావించినారము. ఇందు 1-2 సర్గములు చదివినమాత్రముననే సామాన్యంబుగఁ గొంతవఱకు శబ్దాదిజ్ఞానముగలిగి పాఠసంప్రదాయము దెలియవచ్చునుగాన గ్రంథవిస్తరభీతిచేతను, శ్రద్ధాహీనులగుకొందఱు సామాన్యవిద్యార్థులు పుస్తకపాఠమునే రోఁకటిపాటగాఁ బఠింపక స్వబుద్ధిని వినియోగపఱచి తెలిసికొనుటచేఁ గొంతవఱకు బుద్ధివైశద్యము గలుగుననునభిప్రాయంబుచేతను, మూఁడవసర్గము మొదలు పునరుక్తము లగుకొన్నియంశములకుఁ బుటాక్షరము లుంపఁబడినవి. అవి యిందుఁ జేర్పఁబడినసంకేతాక్షర వివరణ పత్రికవలనం దెలియనగు.

సటీకము రఘువంశము దొఱికెం గదాయని విద్యార్థులు కేవల మర్థమునుజూచియే పాఠమును వల్లింపక మొదట 1-2 రెండుమాఱు లర్థము మనస్సున కెక్కునంతవఱకు అర్థమును జూచి చదివి పిదప మూలముమీఁదనే యర్థాదుల వల్లింతురని తెలియఁజేయుచున్నారము. ఇందువలననే యవ్యాఖ్యానాపేక్షముగ నేశ్లోకమునైనను నన్వయించుటకుఁ దగినసాహిత్యము లభించుట యనుభవసిద్ధమైయున్నది.

పలువురాంధ్రసోదరులు మాటిమాటికి మమ్మెచ్చరించుచుండుటచే నీలాగుననే కుమారసంభవము, మేఘసందేశము, శిశుపాలవధము (మాఘకావ్యము), భాషామంజరి, విక్రమార్కచరిత్ర, బిల్హణచరిత్ర, భోజచరిత్ర, ఋతుసంహారము, భర్తృహరిసుభాషితము మున్నగు గ్రంథములకు టీకాతాత్పర్యాదుల వ్రాయించి ప్రకటించియున్నారము. ఇట్లె యచిరకాలములోనే నైషధము, కాదంబరి, శాకుంతలము మున్నగుగ్రంథములను గూడ నాంధ్రటీకాతాత్పర్యాదులతోడఁ బ్రకటించెదము. కావున నుభయభాషాభిమాను లగునాంధ్రసోదరు లిట్టి గ్రంథములం జక్కఁగఁ జదివి సద్గ్రంథప్రకటనమునం దుత్సాహముం గల్పింతురుగాత!

·292, ఎస్ప్లనేడ్,
చెన్నపురి.
23-7-1916.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీ ర స్తు.

# రఘువంశ ప్రథమాదిసర్గషట్కాస్థ విషయసూచిక.



## ప్రథమ సర్గము.

## ద్వితీయసర్గము.

## తృతీయ సర్గము.

| శ్లోకసంఖ్య. | విషయములు. సంస్కృతము. | తెనుఁగు. | శ్లోకసంఖ్య. |
|---|---|---|---|
| 30 | రఘుపరాక్రమాతిశయ ప్రయుక్తేంద్ర సంతోషః | రఘుపరాక్రమాతిశయముచే ఇంద్రుఁడు సంతోషించుట | ౬౨ |
| 31 | తురంగం వినా వరంవృణీష్వేతి రఘుం ప్రతీంద్రకథనం | గుఱ్ఱమునువిడిచి వేఱొకవరమునుగోరుమనిరఘువునుగూర్చిఇంద్రుఁడుచెప్పుట | ౬౩ |
| 32 | ఇంద్రం ప్రతి క్రతుఫలయోగాదిప్రార్థనా | ఇంద్రుని గూర్చి నాతండ్రి క్రతుఫలయుక్తుఁడు కానిమ్మని ప్రార్థించుట | ౬౪ |
| 33 | తథేతి ప్రతిజ్ఞాపూర్వకేంద్రగమనానంతరం సభామంటపం ప్రతి రఘునివర్తనం | అటులనే యగుఁగాకయని దేవేంద్రుఁడు వెళ్ళినపిమ్మట సభాగృహమునకు రఘువు మరలుట | ౨౭ |
| 34 | రఘ్వంగస్పర్శనపూర్వక దిలీపసంతోషః | రఘుశరీరమును స్పృశించిదిలీపుఁడుసంతోషించుట | ౬౮ |
| 35 | సూనోః రాజ్యం దత్వాదిలీపస్య భార్యయాసహవానప్రస్థాశ్రమాశ్రయణం | పుత్రునికి రాజ్యమునొసఁగి భార్యతోడవానప్రస్థాశ్రమము ననలంబించుట | ౭౦ |

## చతుర్థసర్గము.

| | | | |
|---|---|---|---|
| 1 | రాజ్యలాభప్రయుక్త రఘుప్రకాశవర్ణనం | రాజ్యలాభముచేరఘుప్రకాశవర్ణనము | ౧ |
| 2 | శరదాగమః | శరదృతు వేతెంచుట | ౧౪ |
| 3 | శరత్కాలరఘుగుణవర్ణనాపూర్వక దండయాత్రోద్యమకథనం | శరత్కాలముయొక్కయుఁ రఘుగుణములయొక్కయువర్ణనపూర్వకమయినయుద్ధయాత్రప్రయత్నము | ౧౫ |
| 4 | రఘోః ర్దిగ్జైత్రయాత్రావర్ణనం | రఘువుయొక్క దిగ్విజయ యాత్రావర్ణనము | ౨౫ |
| 5 | ప్రాచ్యాం సింహదేశీయరాజవిజయః | తూరుపుదిక్కునందుండెడి సింహదేశపురాజులనుజయించుట | ౩౫ |
| 6 | నౌసాధనోద్యతవంగదేశీయరాజవిజయపూర్వకజయ స్తంభప్రతిష్ఠాపనం | ఓడలసహాయముచే వచ్చిన వంగదేశపు రాజులను జయించి జయస్తంభమును నాటుట | ౩౬ |
| 7 | ద్విరదసేతుభిః కపిశాతరణపూర్వకం కళింగవిజయః | గజములనుసేతువులచే కపిశానదిని దాటి కళింగదేశములను జయించుట | ౩౮ |

## పంచమసర్గము.

## షష్ఠసర్గము.

| విషయసంఖ్య. | విషయములు. సంస్కృతము. | విషయములు. తెనుఁగు. | పుటసంఖ్య. |
|---|---|---|---|
| 7 | రాజ్ఞాం వివిధశృంగారచేష్టావర్ణనం | రాజులు నానావిధములుగ చేసిన శృంగారచేష్టల వివరణము | ౧౨ |
| 8 | ఇందుమతీ ముద్దిశ్య ద్వారపాలికా సునందాకర్తృక మంచస్థిత రాజచరిత్ర కథనం | ఇందుమతినిగూర్చిద్వారపాలకురాలయిన సునంద మంచెలయం దుండెడి రాజులయొక్క చరిత్రలను చెప్పుట | ౨౦ |
| 9 | రాజ్ఞాం ఇందుమతీకర్తృకస్వాతిక్రమణేన వివర్ణత్వభజనం | రాజులు ఇందుమతి తమ్ము నతిక్రమించి పోవుటచేని స్తేజస్కత్వమునొందుట | ౩౪ |
| 10 | అజస్య శుభసూచక దక్షిణబాహుస్ఫురణం [౫౪ | అజునకు శుభసూచకముగ దక్షిణబాహువు చలించుట [నిచ్చను వదలుట | ౩౫ |
| 11 | ఇందుమతీకర్తృకాన్యోపగమేచ్ఛాత్యా | ఇందుమతిమఱియొక్క రాజువద్దకుబోన | ౩౯ |
| 12 | అజచరిత్ర వర్ణనం | అజునియొక్క చరిత్రమునువర్ణించుట | ౪౦ |
| 13 | ఇందుమతీకర్తృకస్వానురాగ దర్శనాది చిహ్నాని | ఇందుమతి తనయనురాగముతో చూచుట మొదలగుచిహ్నములు | ౫౦ |
| 14 | అన్యం ప్రతి ప్రజావ ఇతిపరిహాసభాషణే ఇందుమతీకర్తృకసునందాకర్మక కుటిల దర్శనం | మఱియొక్క రాజునుగూర్చి పోవుదమాయని పరిహాసపూర్వకముగ నుడివినసునందను ఇందుమతిఘోరిచూపు చూచుట | ౫౨ |
| 15 | అజకంఠే ఇందుమతీకర్తృక మాలికార్పణం | అజుని మెడలో ఇందుమతిపూలహారమును సమర్పించుట | ౫౩ |
| 16 | అజకర్తృక బాహుపాశార్పణ సుఖానుభవః | అజుఁడు ఇందుమతీబాహుపాశార్పణముచే కలిగినసుఖము ననుభవించుట | ౫౪ |
| 17 | సమగుణదాంపత్య ముద్దిశ్య నృపతిశ్రవణకటుత్వజనక పౌరజనోక్తిః | సమగుణములు గలవారియొక్క దాంపత్యము నుద్దేశించి రాజులయొక్క శ్రవణములకు కాఠిన్యముగలుగునట్లు పౌరజనులు నుడువుట | ౫౫ |
| 18 | అజసంబంధితదితరరాజమండల కర్తృక సుఖదుఃఖానుభవః | అజసంబంధిరాజసమూహము సుఖమును ఇతరరాజసంఘము దుఃఖమును అనుభవించుట | ౫౭ |

# సంకేతాక్షరపత్రిక.



## తృతీయసర్గము మొదలు.

| | | |
|---|---|---|
| అ...అకారాన్తః<br>ఆ...ఆకారాన్తః | } | ఈప్రకారము అజంతపదములయందు తెలియవలసినది |
| చ...చకారాన్తః<br>రే...రేఫాన్తః | } | ఈప్రకారము హలంతపదములయందు తెలియవలసినది |
| పు...పుంలింగః<br>స్త్రీ...స్త్రీలింగః<br>న...నపుంసకలింగః | } | ఈప్రకారము స్త్రీపున్నపుంసకలింగములయందు తెలియవలసినది |
| ప్ర...ప్రథమా<br>సం...సంబుద్ధి<br>ద్వి...ద్వితీయా<br>తృ...తృతీయా<br>చ...చతుర్థీ<br>పం...పంచమీ<br>ష...షష్ఠీ<br>స...సప్తమీ | } | ఈప్రకారము విభక్తులు తెలియవలసినది |
| ఏ...ఏక<br>ద్వి...ద్వి<br>బ...బహు | } | ఈప్రకారము వచనముల నెఱుంగవలసినది. |
| అ, పు, ప్ర, ఏ. | ... | అకారాన్తః పుంలింగ ప్రథమైకవచనాన్తః |
| అ, స్త్రీ, ద్వి, బ. | ... | అకారాన్తస్త్రీలింగద్వితీయాబహువచనాన్తః |
| అ, న, తృ, ద్వి. | ... | అకారాన్తనపుంసకలింగతృతీయాద్వివచనాన్తః |
| నా...నామ<br>అవ్య...అవ్యయమ్<br>క్రి...క్రియా | } | ఈప్రకారము నామావ్యయక్రియల నెఱుంగవలసినది |

ప్ర... ప్రథమపురుషః
ఉ... ఉత్తమపురుషః
మ... మధ్యమపురుషః

ఈప్రకారము ధాతువులలో ప్రథమోత్తమమధ్యమ పురుషముల నెఱుఁగవలసినది

పంచమసర్గము మొదలు.

వచ్చినపదములఁ బలుమా ఱుచ్చరింపవలసిన సమాసములయందలి సంకేతవివరణము.

ఉదాహరణము:—

౫ సర్గము, ౧ శ్లోకములో, 'నిశ్శేషవిశ్రాణితకోశజాతం' అనుసమాసపదము.

| విగ్రహస్వరూపము. | | సమాసపదము. | సంకేతము. |
|---|---|---|---|
| నిర్గతః శేషో యస్మిన్కర్మణి తద్యథాభవతి తథా | | నిశ్శేషం | నిశ్శేషం, |
| నిశ్శేషం | విశ్రాణితం | నిశ్శేషవిశ్రాణితం | ని...తం, |
| కోశానాం | జాతం | కోశజాతం | కో...తం, |
| నిశ్శేషవిశ్రాణితం<br>కోశజాతం<br>యేన సః | ని...తం<br>కో...తం | నిశ్శేషవిశ్రాణితకోశజాతః | ని...తః, |
| తం | | నిశ్శేషవిశ్రాణితకోశజాతం | ని...తం. |
| (జాతం, | | జాతౌ, | జాతాన్.) |

నిశ్శేషవిశ్రాణితకోశజాతశబ్దః — నిశ్శే...జాతశబ్దః
అకారాన్తఃపుంలింగః ద్వితీయైకవచనాన్తః — అ, పు, ద్వి, ఏ.

☞ ఇట్టి సమాసస్థలముల నన్నిటియం దిటులనే తెలిసికొనవలయును.

శ్రీ ర స్తు.

# రఘువంశమహాకావ్యము

## ప్రథమసర్గము.



శ్లో. వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ. 1

పదచ్ఛేదము—వాగర్థావివ, సంపృక్తౌ, వాగర్థప్రతిపత్తయే, జగతః, పితరౌ, వందే, పార్వతీపరమేశ్వరౌ.

అర్థము.—వాగర్థావివ=శబ్దార్థములవలె, సంపృక్తౌ=ఒండొరులతో నెడఁబాయకుండునట్లు కలిసినట్టియు (చ్యుతిలేనిసంబంధము గలిగినట్టి), జగతః=జగమునకు, పితరౌ=తలిదండ్రులైన, పార్వతీపరమేశ్వరౌ=పార్వతీ పరమేశ్వరులను, వాగర్థప్రతిపత్తయే-వాగర్థ=శబ్దార్థములయొక్క, ప్రతిపత్తయే=జ్ఞానముకొఱకు, వందే=నమస్కరించుచున్నాను.

ఆకాంక్ష.—వందే=నమస్కరించుచున్నాను. కః=ఎవఁడు? అహం=నేను, కౌ=ఎవరిని? పార్వతీపరమేశ్వరౌ=పార్వతీ పరమేశ్వరులను. 'అహం' అను ప్రథమాంతకర్తృపదమును, 'పార్వతీపరమేశ్వరౌ' అనుద్వితీయాంతకర్మపదమును, 'వందే' అను క్రియాపదమును ఉన్నవి గనుక సకర్మకకర్తృప్రయోగము. కస్యై=దేనికొఱకు? వాగర్థప్రతిపత్తయే-వాగర్థ=శబ్దార్థములయొక్క, ప్రతిపత్తయే=జ్ఞానముకొఱకు, పార్వతీపరమేశ్వరౌ-కథంభూతౌ=పార్వతీపరమేశ్వరులు ఎట్టివారు? పితరౌ=తలిదండ్రులు, కస్య=దేనికి? జగతః=జగమునకు, పునః కథంభూతౌ=ఇంక నెట్టివారు? సంపృక్తౌ=అనఁగా ఒండొరులు వేఱుపడకుండునట్లు కలిసినవారు, (చ్యుతిలేనిసంబంధము గలిగినవారు.) కావివ=వేని వలె? వాగర్థావివ=శబ్దార్థములవలె.

శబ్దరూపసమాసములు.—వాగర్థావివ, వాగర్థసదృశౌ-వాగర్థావివ; అవ్యయమ్. సంపృక్తౌ -సంపృక్తం, సంపృక్తౌ, సంపృక్తాన్. సంపృక్తశబ్దః, అకారాంతః, పుల్లిఙ్గః, ద్వితీయాద్వివచనాంతః. వాగర్థప్రతిపత్తయే-వాక్చ, అర్థశ్చ - వాగర్థౌ, వాగర్థయోః ప్రతిపత్తిః వాగర్థప్రతిపత్తిః, తస్యై,వాగర్థప్రతిపత్తయే-ప్రతిపత్త్యై, ప్రతిపత్తయే, ప్రతిపత్తిభ్యాం, ప్రతిపత్తిభ్యః. వాగర్థప్రతిపత్తిశబ్దః, ఇకారాంతస్త్రీలిఙ్గశ్చతుర్థ్యేకవచనాంతః. జగతః-జగతః, జగతోః, జగతాం. జగచ్ఛబ్దః తకారాంతనపుంసకలింగః, షష్ఠ్యేకవచనాంతః, పితరౌ-మాతా చ, పితా చ-పితరౌ, తౌ, పితరౌ-పితరం, పితరౌ, పితౄన్.

పితృశబ్దః, ఋకారాంతః, పుల్లిఙ్గః, ద్వితీయాద్వివచనాంతః. వన్దే, వన్దావహే, వన్దామహే. 'వది' అభివాదనస్తుత్యోః-ఇత్యస్మాద్ధాతోః స్వకర్మకాత్కర్తరి వర్తమానే లటి ఆత్మనేపదే ఉత్తమపురుషైకవచనాంతః. పార్వతీపరమేశ్వరౌ, పర్వతస్యాపత్యం స్త్రీ-పార్వతీ; పరమశ్చాసౌ ఈశ్వరశ్చ - పరమేశ్వరః; పార్వతీ చ పరమేశ్వరశ్చ-పార్వతీపరమేశ్వరౌ; తౌ పార్వతీపరమేశ్వరౌ; పార్వతీపరమేశ్వరా ౨. పార్వతీపరమేశ్వరాభ్యాం ౩. పార్వతీపరమేశ్వరయోః ౨. పార్వతీపరమేశ్వరశబ్దః, అకారాంతః, పుల్లింగః, నిత్యద్వివచనే ద్వితీయాద్వివచనాంతః.

## వ్యాఖ్యానపీఠికా.

శ్లో. మాతాపితృభ్యాం జగతో నమో వామార్ధజానయే,
సద్యో దక్షిణదృక్పాతసంకుచద్వామదృష్టయే. ౧
అన్తరాయతిమిరోపశాంతయే శాంతపావన మచింత్యవైభవమ్,
తన్నరం వపుషి కుంజరంముఖే మన్మహేకిమపి తుందిలం మహః.
శరణం కరవాణి శర్మదం తే
చరణం వాణి చరాచరోపజీవ్యమ్,
కరుణామసృణైః కటాక్షపాతైః
కురు మామంబ కృతార్థసార్థవాహమ్. ౩
వాణీం కాణభుజీ మజీగణ దవాసాసీ చ్చ వైయాసికీ
మంతస్తంత్ర మరంస్త పన్నగగవీగుంఫేషు చాజాగరీత్,
వాచా మాచకల ద్రహస్య మఖిలం యచ్చాక్షపాదస్ఫురాం
లోకేఽభూ ద్యదుపజ్ఞ మేవ విదుషాం సౌజన్యజన్యం యశః. ౪
మల్లినాథకవి స్సోఽయం మందాత్మానుజిఘృక్షయా,
వ్యాచష్టే కాళిదాసీయం కావ్యత్రయ మనాకులమ్. ౫
కాళిదాసగిరాం సారం కాళిదాస స్సరస్వతీ,
చతుర్ముఖోఽథవా సాక్షా ద్విదు ర్నాన్యే తు మాదృశాః. ౬
తథాపి దక్షిణావర్తనాథాద్యైః క్షుణ్ణవర్త్మసు,
వయం చ కాళిదాసోక్తి ష్వవకాశం లభేమహి. ౭
భారతీ కాళిదాసస్య దుర్వ్యాఖ్యావిషమూర్ఛితా,
ఏషా సంజీవినీటీకా తా మద్యోజ్జీవయిష్యతి. ౮

ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా,
నామూలం లిఖ్యతే కించి న్నానపేక్షిత ముచ్యతే.

ఇహ ఖలు సకలకవికులశిరోమణిః కాళిదాసః—

“కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే.”

ఇత్యాలంకారికవచనప్రామాణ్యాత్కావ్యస్యానేకశ్రేయస్సాధనతాం “కావ్యాలాపాంశ్చవర్జయే” దితి నిషేధశాస్త్రస్యాసత్కావ్యవిషయతాం చ పశ్యన్ రఘువంశాఖ్యం మహాకావ్యం చికీర్షుః చికీర్షితార్థావిఘ్నపరిసమాప్తిసంప్రదాయావిచ్ఛేదలక్షణఫలసాధనభూతవిశిష్టేష్టదేవతానమస్కారస్య శిష్టాచారపరిప్రాప్తత్వాత్, “ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాఽపి తన్ముఖ” మిత్యాశీరాద్యన్యతమస్య ప్రబంధముఖలక్షణత్వాచ్చ కావ్యనిర్మాణస్య విశిష్టశబ్దార్థప్రతిపత్తిమూలత్వేన విశిష్టశబ్దార్థయోశ్చ “శబ్దశాస్త్రమశేషం తు ధత్తే శర్వస్య వల్లభా, అర్థస్వరూపమఖిలం ధత్తే ముగ్ధేందుశేఖరః.” ఇతి వాయుసంహితావచనబలేన పార్వతీపరమేశ్వరాయత్తత్వదర్శనాత్తత్ప్రతిపిత్సయా తావేవాభివాదయతే.

వ్యాఖ్యానమ్.—వాగర్థా వివేతి. వాగర్థావివేత్యేకంపదం. ‘ఇవేన సహ నిత్యసమాసో విభక్త్యలోపశ్చ పూర్వపదప్రకృతిస్వరత్వం చ’ ఇతి వక్తవ్యాత్. ఏవ మన్యత్రాపి ద్రష్టవ్యం. యద్య ప్యేతచ్ఛాస్త్రస్య విభాషాధికారా త్పూర్వం పఠితత్వా న్నిత్యతా వ్యవసీయతే; తథాపి ‘సహ సుపే’ త్యేవ సిద్ధే పునర్వచనసామర్థ్యాత్క్వాచిత్కతాఽఽశ్రీయతే. తేన ‘ఉద్బాహురివ వామన’ ఇత్యాదౌ వ్యస్తప్రయోగోఽపి సాధురేవ. ప్రకృతే తు భిన్నపదత్వేఽపి న కశ్చన దోష ఇత్యాస్తాం తావత్. వాగర్థావివ-శబ్దార్థావివ, సంపృక్తౌ-నిత్యసంబంధావిత్యర్థః. నిత్యసంబంధయో శ్శబ్దార్థయోరుపమానత్వేనోపాదానాత్. ‘నిత్య శ్శబ్దార్థసంబంధ’ ఇతి మీమాంసకాః. జగతః-లోకస్య,పితరౌ-మాతాచ, పితాచ పితరౌ ‘పితా మాత్రా’ ఇతి ద్వంద్వైకశేషః.ని. ‘మాతాపితరౌ పితరౌ మాతరపితరౌ ప్రసూజనయితారౌ’ విత్యమరః. ఏతేన శివయో స్సర్వజగజ్జనకతయా వైశిష్ట్యం, ఇష్టార్థప్రదానశక్తిః, పరమకారుణికత్వం చ సూచితం. పర్వతస్యాపత్యం స్త్రీ పార్వతీ. ‘తస్యాపత్య’ మిత్యణ్ ప్రత్యయః. ‘టిడ్ఢాణ’ ఇత్యాదినా ఙీప్, యద్వా- ‘అత ఇ’ ఇతి ఇఞ్ -‘ఇతోమనుష్యజాతే’ రితి ఙీప్, పార్వతీ చ పరమేశ్వరశ్చ-పార్వతీపరమేశ్వరౌ, పరమశబ్ద స్సర్వోత్తమత్వద్యోతనార్థః. మాతురభ్యర్హితత్వాదల్పాచ్ తరత్వాచ్చ పార్వతీశబ్దస్య పూర్వనిపాతః. వాగర్థప్రతిపత్తయే-శబ్దార్థయోస్సమ్యక్ జ్ఞానార్థం, వందే అభివాదయే. అత్రోపమాలంకారః స్ఫుట ఏవ. తథోక్తం “స్వత

రఘువంశము వర్ణింపఁ బూనుట యవివేకముచే దాఁటరాని మహాసముద్రమును దెప్పతో దాఁటఁబూనుటవలె నున్నది. అదెట్లు దుస్తరమో, ఇదియు నట్లె దుస్తరము.

శ్లో. మన్దః కవియశఃప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్,
ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః. 3

పదచ్ఛేదము.—మన్దః, కవియశఃప్రార్థీ, గమిష్యామి, అపహాస్యతామ్, ప్రాంశులభ్యే, ఫలే, లోభాత్, ఉద్బాహుః, ఇవ, వామనః.

అర్థము.—మందః=మూఢుఁడనైనను, కవియశఃప్రార్థీ-కవి=కవులయొక్క, యశః=కావ్యనిర్మాణమువలనఁగలిగినకీర్తిని, ప్రార్థీ=కోరునట్టి, అహం=నేను, ప్రాంశులభ్యే-ప్రాంశు=పొడుగువానిచేత, లభ్యే=పొందఁదగిన, ఫలే=ఫలవిషయమందు, లోభాత్=ఆశవలన, ఉద్బాహుః-ఉత్=ఫలగ్రహణముకొఱకు-పైకెత్తఁబడిన,బాహుః=హస్తముకలిగిన,వామనఇవ=పొట్టివానివలె, అపహాస్యతాం=ఎగతాళికిపాత్రమగుటను, గమిష్యామి=పొందఁగలను.

ఆకాంక్ష.—గమిష్యామి=పొందఁగలను, కః=ఎవఁడు? అహం=నేను, కాం=దేనిని? అపహాస్యతాం=పరిహాసపాత్రమగుటను, 'అహం' అను ప్రథమాంతకర్తృపదమును, 'అపహాస్యతాం' అను ద్వితీయాంతకర్మపదమును, 'గమిష్యామి' అను క్రియాపదంబు నున్నదిగనుక, సకర్మకకర్తృకప్రయోగము. కఇవ=ఎవనివలె ? వామన ఇవ=పొట్టివానివలె, వామనః కథంభూతః=పొట్టివాఁడెట్టివాఁడు? ఉద్బాహుః-ఉత్=ఫలగ్రహణముకొఱకు పైకెత్తఁబడిన, బాహుః=భుజముకలిగినవాఁడు, కస్మాత్=ఎందువలన? లోభాత్=ఆసక్తివలన, కస్మిన్=దేనియందు? ఫలే=ఫలమునందు, ఫలే కథంభూతే=ఫలమెట్టిది? ప్రాంశులభ్యే-ప్రాంశు=పొడుగువానిచేత, లభ్యే=పొందఁదగినది. అహం కథంభూతః=నేనెటువంటివాఁడను, కవియశఃప్రార్థీ-కవి=కవులయొక్క, యశః=కావ్యనిర్మాణమువలని కీర్తిని, ప్రార్థీ=కోరుచుండువాఁడను, కథంభూతఃఅపి=ఎటువంటివాఁడనైనను ? మందః=మూఢుఁడనైనను.

శబ్దరూపసమాసములు.—మందః-మందః, మందౌ,మందాః. మందశబ్దః, అకారాన్తః పుల్లిఙ్గః, ప్రథమైకవచనాన్తః. కవియశఃప్రార్థీ-కవీనాం యశః కవియశః, కవియశః ప్రార్థయతీతికవియశఃప్రార్థీ-ప్రార్థీ,ప్రార్థినౌ, ప్రార్థినః. కవియశఃప్రార్థిన్‌శబ్దః, నకారాన్తః, పుల్లిఙ్గః, ప్రథమైకవచనాన్తః. గమిష్యామి-గమిష్యామి, గమిష్యావః, గమిష్యామః. గమ్ఌగతావిత్యస్మాద్ధాతోస్సకర్మకాత్కర్తరి భవిష్యదర్థేలృటిపరస్మైపదే ఉత్తమపురుషైకవచనాన్తః. అపహాస్యతాం-అపహసితుం యోగ్యః అపహాస్యః. అపహాస్యస్య భావః అపహాస్యతా; తాం-అపహాస్యతాం-అపహాస్యతాం, అపహాస్యతే, అపహాస్యతాః. అప

హాస్యతాశబ్దః,ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, ద్వితీయైకవచనాన్తః. ప్రాంశులభ్యే-లబ్ధుం యోగ్యం లభ్యం. ప్రాంశునా లభ్యం ప్రాంశులభ్యం, తస్మిన్ ప్రాంశులభ్యే-లభ్యే,లభ్యయోః, లభ్యేషు. ప్రాంశులభ్యశబ్దః. అకారాన్తః, నపుంసకలిఙ్గః, సప్తమ్యేకవచనాన్తః. ఫలే-ఫలే, ఫలయోః, ఫలేషు. ఫలశబ్దః, అకారాన్తః, నపుంసకలిఙ్గః, సప్తమ్యేకవచనాన్తః. లోభాత్ - లోభాత్, లోభాభ్యాం, లోభేభ్యః-లోభశబ్దః, అకారాన్తః, పుల్లిఙ్గః, పంచమ్యేకవచనాన్తః. ఉద్బాహుః-ఉచ్ఛ్రితః బాహుర్యేన సః ఉద్బాహుః-ఉద్బాహుః, ఉద్బాహూ, ఉద్బాహవః, ఉద్బాహుశబ్దః, ఉకారాన్తః, పుల్లిఙ్గః, ప్రథమైకవచనాన్తః. ఇవ-అవ్యయమ్. వామనః - వామనః, వామనౌ, వామనాః. వామనశబ్దః అకారాన్తః, పుల్లింగః, ప్రథమైకవచనాన్తః.

వ్యాఖ్యా.—మందశ్చేత్తర్హి త్యజ్యతాం మయ ముద్యోగ ఇత్యత్రాహ.—మంద ఇతి-కించ, మందః - మూఢః, "మూఢాల్పాపటునిర్భాగ్యా మందా" ఇత్యమరః, తథాపి, కవియశః ప్రార్థీ - కవీనాం, యద్యశః కావ్యనిర్మాణేన, తత్ప్రార్థనాశీలః, అహం, ప్రాంశునా - ఉన్నతపురుషేణ, లభ్యే-ప్రాప్యే, ఫలే-ఫలవిషయే, లోభాత్, ఉద్బాహుః-ఫలగ్రహణోచ్ఛ్రితహస్తః, వామనో-హ్రస్వ ఇవ "ఖర్వో హ్రస్వశ్చ వామన" ఇత్యమరః. ఉపహాస్యతాం-ఉపహాసవిషయతాం; 'ఋహలోర్ణ్యత్'ఇతి ణ్యత్ప్రత్యయః. గమిష్యామి-ప్రాప్స్యామి.

భావము.—పొడుగువానిచేఁ బొందఁదగిన యొకవృక్షమునందలి పండ్లనందుకొనుటకై చేతులుపైకెత్తుకొనియున్న పొట్టివానిని జూచి జను లెట్లు పరిహసించుదురో, అట్లె మూఢుఁడనైన నేను మహాకవులు కావ్యరచనచేతఁ బొందుకీర్తిని గోరుటచూచి, "యీమూఢుఁడేమి! కావ్యము రచించుటయేమి! వింతగానున్నది యిది" యని నన్ను హేళనము చేయుదురు.

అథవా కృతవాగ్ద్వారే వంశేఽస్మిన్పూర్వసూరిభిః,
మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః ౪

పదచ్ఛేదము.—అథ, వా, కృతవాగ్ద్వారే, వంశే, అస్మిన్, పూర్వసూరిభిః, మణౌ, వజ్రసముత్కీర్ణే, సూత్రస్య, ఇవ, అస్తి, మే, గతిః.

అర్థము.—అథవా=అట్లయినను, పూర్వసూరిభిః-పూర్వ=పూర్వమందుండిన, సూరిభిః=వాల్మీకి ప్రముఖవిద్వాంసులచేత, కృతవాగ్ద్వారే - కృత=చేయఁబడిన, వాక్ = రామాయణాది ప్రబంధరూపవాక్కే, ద్వారే=ప్రవేశోపాయముగాకలిగినట్టి, అస్మిన్

=ఈ,వంశే=సూర్యకులమందు, వజ్రసముత్కీర్ణే-వజ్ర=రత్నమునకు బెజ్జము వేయుం నొక
విధమయిన సూదితో, సముత్కీర్ణే=పొడువఁబడిన, మణౌ=రత్నమందు, సూత్రస్యేవ=
దారమునకువలె, మే=నాకు, గతిః=దారి, అస్తి=ఉన్నది.

అన్వయః.—అస్తి=ఉన్నది. కా=ఏది? గతిః=దారి, 'కా' అను ప్రథమాంత
కర్తృపదమును, 'అస్తి' అను క్రియాపదమును ఉన్నవిగనుక అకర్మకకర్తృకప్రయో
గము. కస్య=ఎవనికి? మే=నాకు. కస్యేవ = దేనికివలె? సూత్రస్యేవ=దారమునకువలె,
కస్మిన్=దేనియందు? మణౌ=రత్నమందు, మణౌ కథంభూతే=రత్నమెట్టిది? వజ్రసము
త్కీర్ణే-వజ్ర=రత్నమునుదొలుచు నొకవిధమయినసూదిచే, సముత్కీర్ణే = బెజ్జము వేయఁ
బడినది. కస్మిన్=దేనియందు? అస్మిన్ వంశే=ఈ రఘువంశమందు, వంశే కథంభూతే
=రఘువంశమెట్టిది? కృతవాగ్ద్వారే-కృత=చేయఁబడిన, వాక్=రామాయణాదిప్రబంధ
వాక్కే, ద్వారే = ప్రవేశోపాయముగాకలిగినది, కైః = ఎవరిచేత? పూర్వసూరిభిః -
పూర్వ=పూర్వమందుండినటువంటి, సూరిభిః=వాల్మీకి ప్రముఖవిద్వాంసులచేత, కథం=
ఎట్లయినను? అథవా=అటుగాకున్నను.

శబ్దరూపసమాసములు.—అథ-అవ్యయమ్, వా-అవ్యయమ్. కృతవాగ్ద్వారే -
వాగేవ ద్వారం వాగ్ద్వారం.కృతంవాగ్ద్వారం యస్యసః, కృతవాగ్ద్వారః, తస్మిన్, కృత
వాగ్ద్వారే-ద్వారే,ద్వారయోః, ద్వారేషు. కృతవాగ్ద్వారశబ్దః,అకారాంతః, పుల్లింగః,
సప్తమ్యేకవచనాంతః. వంశే-వంశే, వంశయోః, వంశేషు. వంశశబ్దః, అకారాంతః,
పుల్లింగః, సప్తమ్యేకవచనాంతః. అస్మిన్-అస్మిన్, అనయోః-ఏనయోః, ఏషు. ఇదం
శబ్దః మకారాంతః, పుల్లింగః, సప్తమ్యేకవచనాంతః. పూర్వసూరిభిః-పూర్వే చ తే
సూరయశ్చ-పూర్వసూరయః-తైః, పూర్వసూరిభిః-సూరిణా,సూరిభ్యాం, సూరిభిః. పూ
ర్వసూరిశబ్దః,ఇకారాంతః,పుల్లింగః,తృతీయాబహువచనాంతః.మణౌ-మణౌ,మణ్యోః,
మణిషు. మణిశబ్దః, ఇకారాంతః, పుల్లింగః, సప్తమ్యేకవచనాంతః. వజ్రసముత్కీర్ణే-
వజ్రేణ-సముత్కీర్ణః, వజ్రసముత్కీర్ణః. తస్మిన్-వజ్రసముత్కీర్ణే-సముత్కీర్ణే, సము
త్కీర్ణయోః, సముత్కీర్ణేషు. వజ్రసముత్కీర్ణశబ్దః, అకారాంతః, పుల్లింగః, సప్తమ్యేక
వచనాంతః. సూత్రస్య-సూత్రస్య, సూత్రయోః, సూత్రాణాం. సూత్రశబ్దః, అకా
రాంతః, నపుంసకలింగః,షష్ఠ్యేకవచనాంతః. ఇవ-అవ్యయమ్.అస్తి-అస్తి, స్తః, సంతి.
'అస' భువిఇత్యస్మాద్ధాతో రకర్మకాత్కర్తరి వర్తమానే లటి పరస్మైపదే ప్రథమపురు
షైకవచనాంతః. క్రియాపదం. మే-మమ-మే, ఆవయోః-నౌ, అస్మాకం-నః, అస్మచ్ఛ
బ్దః, దకారాంతః, పుల్లింగః, షష్ఠ్యేకవచనాంతః. గతిః-గతిః, గతీ, గతయః. గతి
శబ్దః ఇకారాంతః, స్త్రీలింగః, ప్రథమైకవచనాంతః.

వ్యాఖ్యా.—అథేతి అథవా-పక్షాంతరే, పూర్వైః సూరిభి ర్వాల్మీకి ప్రముఖైః, కృతవాగ్ద్వారే-కృతా రామాయణాదిప్రబంధరూపా యా వాక్ సైవ ద్వారం ప్రవేశోపాయో యస్య తస్మిన్, సూర్యప్రభవే, వంశే-కులే, జన్మనైకలక్షణ స్సంతానో వంశః. వజ్రేణ మణివేధకసూచీవిశేషేణ, "వజ్రం త్వస్త్రీ కులిశశస్త్రయోః, మణివేధే రత్నభేదే" ఇతి కేశవః. సముత్కీర్ణే-విద్ధే, మణౌ రత్నే, సూత్రస్యేవ మే, గతిః సంచారః, అస్తి. వర్ణనీయే రఘువంశే మమ వాక్ప్రసారోఽస్తీత్యర్థః.

భావము.—నేను పరిహాసాస్పదము గాకయుండను వచ్చును. ఏలాగనిన, వజ్రముచేఁ దొలువఁబడిన రత్నమునందు దారమెట్లు సునాయాసముగాఁ బ్రవేశించుచున్నదో, యట్లే వాల్మీకిమొదలగు మహాకవులచేఁ జూపఁబడిన ద్వారమునుండి నేను బ్రవేశించెదను. అనఁగా వారిమార్గము ననుసరించి యీగ్రంథము రచించెదను.

శ్లో. సోఽహ మాజన్మశుద్ధానా మాఫలోదయకర్మణామ్,
ఆసముద్రక్షితీశానా మానాకరథవర్త్మనామ్. ౫

పదచ్ఛేదము.—సః, అహం, ఆజన్మశుద్ధానామ్, ఆఫలోదయకర్మణామ్, ఆసముద్రక్షితీశానామ్, ఆనాకరథవర్త్మనామ్.

అర్థము.—సోఽహం=అట్టినేను, ఆజన్మశుద్ధానాం-ఆజన్మ=పుట్టినది మొదలుకొని, శుద్ధానాం=పరిశుద్ధులైనవారును, ఆఫలోదయకర్మణాం-ఆఫలోదయ=ప్రయోజనము కల్గునంతవఱకు, కర్మణాం=వ్యాపారములుకలిగినవారును, ఆసముద్రక్షితీశానాం-ఆసముద్ర=సముద్రమువఱకునుండు, క్షితి=భూమికి, ఈశానాం=ప్రభువులైనవారును, ఆనాకరథవర్త్మనాం-ఆనాక=స్వర్గమువఱకు, రథవర్త్మనాం=రథమార్గము కలిగినవారును అగు, రఘూణాం=రఘువంశపు రాజులయొక్క, అన్వయం=వంశమునుగూర్చి, వక్ష్యే=చెప్పఁబోవుచున్నాను. అని పైని ఐదవశ్లోకమందలి పదార్థములతో సంబంధము.

ఆకాంక్ష.—వక్ష్యే=చెప్పగలను. కః=ఎవఁడు? అహం = నేను. కం=దేనినిగూర్చి? అన్వయం=వంశమునుగూర్చి. 'అహం' అను ప్రథమాంతకర్తృపదమును, 'అన్వయం' అను ద్వితీయాంతకర్మపదమును, 'వక్ష్యే' అను క్రియాపదమును ఉన్నవిగనుక సకర్మకకర్తృకప్రయోగము. కేషాం=ఎవరియొక్క? రఘూణాం = రఘువంశపురాజులయొక్క. రఘూణాం కథంభూతానాం=రఘువంశపురాజులు ఎట్టివారు? ఆనాకరథవర్త్మనాం =స్వర్గమువఱకు రథమార్గములు కలిగినవారు. పునః కథంభూతానాం=ఇంక నెటువంటివారు? ఆసముద్రక్షితీశానాం=సముద్రమువఱకు నుండు భూమికి ప్రభువులయినవారు. పునః కథంభూతానాం=ఇంక నెట్టివారు? ఆఫలోదయకర్మణాం=ఫలావిర్భావసిద్ధివఱకు

కర్మలు కలిగినట్టివారు. పునః కథంభూతానాం=ఇంక నెట్టివారు? ఆజన్మశుద్ధానాం= పుట్టుక మొదలుకొని పరిశుద్ధులయినవారు.

శబ్దరూపసమాసములు.—సః-సః, తౌ, తే. తచ్ఛబ్దః, దకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాంతః. అహం-అహం, ఆవాం,వయమ్. అస్మచ్ఛబ్దః దకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాంతః. అజన్మశుద్ధానాం-జన్మారభ్య ఆజన్మ-ఆజన్మ-శుద్ధాః, ఆజన్మశుద్ధాః; తేషాం, ఆజన్మశుద్ధానాం. శుద్ధస్య, శుద్ధయోః, శుద్ధానాం. ఆజన్మశుద్ధశబ్దః, అకారాంతః పుల్లింగః షష్ఠీబహువచనాంతః. ఆఫలోదయకర్మణాం-ఫలస్య ఉదయః ఫలోదయః. ఫలోదయ మభివ్యాప్య-ఆఫలోదయం. ఆఫలోదయం కర్మ, యేషాం తే-ఆఫలోదయకర్మాణః-తేషాం - ఆఫలోదయకర్మణాం. కర్మణః, కర్మణోః,కర్మణాం. ఆఫలోదయకర్మన్ శబ్దః నకారాంతః పుల్లింగః షష్ఠీబహువచనాంతః. ఆసముద్రక్షితీశానాం సముద్ర మభివ్యాప్య-ఆసముద్రం. ఆసముద్రం క్షితీశాః ఆసముద్రక్షితీశాః- తేషాం-ఆసముద్రక్షితీశానాం.క్షితీశస్య, క్షితీశయోః, క్షితీశానాం. ఆసముద్రక్షితీశశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. ఆనాకరథవర్త్మనాం - నాకమభివ్యాప్య - ఆనాకం. రథానాం వర్త్మాని రథవర్త్మాని. ఆనాకం రథవర్త్మాని యేషాం తే ఆనాకరథవర్త్మానః. తేషాం ఆనాకరథవర్త్మనాం, వర్త్మనః, వర్త్మనోః, వర్త్మనాం. ఆనాకరథవర్త్మన్‌శబ్దః. నకారాంతః పుల్లింగః షష్ఠీబహువచనాంతః.

వ్యాఖ్యా.—అవ. ఏవం రఘువంశే లబ్ధప్రవేశ స్తద్వర్ణనాం ప్రతిజానీతే సోఽహమిత్యాదిభిః పంచభిః కులకేన:—సోఽహం రఘూణామన్వయంవక్ష్య ఇత్యుత్తరత్ర సంబంధః. కింవిధానాం రఘూణా మిత్యత్రోత్తరాణి విశేషణాని యోజ్యాని. ఆజన్మనః జన్మారభ్యేత్యర్థః. 'ఆఙ్మర్యాదాభివిధ్యోః' రిత్యవ్యయీభావః. తస్య శుద్ధానామిత్యనేనసహ సుప్సుపేతి సమాసః. ఏవముత్తరత్రాపి ద్రష్టవ్యం. ఆజన్మశుద్ధానాం నిషేకాది సర్వసంస్కారసంపన్నానా మిత్యర్థః. ఆఫలోదయం-ఆఫలోదయసిద్ధేః కర్మ యేషాం తే తథోక్తాః-తేషాం,ప్రారబ్ధాంతగామినామిత్యర్థః. ఆసముద్రక్షితీశానాంసార్వభౌమానామిత్యర్థః. ఆనాకం రథవర్త్మయేషాం తేషాం, ఇంద్రసహకారిణామిత్యర్థః.అత్ర సర్వత్ర ఆఙోఽభివిధ్యర్థకత్వం ద్రష్టవ్యం. అన్యథా మర్యాదార్థత్వే జన్మాదిషు శుద్ధభావప్రసంగాల్.

భావము.—పయినచెప్పఁబడినస్థితిలోనుండు నేను పుట్టుక మొదలు పరిశుద్ధులును ప్రారంభించినకార్యంబును తుదముట్టఁ జేయువారును, సముద్రాంతభూమికి నధిపతులును, స్వర్గాంతము రథముమీఁద పోవువారును.

శ్లో. యథావిధిహుతాగ్నీనాం యథాకామార్చితార్థినామ్,
యథాపరాధదండానాం యథాకాలప్రబోధినామ్. ౬

పదచ్ఛేదము.—యథావిధిహుతాగ్నీనాం, యథాకామార్చితార్థినాం, యథాపరాధదండానాం, యథాకాలప్రబోధినాం.

అర్థము.—యథావిధిహుతాగ్నీనాం - యథావిధి=శాస్త్రము నతిక్రమింపనట్టు, హుత=హోమముచేయఁబడిన, అగ్నీనాం=గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులు గలిగినవారును, యథాకామార్చితార్థినాం-యథాకామ-అభిలాషనతిక్రమింపనట్టుగా, అర్చిత=పూజచేయఁబడిన, అర్థినాం=యాచకులుగలిగినవారును, యథాపరాధదండానాం-యథాపరాధ=అపరాధమునుఅతిక్రమింపనట్లుగా, దండానాం=దండనకలిగినవారును,యథాకాలప్రబోధినాం-యథాకాల = కాలమునతిక్రమింపకుండునట్టుగా, ప్రబోధినాం=మేల్కొనువారును.

ఆకాంక్ష.—రఘూణాం పునః కథంభూతానాం=రఘువంశపురాజులు ఇంకఎటువంటివారు? యథాకాలప్రబోధినాం-యథాకాల=కాలమునతిక్రమింప కుండునట్టుగా, ప్రబోధినాం = మేల్కొనువారు. పునః కథంభూతానాం = ఇంక నెటువంటివారు? యథాపరాధదండానాం - యథాపరాధ=అపరాధము నతిక్రమింపకుండునట్టుగా, దండానాం=దండనకలిగినవారు. పునః కథంభూతానాం=ఇంక నెట్టివారు ? యథాకామార్చితార్థినాం - యథాకామ=అభిలాషనతిక్రమింప కుండునట్టుగా, అర్చిత=పూజచేయఁబడిన, అర్థినాం=యాచకులుకలిగినవారు. పునః కథంభూతానాం=ఇంక నెటువంటివారు? యథావిధిహుతాగ్నీనాం - యథావిధి=శాస్త్రము నతిక్రమింపకుండునట్టుగా, హుత=హోమముచేయఁబడిన, అగ్నీనాం=గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులు కలిగినవారు.

శబ్దరూపసమాసములు.—యథావిధిహుతాగ్నీనాం - విధి మనతిక్రమ్య యథావిధి, యథావిధి హుతాః యథావిధిహుతాః, యథావిధిహుతాః అగ్నయో యైస్తే. యథావిధిహుతాగ్నయః-తేషాం యథావిధిహుతాగ్నీనాం.అగ్నేః,అగ్న్యోః,అగ్నీనాం. యథావిధిహుతాగ్నిశబ్దః ఇకారాంతః పుల్లింగః షష్ఠీ బహువచనాంతః. యథాకామార్చితార్థినాం-కామ మనతిక్రమ్య యథాకామం, యథాకామం అర్చితాః యథాకామార్చితాః, యథాకామార్చితాః అర్థినో యైస్తే, యథాకామార్చితార్థినః - తేషాం యథాకామార్చితార్థినాం అర్థినః, అర్థినోః, అర్థినాం. యథాకామార్చితార్థిన్‌శబ్దఃనకారాంతః పుల్లింగః షష్ఠీబహువచనాంతః. యథాపరాధదండానాం-అపరాధమనతిక్రమ్య యథాపరాధం, యథాపరాధం దండో యేషాంతే యథాపరాధదండాః-తేషాం యథాపరాధదండానాం. దండస్య, దండయోః, దండానాం. యథాపరాధదండశబ్దః అకా

రాంతః పుల్లింగః షష్ఠీబహువచనాంతః. యథాకాలప్రబోధినాం-కాల మనతిక్రమ్య
యథాకాలం, యథాకాలం ప్రబోధినః, యథాకాలప్రబోధినః - తేషాం యథాకాల
ప్రబోధినాం ప్రబోధినః, ప్రబోధినౌ, ప్రబోధినాం. యథాకాలప్రబోధిన్ శబ్దః
నకారాంతః పుల్లింగః షష్ఠీబహువచనాంతః.

వ్యాఖ్యా.—యథావిధీతి-విధిమనతిక్రమ్య యథావిధి, 'యథాసాదృశ్య' ఇత్య
వ్యయీభావః, తతో హుతశబ్దేన 'సుప్సు' పేతి సమాసః. ఏవం యథాకామార్చితా
ర్థినామిత్యాదీనా మపి ద్రష్టవ్యం. యథావిధి హుతాః అగ్నయో యైస్తేషాం, యథాకా
మం అభిలాష మనతిక్రమ్య,అర్చితార్థినాం-సత్కృతార్థినాం. యథాపరాధదండానాం
అపరాధమనతిక్రమ్య దండో యేషాం తేషాం, యథాకాలప్రబోధినాం-కాలమనతిక్ర
మ్య ప్రబోధశీలానాం, చతుర్భి ర్విశేషణై ర్దేవతాయజనాతిథిసత్కారయథార్హదండధ
రత్వ ప్రజాపాలన సమయజాగరూకత్వాని వివక్షితాని.

భావము.—శాస్త్రప్రకారము హోమములు చేయువారును, యాచకులకు
యథేచ్ఛముగఁ బరిచర్యచేయువారును, తప్పులకు తగినశిక్ష చేయువారును, ఏ కాలముల
యందు ఏయేకార్యములు చేయవలయునో ఆయాకార్యములలోఁజాగరూకులైనవారును.

శ్లో. త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణామ్,
యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినామ్. ౭

పదచ్ఛేదము. త్యాగాయ, సంభృతార్థానాం, సత్యాయ, మితభాషిణాం, య
శసే, విజిగీషూణాం, ప్రజాయై, గృహమేధినాం.

అర్థము.—త్యాగాయ = సత్పాత్రవినియోగముకొఱకు, సంభృతార్థానాం -
సంభృత = సంపాదింపఁబడిన, అర్థానాం=ధనముగలిగినవారును, సత్యాయ=సత్యము
కొఱకు, మితభాషిణాం - మిత=స్వల్పముగా, భాషిణాం = మాటాడుస్వభావముగలవా
రును, యశసే=కీర్తికొఱకు, విజిగీషూణాం=జయింపఁగోరువారును, ప్రజాయై=సంతా
నముకొఱకు, గృహమేధినాం=గృహస్థులైనవారును.

ఆకాంక్ష.—రఘూణాం పునః కథంభూతానాం = రఘువంశపురాజులు ఇంక
నెటువంటివారు? గృహమేధినాం=గృహస్థులైనవారు. కస్యై=దేనికొఱకు? ప్రజాయై=
సంతానముకొఱకు. పునః కథంభూతానాం=ఇంక నెట్టివారు? విజిగీషూణాం=జయింపఁగో
రికగలవారు. కస్మై=దేనికొఱకు? యశసే=కీర్తికొఱకు. పునః కథంభూతానాం=ఇంక నె
టువంటివారు? మితభాషిణాం-మిత=స్వల్పముగా, భాషిణాం=మాటాడువారు. కస్మై=దేని
కొఱకు? సత్యాయ=సత్యముకొఱకు. పునః కథంభూతానాం = ఇంక నెటువంటివారు?

సంభృతార్థానాం-సంభృత=సంపాదింపఁబడిన, అర్థానాం=ధనము కలిగినవారు. కస్మై=దేనికొఱకు? త్యాగాయ=సత్పాత్రవినియోగముకొఱకు.

శబ్దరూపసమాసములు.—త్యాగాయ-త్యాగాయ, త్యాగాభ్యాం, త్యాగేభ్యః. త్యాగశబ్దః అకారాంతః పుల్లింగః చతుర్థ్యేకవచనాంతః. సంభృతార్థానాం-సంభృతః అర్థో యైస్తే సంభృతార్థాః-తేషాం సంభృతార్థానాం. అర్థస్య, అర్థయోః, అర్థానాం. సంభృతార్థశబ్దః అకారాంతః పుల్లింగః షష్ఠీబహువచనాంతః. సత్యాయ-సత్యాయ, సత్యాభ్యాం, సత్యేభ్యః. సత్యశబ్దః, అకారాంతనపుంసకలింగః చతుర్థ్యేకవచనాంతః. మితభాషిణాం-మితం భాషంత ఇతి మితభాషిణః-తేషాం మితభాషిణాం. భాషిణః, భాషిణోః, భాషిణాం. మితభాషిన్ శబ్దః నకారాంతః పుల్లింగః షష్ఠీబహువచనాంతః. యశసే-యశసే, యశోభ్యాం, యశోభ్యః. యశశ్శబ్దః సకారాంతనపుంసకలింగః చతుర్థ్యేకవచనాంతః. విజిగీషూణాం విజేతు మిచ్ఛవః విజిగీషవః-తేషాం విజిగీషూణాం. విజిగీషోః, విజిగీష్వోః, విజిగీషూణాం. విజిగీషుశబ్దః ఉకారాంతః పుల్లింగః షష్ఠీబహువచనాంతః. ప్రజాయై-ప్రజాయై, ప్రజాభ్యాం, ప్రజాభ్యః. ప్రజాశబ్దః ఆకారాంతః స్త్రీలింగః చతుర్థ్యేకవచనాంతః. గృహమేధినాం-గృహైః మేధంత ఇతి గృహమేధినః-తేషాం గృహమేధినాం. గృహమేధినః, గృహమేధినోః, గృహమేధినాం. గృహమేధిన్ శబ్దః నకారాంతః పుల్లింగః షష్ఠీబహువచనాంతః.

వ్యాఖ్యా.—త్యాగాయేతి-త్యాగాయ-సత్పాత్రవినియోగాయ, సంభృతార్థానాం-సంచితధనానాం. నతు దుర్వ్యయాయ. సత్యాయ, మితభాషిణాం-మితభాషణశీలానాం, నతు ప్రాభవాయ, యశసే, విజిగీషూణాం-విజేతుమిచ్ఛానాం, నత్వర్థసంగ్రహాయ, ప్రజాయై-సంతానాయ, గృహమేధినాం-దారపరిగ్రహాణాం, నతు కామోపభోగాయ, అత్ర త్యాగాయేత్యాదిషు "తాదర్థ్యే చతుర్థీ" ఇత్యాదినా తదర్థచతుర్థీసమాసవిధానజ్ఞాపకా చ్చతుర్థీ. గృహైః దారైః మేధంతే సంగచ్ఛత ఇతి-గృహమేధినః. "జాయా చ గృహిణీ గృహః" ఇతి హలాయుధః. 'మేధృ సంగమ' ఇతి ధాతోర్ణినిః, ఏభి ర్విశేషణైః పరోపకారిత్వం సత్యవచనతాత్పర్యం యశఃపరత్వం పిత్రాణామానృణ్యశ్రద్ధా చ వివక్షితా.

భావము.—సత్పాత్రవినియోగముచేయుటకై ద్రవ్యసంపాదనము చేయువారును, హెచ్చుగా మాట్లాడిన నేమిపొరపాటువచ్చునోయని మితముగామాటాడువారును, కీర్తిసంపాదించునిమిత్తము శత్రురాజ్యముల జయింపఁ గోరువారును, పితృఋణవిముక్తికి సాధనమైన సంతానముబడయుటకై వివాహముచేసికొనువారును.

శ్లో. శైశవే ఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణామ్,

వార్ధకే మునివృత్తీనాం యోగే నాన్తే తనుత్యజామ్. ౮

పదచ్ఛేదము.—శైశవే, అభ్యస్తవిద్యానామ్, యౌవనే, విషయైషిణామ్, వార్ధకే, మునివృత్తీనామ్, యోగేన, అన్తే, తనుత్యజామ్.

అర్థము.—శైశవే=బాల్యమందు, అభ్యస్తవిద్యానాం-అభ్యస్త=నేర్వఁబడిన, విద్యానాం=విద్యలుకలిగినవారును, యౌవనే=యౌవనమందు, విషయైషిణాం-విషయ=సంభోగమును, ఏషిణాం=కోరువారును, వార్ధకే=ముసలితనమునందు, మునివృత్తీనాం-ముని=ఋషులయొక్క, వృత్తీనాం=వ్యాపారమువంటివ్యాపారముకలిగినవారును, అన్తే=శరీరత్యాగకాలమందు, యోగేన=సమాధినిష్ఠచేత, తనుత్యజాం-తను=శరీరమును, త్యజాం=విడుచువారును.

ఆకాంక్ష.—రఘూణాం పునః కథంభూతానాం=ఆరఘువంశపురాజులు ఇంక నెటువంటివారు? తనుత్యజాం-తను=శరీరమును, త్యజాం=విడుచువారు. కేన=దేనిచేత? యోగేన=పరమాత్మధ్యానముచేత. కస్మిన్=ఏసమయమునందు? అంతే=శరీరత్యాగకాలమందు. పునః కథంభూతానాం=ఇంకనెటువంటివారు? మునివృత్తీనాం-ముని=ఋషులయొక్క, వృత్తీనాం=వ్యాపారమువంటివ్యాపారముగలిగినవారు. కస్మిన్ = ఎప్పుడు? వార్ధకే=ముసలితనమందు. పునః కథంభూతానాం=ఇంకనెటువంటివారు? విషయైషిణాం-విషయ=సంభోగమును,ఏషిణాం=కోరువారు, కస్మిన్=ఏసమయమున? యౌవనే=యౌవనమందు. పునః కథం భూతానాం=ఇంక నెటువంటివారు? అభ్యస్తవిద్యానాం-అభ్యస్త=నేర్వఁబడిన, విద్యానాం=విద్యలుకలిగినవారు. కస్మిన్=ఎప్పుడు? శైశవే=బాల్యమందు.

శబ్దరూపసమాసములు.—శైశవే శిశోర్భావః శైశవం-తస్మిన్ శైశవే. శైశవే, శైశవయోః, శైశవేషు. శైశవశబ్దః అకారాన్తనపుంసకలింగః సప్తమ్యేకవచనాన్తః. అభ్యస్తవిద్యానాం-అభ్యస్తాః విద్యాః యైస్తే అభ్యస్తవిద్యాః-తేషాం అభ్యస్తవిద్యానాం. అభ్యస్తవిద్యశబ్దః అకారాన్తః పుల్లింగః షష్ఠీబహువచనాన్తః. యౌవనే - యూనో భావః యౌవనం-తస్మిన్ యౌవనే. యౌవనే, యౌవనయోః, యౌవనేషు. యౌవనశబ్దః అకారాన్తనపుంసకలింగ సప్తమ్యేకవచనాన్తః. విషయైషిణాం-విషయమిచ్ఛంతీతి విషయైషిణః-తేషాం విషయైషిణాం. ఏషిణః, ఏషిణోః, ఏషిణాం. విషయైషిన్ శబ్దః నకారాన్తః పుల్లింగః షష్ఠీబహువచనాన్తః. వార్ధకే-వృద్ధస్య భావః వార్ధకం-తస్మిన్ వార్ధకే-వార్ధకే, వార్ధకయోః, వార్ధకేషు. వార్ధకశబ్దః అకారాన్తనపుంసకలింగః సప్తమ్యేకవచనాన్తః. మునివృత్తీనాం-మునేః వృత్తిరివ వృత్తిర్యేషాం తే మునివృత్తయః-తేషాం మునివృత్తీనాం. వృత్తేః, వృత్త్యోః, వృత్తీనాం. మునివృత్తిశబ్దః ఇకారాన్తః పుల్లింగః షష్ఠీబహువచనాన్తః. యోగేన-యోగేన, యోగాభ్యాం, యో

గైః. యోగశబ్దః అకారాన్తః పుల్లింగః తృతీయైకవచనాన్తః. అంతే-అంతే, అంతయోః, అంతేషు. అంతశబ్దః అకారాన్తః పుల్లింగః సప్తమ్యేకవచనాన్తః. తనుత్యజాం-తను త్యజంతీతి తనుత్యజః-తేషాం తనుత్యజాం. త్యజః, త్యజోః, త్యజాం, తనుత్యజ్శబ్దః జకారాన్తః పుల్లింగః షష్ఠీబహువచనాన్తః.

వ్యాఖ్యా.—శైశవ ఇతి-శిశోర్భావశ్శైశవం-బాల్యం. 'శిశుత్వంశైశవంబాల్య'మిత్యమరః. 'ప్రాణిభృజ్జాతివయోవచన'ఇత్యాదినా అణ్ప్రత్యయః. తస్మిన్వయసి, అభ్యస్తవిద్యానాం, ఏతేన బ్రహ్మచర్యాశ్రమో వివక్షితః. యూనోభావః-యౌవనం, యువాదిత్వాదణ్ప్రత్యయః. తస్మిన్వయసి, విషయైషిణాం-సంభోగాభిలాషిణాం, ఏతేన గృహస్థాశ్రమో వివక్షితః. వృద్ధస్య భావః వార్ధకం-వృద్ధత్వం. 'ద్వంద్వమనోజ్ఞాదిభ్యశ్చే'తి వుఞ్ప్రత్యయః. 'వార్ధకం వృద్ధసంఘాతే వృద్ధత్వే వృద్ధకర్మణీ'తి విశ్వప్రకాశః. సంఘాతార్థేషు సామూహికో వుఞ్. తస్మిన్వార్ధకే వయసి, మునీనాం వృత్తి రివ వృత్తి ర్యేషాం తేషాం, ఏతేన వానప్రస్థాశ్రమో వివక్షితః. అంతే శరీరత్యాగకాలే, యోగేన-పరమాత్మధ్యానేన; యోగః 'సన్నహనోపాయధ్యానసంగతియుక్తి'ష్విత్యమరః. తనుం త్యజంతీతి-తనుత్యజః 'అన్యేభ్యోఽపి దృశ్యత' ఇతి క్విప్. తేషాం దేహత్యాగినాం, ఏతేన మోక్షభావో వివక్షితః.

భావము.—బాల్యమందు విద్యల నభ్యసించుచు, యౌవనమందు గృహస్థాశ్రమధర్మము నాచరించుచు, వార్ధకమునందు వానప్రస్థాశ్రమధర్మము నవలంబించుచు, నంత్యకాలమునందు పరమాత్మయోగముచేత దేహత్యాగముచేయువారును.

శ్లో. రఘూణా మన్వయం వక్ష్యే తనువాగ్విభవోఽపి సన్,
తద్గుణైః కర్ణ మాగత్య చాపలాయ ప్రచోదితః. 9

పదచ్ఛేదము.—రఘూణాం, అన్వయం, వక్ష్యే, తనువాగ్విభవః, అపి, సన్, తద్గుణైః, కర్ణం, ఆగత్య, చాపలాయ, ప్రచోదితః.

అర్థము.—(సః=ఆపొందఁబడిన ప్రవేశముకలిగిన, అహం=నేను,) తనువాగ్విభవోఽపి-తను=స్వల్పమైన, వాక్=వాక్కులయొక్క, విభవోఽపి=కలిమిగలవాఁడనైనను, తద్గుణైః-తత్=ఆరఘురాజులయొక్క, గుణైః=అజన్మశుద్ధ్యాదిగుణములచేతను, కర్ణం=నాశ్రోత్రమును, ఆగత్య=పొంది, చాపలాయ=యోచనలేనిపని చేయుట యను చపలకర్మచేయుటకొఱకు, ప్రచోదితస్సన్=ప్రేరేపింపఁబడినవాఁడనగుచు, రఘూణాం=రఘువంశపురాజులయొక్క, అన్వయం=వంశవిషయప్రబంధమును, వక్ష్యే=చెప్పఁగలను.

ఆకాంక్ష.—వక్ష్యే=చెప్పఁగలను. కః=ఎవఁడు? అహం=నేను. కం=దేనిని? అన్వయం=వంశవిషయప్రబంధమును, 'అహం' అను ప్రథమాంతకర్తృపదమును, 'అన్వ

యం' అను ద్వితీయాంతకర్మపదమును, 'వక్ష్యే' అను క్రియాపదంబు నున్నదిగనుక సక
ర్మకకర్తృకప్రయోగము. కేషాం=ఎవరియొక్క? రఘూణాం=రఘురాజులయొక్క, కథం
భూతస్సన్=ఎటువంటివాఁడనగుచు? ప్రచోదితస్సన్=ప్రేరేపింపఁబడినవాఁడనగుచు.
కస్మై=దేనికొఱకు? చాపలాయ=అవిమృశ్యకరణరూపచపలకర్మను జేయుటకొఱకు. కిం
కృత్వా=ఏమిచేసి? ఆగత్య=పొంది. కం=దేనిని? కర్ణం=నాశ్రోత్రమును. కైః=వేనిచే
తను? తద్గుణైః-తత్=ఆరఘురాజులయొక్క, గుణైః=ఆజన్మశుద్ధ్యాది గుణములచేతను.
కథంభూతోఽపి=ఎటువంటివాఁడనయినను? తనువాగ్విభవోఽపి-తను=స్వల్పమయిన,
వాక్=వాక్కుయొక్క, విభవోఽపి=కలిమికలిగినవాఁడనయినను.

శబ్దరూపసమాసములు.—రఘూణాం-రఘోః, రఘ్వోః, రఘూణాం. రఘు
శబ్దః ఉకారాంతః పుల్లింగః షష్ఠీబహువచనాంతః. అన్వయం-అన్వయం, అన్వయౌ,
అన్వయాన్. అన్వయశబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. వక్ష్యే-
వక్ష్యే, వక్ష్యావహే, వక్ష్యామహే. 'వచ' పరిభాషణ ఇత్యస్మాద్ధాతో స్సకర్మకాత్క
ర్తరిభవిష్యదర్థే లృట్యాత్మ నేపదే ఉత్తమపురుషైకవచనాంతః. తనువాగ్విభవః, వాచాం
విభవః వాగ్విభవః, తనుః వాగ్విభవో యస్యసః తనువాగ్విభవః. విభవః, విభవౌ, విభ
వాః. తనువాగ్విభవశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. అపి-అవ్య
యమ్. సన్-సన్, సంతౌ, సంతః. సచ్ఛబ్దః తకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాం
తః. తద్గుణైః-తేషాం గుణాః తద్గుణాః-తైః తద్గుణైః. గుణేన గుణాభ్యాం, గుణైః. తద్గుణ
శబ్దః అకారాంతః పుంలింగః తృతీయాబహువచనాంతః. కర్ణం-కర్ణం, కర్ణౌ, కర్ణాన్.
కర్ణశబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. ఆగత్య-ఆఙ్ పూర్వాత్ 'గమ్
ౢ'-గతౌ ఇత్యస్మాద్ధాతోః ల్యప్ ప్రత్యయః. చాపలాయ-చపలస్య కర్మ చాపలం-తస్మై
చాపలాయ. చాపలాయ, చాపలాభ్యాం, చాపలేభ్యః. చాపలశబ్దః అకారాన్తనపుంసక
లింగః చతుర్థ్యేకవచనాంతః. ప్రచోదితః-ప్రచోదితః, ప్రచోదితౌ, ప్రచోదితాః.
ప్రచోదితశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః.

వ్యాఖ్యా.—రఘూణామితి. సోఽహం-లబ్ధప్రవేశోఽహాం, తనువాగ్విభవోఽ
ల్పవాణీప్రసారోఽపి, తద్గుణైస్తేషాం రఘూణాం గుణైః ఆజన్మశుద్ధ్యాదిభిః కర్తృభిః,
కర్ణం-మమ శ్రోత్రం, ఆగత్య, చాపలాయ, యువాదిత్వాత్కర్మణ్యణ్. చాపలం-చపల
కర్మ-అవిమృశ్యకరణరూపం కర్మ కర్తుం. 'క్రియార్థోప' దేత్యాదినా చతుర్థీ, ప్రచో
దితః ప్రేరితస్సన్. రఘూణాం, అన్వయం-అన్వయవిషయప్రబంధం, వక్ష్యే.

భావము.—నేను వాక్కులకలిమి మెండుగా లేనివాఁడనయినను, ఆరఘువం
శపురాజులగుణములె నన్నుఁ బురికొల్పుటచే బాల్యచాపలముచే నీరఘువంశ మను
మహాకావ్యమును రచియింపఁబూనితి.

అవ. సంప్రతి స్వప్రబన్ధపరీక్షార్థం సతః ప్రార్థయతే.—

శ్లో. తం సన్తః శ్రోతుమర్హన్తి సదసద్వ్యక్తిహేతవః,
హేమ్నస్సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధి శ్శ్యామికాపి వా. ౧౦

పదచ్ఛేదము.—తం, సన్తః, శ్రోతుం, అర్హన్తి, సదసద్వ్యక్తిహేతవః, హేమ్నః, సంలక్ష్యతే, హి, అగ్నౌ, విశుద్ధిః, శ్యామికా, అపి, వా.

అర్థము.—తం=ఆరఘువంశమను ప్రబంధమును, సదసద్వ్యక్తిహేతవః-సదసత్=గుణదోషములయొక్క, వ్యక్తి=వివేచనమందు, హేతవః=కర్తలయిన, సన్తః=విద్వాంసులు, శ్రోతుం=వినుటకు, అర్హన్తి=తగియున్నారు. తథాహి=అదియుక్తము, హేమ్నః=సువర్ణముయొక్క, విశుద్ధిః=నిర్దోషస్వరూపమైనను, శ్యామికాపివా=లోహాంతరసంసర్గాదిదోషమైనను, అగ్నౌ=యజ్ఞేశ్వరునియందు, సంలక్ష్యతే=కనంబడుచున్నది.

ఆకాంక్ష.—సంలక్ష్యతే=కనంబడుచున్నది. కైః=ఎవరిచేతను? జనైః=జనులచేతను, కావా=ఏదైనను, విశుద్ధిః=నిర్దోషస్వరూపమైన, కావా=ఏదైనను, శ్యామికాపివా=లోహాంతరసంసర్గాదిదోషమైనను, 'జనైః' అను తృతీయాన్తకర్తృపదమును, 'విశుద్ధిః' 'శ్యామికా' అను ప్రథమాంతకర్మపదములును, 'సంలక్ష్యతే' అను క్రియాపదంబును ఉన్నది గనుక కర్మణిప్రయోగము. కస్య=దేనియొక్క? హేమ్నః=సువర్ణముయొక్క. కస్మిన్=దేనియందు? అగ్నౌ=యజ్ఞేశ్వరునియందు. తథాహి=అదియుక్తము. అర్హన్తి=తగియున్నారు. కే=ఎవరు? సన్తః=విద్వాంసులు. 'సన్తః' అనెడు ప్రథమాంతకర్తృపదమును, 'అర్హన్తి' అనెడు క్రియాపదంబు నున్నది గనుక అకర్మకకర్తృకప్రయోగము. కిం కర్తుం=ఏమిచేయుటకు? శ్రోతుం=వినుటకు, కం=దేనిని? తం=ఆరఘువంశప్రబంధమును, సంతః కథంభూతాః=విద్వాంసులు ఎటువంటివారు? సదసద్వ్యక్తిహేతవః-సదసత్=గుణదోషములయొక్క, వ్యక్తి=వివేచనయందు, హేతవః=కర్తలయినవారు.

శబ్దరూపసమాసములు.—తం-తం, తౌ, తాన్. తచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. సంతః-సన్, సంతౌ, సంతః. సచ్ఛబ్దః తకారాంతః పుంలింగః ప్రథమాబహువచనాంతః. శ్రోతుం-'శ్రుశ్రవణే'ఇత్యస్మాద్ధాతో స్తుమున్ ప్రత్యయః. అర్హంతి-అర్హతి, అర్హతః, అర్హంతి 'అర్హ పూజాయా' మిత్యస్మాద్ధాతో రకర్మకాత్కర్తరి వర్తమానే లట్ పరస్మైపదే ప్రథమపురుషబహువచనాంతః. సదసద్వ్యక్తిహేతవః-సంశ్చ అసంశ్చ సదసన్తౌ, సదసతోః వ్యక్తిః సదసద్వ్యక్తిః, సదసద్వ్యక్తౌ హేతవః సదసద్వ్యక్తిహేతవః - హేతుః, హేతూ, హేతవః. సదసద్వ్యక్తిహేతు

శబ్దః ఉకారాంతః పుంలింగః ప్రథమాబహువచనాంతః. హేమ్నః - హేమ్నః, హేమ్నోః, హేమ్నాం. హేమన్‌శబ్దః నకారాంతనపుంసకలింగః షష్ఠ్యేకవచనాంతః. సంలక్ష్యతే-సంలక్ష్యతే, సంలక్ష్యేతే, సంలక్ష్యంతే. సంపూర్వకాత్ 'లక్ష' దర్శనాంకనయోరిత్యస్మాద్ధాతోః సకర్మకాత్కర్మణి వర్తమానే లట్ ఆత్మనేపదే ప్రథమపురుషైకవచనాంతః. హి-అవ్యయమ్. అగ్నౌ-అగ్నౌ, అగ్న్యోః, అగ్నిషు. అగ్నిశబ్ద ఇకారాంతః పుంలింగః సప్తమ్యేకవచనాంతః. విశుద్ధిః - విశుద్ధిః, విశుద్ధీ, విశుద్ధయః. విశుద్ధిశబ్దః ఇకారాంతస్త్రీలింగః ప్రథమైకవచనాంతః. శ్యామికా-శ్యామికా, శ్యామికే, శ్యామికాః. శ్యామికాశబ్దః ఆకారాంతస్త్రీలింగః ప్రథమైకవచనాన్తః. అపి-అవ్యయమ్. వా-అవ్యయమ్.

వ్యాఖ్యా.—తమితి. తం-రఘువంశాఖ్యం ప్రబంధం, సదసతోః-గుణదోషయోః, వ్యక్తౌ, హేతవః-కర్తారః, సంతః, శ్రోతుమర్హంతి. తథాహి. హేమ్నః, విశుద్ధిః-నిర్దోషస్వరూపం, శ్యామికాపివా-లోహాంతరసంసర్గాదిదోషో వా. అగ్నౌ, సంలక్ష్యతే, నాన్యత్ర, తద్వదత్రాపి సంత ఏవ గుణదోషవివేకాధికారిణః నాన్య ఇతి భావః.

భావము.—బంగారుయొక్క స్వచ్ఛత్వమును ఇతరలోహసంసర్గజన్యమాలిన్యమును అగ్నియందుఁ గనిపెట్టఁబడెడురీతిని గుణదోషవిమర్శాధికారు లయిన విద్వాంసులే గుణదోషములను విమర్శించి యీప్రబంధమునందలి గుణవిశేషంబులను గూర్చి సంతోషింపఁగోరెదరు.

అథ. వర్ణ్యం వస్తూపక్షిపతి.—

శ్లో. వైవస్వతో మనుర్నామ మాననీయో మనీషిణామ్,
ఆసీన్మహీక్షితా మాద్యః ప్రణవ శ్ఛందసా మివ. ౧౧

పదచ్ఛేదము.—వైవస్వతః, మనుః, నామ, మాననీయః, మనీషిణాం, ఆసీత్, మహీక్షితాం, ఆద్యః, ప్రణవః, ఛందసాం, ఇవ.

అర్థము.—మనీషిణాం=విద్వాంసులకు, మాననీయః=పూజ్యుఁడయినవాఁడును, ఛందసాం=వేదములకు, ప్రణవ ఇవ=ఓంకారమువలె, మహీక్షితాం=క్షితీశ్వరులకు, ఆద్యః=ఆదిభూతుఁడునైన, వైవస్వతో నామ=వైవస్వతుఁ డని ప్రసిద్ధుఁడయిన, మనుః=మను మహారాజు, ఆసీత్=ఉండెను.

ఆకాంక్ష.—ఆసీత్=ఉండెను. కః=ఎవఁడు? మనుః=మనుమహారాజు, 'మనుః' అను ప్రథమాంతకర్తృపదమును, 'ఆసీత్' అను క్రియాపదంబు నున్నది గనుక అకర్మ

కర్తృకప్రయోగము. మనుః కథంభూతః=మనుమహారాజు ఎటువంటివాఁడు? వైవస్వతో నామ=వైవస్వతుఁడు అని ప్రసిద్ధుఁడయినవాఁడు. పునః కథంభూతః=ఇంకనెటువంటివాడు? ఆద్యః=ఆదిభూతుఁడయినవాఁడు. కేషాం=ఎవరికి? మహీక్షితాం=క్షితీశ్వరులకు. కఇవ=దేనివలె? ప్రణవ ఇవ=ఓంకారమువలె. కేషాం=వేనికి? ఛందసాం=వేదములకు. పునః కథం భూతః=ఇంక నెటువంటివాఁడు? మాననీయః=పూజ్యుఁడయినవాఁడు. కేషాం=ఎవరికి? మనీషిణాం=విద్వాంసులకు.

శబ్దరూపసమాసములు.—వైవస్వతః - వివస్వతో ఽపత్యం పుమాన్వైవస్వతః. వైవస్వతః, వైవస్వతౌ, వైవస్వతాః. వైవస్వతశబ్దః అకారాంతః పుల్లింగః.. ప్రథమైకవచనాన్తః. మనుః-మనుః, మనూ, మనవః. మనుశబ్దః ఉకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాంతః. నామ-అవ్యయమ్. మాననీయః-మానితుం యోగ్యః మాననీయః. మాననీయః, మాననీయౌ, మాననీయాః. మాననీయశబ్దః అకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాంతః. మనీషిణాం-మనస ఈషిణో మనీషిణః. తేషాం మనీషిణాం. మనీషిణః, మనీషిణోః, మనీషిణాం. మనీషిన్శబ్దః నకారాంతః పుల్లింగ షష్ఠీబహువచనాంతః. ఆసీత్-ఆసీత్, ఆస్తాం, ఆసన్. 'అసభువి' ఇత్యస్మాద్ధాతోరకర్మకాత్కర్తరిభూతే లఙ్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః. మహీక్షితాం-మహీం క్షియన్తీతి మహీక్షితః తేషాం-మహీక్షితాం. మహీక్షితః, మహీక్షితోః, మహీక్షితాం. మహీక్షిచ్ఛబ్దః తకారాన్తః పుల్లింగషష్ఠీబహువచనాంతః. ఆద్యః-ఆద్యః, ఆద్యౌ, ఆద్యాః. ఆద్యశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనాన్తః. ప్రణవః-ప్రణవః, ప్రణవౌ, ప్రణవాః. ప్రణవశబ్దః అకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాంతః. ఛందసాం-ఛందసః, ఛందసోః, ఛందసాం. ఛందశ్శబ్దః సకారాంతనపుంసకలింగః షష్ఠీబహువచనాంతః. ఇవ-అవ్యయమ్.

వ్యాఖ్యా.—వైవస్వత ఇతి.—మనస ఈషిణో మనీషిణః-ధీరాః, విద్వాంస ఇతి యావత్. పృషోదరాదిత్వాత్సాధుః. తేషాం, మాననీయః-పూజ్యః-ఛందసాం వేదానాం, 'ఛందః పద్యేచ వేదే'చేతి విశ్వః. ప్రణవ ఇవ-ఓంకార ఇవ, మహీం క్షియన్తి ఈశత ఇతి మహీక్షితః-క్షితీశ్వరాః, క్షిధాతోరైశ్వర్యార్థాత్క్విప్-తుగాగమశ్చ, తేషా, మాద్య-ఆదిభూతః. వివస్వతస్సూర్యస్యాపత్యం పుమాన్వైవస్వతో నామ-వైవస్వత ఇతి ప్రసిద్ధః, మనుః, ఆసీత్.

భావము.—బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడై వేదంబులకుఁ బ్రణవమువలె రాజులలో మొదటివాఁడయిన వైవస్వతమను వనుమహారాజు గలఁడు. (వైవస్వతుఁడు అనఁగా సూర్యపుత్రుఁడు.)

శ్లో. తదన్వయే శుద్ధిమతి ప్రసూత శ్శుద్ధిమత్తరః,
దిలీప ఇతి రాజేందు రిందుః క్షీరనిధా వివ. ౧౨

పదచ్ఛేదము.—తదన్వయే, శుద్ధిమతి, ప్రసూతః, శుద్ధిమత్తరః, దిలీపః, ఇతి, రాజేందుః, ఇందుః, క్షీరనిధౌ, ఇవ.

అర్థము.—శుద్ధిమతి=దోషరహితమైన, తదన్వయే-తత్ = ఆమనుమహారాజుయొక్క, అన్వయే=కులమందు, శుద్ధిమత్తరః=అత్యంతపరిశుద్ధుఁడయిన, దిలీప ఇతి=దిలీపుఁడు అని ప్రసిద్ధుఁడయిన, రాజేందుః=రాజశ్రేష్ఠుఁడు, క్షీరనిధౌ=క్షీరసముద్రమునందు, ఇందురివ=చంద్రునివలెనే, ప్రసూతః=పుట్టెను.

ఆకాంక్ష.—ప్రసూతః=పుట్టెను. కః=ఎవఁడు? రాజేందుః=రాజశ్రేష్ఠుఁడు. 'రాజేందుః' అను ప్రథమాంతకర్తృపదమును, 'ప్రసూతః' అను కారకక్రియాపదంబున్నది గనుక అకర్మకకర్తృకప్రయోగము. కస్మిన్=దేనియందు? తదన్వయే-తత్=ఆమనుమహారాజుయొక్క, అన్వయే=వంశమునందు. క ఇవ=ఎవనివలె? ఇందురివ=చంద్రునివలె. కస్మిన్=దేనియందు? క్షీరనిధౌ=పాలసముద్రమునందు. రాజేందుః కథంభూతః=రాజశ్రేష్ఠుఁడు ఎటువంటివాఁడు? దిలీపఇతి=దిలీపుఁడు అని ప్రసిద్ధుఁడయినవాఁడు. పునః కథంభూతః=ఇంక నెటువంటివాఁడు? శుద్ధిమత్తరః=అత్యంత పరిశుద్ధుఁడయినవాఁడు. తదన్వయే కథంభూతే = ఆమనుమహారాజుయొక్కకులమెట్టిది? శుద్ధిమతి=దోషరహితమైనది.

శబ్దరూపసమాసములు.—తదన్వయే-తస్య అన్వయః తదన్వయః, తస్మిన్ తదన్వయే. అన్వయే, అన్వయోః, అన్వయేషు. తదన్వయశబ్దః అకారాంతః పుల్లిఙ్గస్సప్తమ్యేకవచనాంతః. శుద్ధిమతి-శుద్ధిరస్యాస్తీతి శుద్ధిమాన్ తస్మిన్ శుద్ధిమతి, శుద్ధిమతి, శుద్ధిమతోః, శుద్ధిమత్సు. శుద్ధిమచ్ఛబ్దః తకారాంతః పుల్లింగ స్సప్తమ్యేకవచనాంతః. ప్రసూతః-ప్రసూతః, ప్రసూతౌ, ప్రసూతాః, ప్రసూతశబ్దః అకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాంతః. శుద్ధిమత్తరః-అతిశయేన శుద్ధిమాన్ శుద్ధిమత్తరః. శుద్ధిమత్తరః, శుద్ధిమత్తరౌ, శుద్ధిమత్తరాః. శుద్ధిమత్తరశబ్దః అకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాంతః. దిలీపః-దిలీపః, దిలీపౌ, దిలీపాః. దిలీపశబ్దః అకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాన్తః. ఇతి అవ్యయమ్. రాజేందుః-రాజా ఇందురివ రాజేందుః. ఇందుః, ఇందూ, ఇందవః. రాజేందుశబ్దః ఉకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాంతః. ఇందుః-ఇందుః, ఇందూ, ఇందవః. ఇందు శబ్దః ఉకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాంతః. క్షీరనిధౌ-క్షీరస్య నిధిః క్షీరనిధిః తస్మిన్ క్షీరనిధౌ. నిధౌ, నిధ్యోః, నిధిషు. క్షీరనిధిశబ్దః ఇకారాంతః పుల్లింగః సప్తమ్యేకవచనాంతః. ఇవ-అవ్యయమ్.

వ్యాఖ్యా.—తదన్వయఇతి—శుద్ధిరస్యాస్తీతి శుద్ధిమాన్ తస్మిన్ శుద్ధిమతి-నిర్దోషే, తదన్వయే, తస్య-మనోః, అన్వయే కులే "అన్వవాయోన్వయో వంశోగోత్రం చాభిజనంకుల"మితి హలాయుధః. అతిశయేన-శుద్ధిమాన్ శుద్ధిమత్తరః. "ద్వివచనవిభ" జేత్యాదినా తరప్. దిలీప ఇతి ప్రసిద్ధః, రాజా, యిందురివ రాజేందుః-రాజశ్రేష్ఠః, "ఉపమితం వ్యాఘ్రాదిభి"రిత్యాదినాసమాసః.క్షీరనిధౌ,ఇందురివ, ప్రసూతో-జాతః.

భావము.—క్షీరసముద్రమునందు చంద్రుఁడుదయమయినట్లు ఆ నిర్దుష్టమయిన వంశశమునందు మిక్కిలి పరిశుద్ధుఁడయిన దిలీపుఁ డనురాజచంద్రుఁడు పుట్టెను

అవ. వ్యూఢేత్యాదిత్రిభిశ్శ్లోకై ర్దిలీపం విశినష్టి.—

శ్లో. వ్యూఢోరస్కో వృషస్కంధ స్సాలప్రాంశు ర్మహాభుజః,
ఆత్మకర్మక్షమం దేహం క్షాత్రో ధర్మ ఇవాశ్రితః. ౧౩

పదచ్ఛేదము.—వ్యూఢోరస్కః, వృషస్కంధః, సాలప్రాంశుః, మహాభుజః, ఆత్మకర్మక్షమం, దేహం, క్షాత్రః ధర్మః, ఇవ, ఆశ్రితః.

అర్థము.—వ్యూఢోరస్కః-వ్యూఢ=వెడఁదయైన, ఉరస్కః = ఱొమ్ముకలిగినవాఁడును, వృషస్కంధః-వృష=వృషభముయొక్క, స్కంధః=మూఁపువంటిమూఁపుకలిగినవాఁడును, సాలప్రాంశుః-సాల=సాలవృక్షమువలె, ప్రాంశుః=ఉన్నతుఁడును, మహాభుజః-మహత్=నిడుదలైన, భుజః=భుజములుఁగలిగినవాఁడునునై, ఆత్మకర్మక్షమం-ఆత్మ=తనయొక్క, కర్మ=వ్యాపారమునకు, క్షమం=అనురూపమయిన, దేహం=శరీరమును,ఆశ్రితః=పొందిన, క్షాత్రః = క్షత్రసంబంధియగు, ధర్మ ఇవస్థితః=పరాక్రమమో యన్నట్లుండెను.

ఆకాంక్ష.—స కఇవ స్థితః=ఆదిలీపమహారాజు దేనివలె నుండెను? ధర్మ ఇవ స్థితః=పరాక్రమమో యన్నట్లుండెను. ధర్మః కథంభూతః=ఆ పరాక్రమము ఎట్టిది? క్షాత్రః=క్షత్రసంబంధమయినది. పునఃకథంభూతః = ఇంక నెట్టిది? ఆశ్రితః=పొందినట్టిది. కం=దేనిని? దేహం=శరీరమును, దేహం కథంభూతం=శరీరము ఎటువంటిది? ఆత్మకర్మక్షమం-ఆత్మ=తనయొక్క, కర్మ=వ్యాపారమునకు, క్షమం=తగినది. స పునః కథంభూతః=ఆదిలీపమహారాజు ఇంక నెట్టివాఁడు? మహాభుజః-మహత్=నిడుదలయిన, భుజః=భుజములుకలిగినవాఁడు. పునః కథంభూతః=ఇంక నెట్టివాఁడు? సాలప్రాంశుః-సాల=సాలవృక్షమువలె, ప్రాంశుః=ఉన్నతుఁడయినవాఁడు. పునః కథంభూతః=ఇంక నెట్టివాఁడు? వృషస్కంధః-వృష=వృషభముయొక్క, స్కంధః=మూఁపువంటిమూఁపుగలిగినవాఁడు, పునః కథంభూతః=ఇంక నెట్టివాఁడు? వ్యూఢోరస్కః-వ్యూఢ=వెడఁదయైన, ఉరస్కః=ఱొమ్ముగలిగినవాఁడు.

శబ్దరూపసమాసములు.—వ్యూఢోరస్కః-వ్యూఢం ఉరః యస్య సః వ్యూఢోరస్కః. వ్యూఢోరస్కః, వ్యూఢోరస్కౌ, వ్యూఢోరస్కాః. వ్యూఢోరస్కశబ్దః అకారాంతఃపుల్లింగః ప్రథమైకవచనాంతః. వృషస్కంధః-వృషస్య స్కంధ ఇవ స్కంధో యస్యసః వృషస్కంధః. స్కంధః,స్కంధౌ, స్కంధాః. వృషస్కంధశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. సాలప్రాంశుః-సాల ఇవ ప్రాంశుః సాలప్రాంశుః. ప్రాంశుః, ప్రాంశూ, ప్రాంశవః. సాలప్రాంశుశబ్దః ఉకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. మహాభుజః-మహాంతౌ భుజౌ యస్య సః మహాభుజః. భుజః, భుజౌ, భుజాః. మహాభుజశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. ఆత్మకర్మక్షమం-ఆత్మనః కర్మ, ఆత్మకర్మ, ఆత్మకర్మణః క్షమః, ఆత్మకర్మక్షమః తం ఆత్మకర్మక్షమం. క్షమం, క్షమౌ, క్షమాన్. ఆత్మకర్మక్షమశబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. దేహం-దేహం, దేహౌ, దేహాన్. దేహశబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. క్షాత్రః-క్షత్రస్యాయం క్షాత్రః. క్షాత్రః, క్షాత్రౌ, క్షాత్రాః. క్షాత్రశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. ధర్మః-ధర్మః, ధర్మౌ, ధర్మాః. ధర్మశబ్దః అకారాంతః పుల్లింగః, ప్రథమైకవచనాంతః. ఇవ-అవ్యయమ్. ఆశ్రితః-ఆశ్రితః,ఆశ్రితౌ,ఆశ్రితాః. ఆశ్రితశబ్దః అకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాంతః.

వ్యాఖ్యా.—వ్యూఢం-విపులం ఉరోయస్యసః వ్యూఢోరస్కః, 'ఉరః ప్రభృతిభ్యః క'బితి కప్. 'వ్యూఢం విపులం భద్రం స్ఫారం సమం వరిష్ఠం' చేతి యాదవః, వృషస్య స్కంధఇవస్కంధో యస్యసః వృషస్కంధః ''సప్తమ్యుపమా'' నేత్యాదినా ఉత్తరపదలోపీ బహువ్రీహిః. సాలో-వృక్ష ఇవ, ప్రాంశు-రున్నతస్సాలప్రాంశుః ''ప్రాకార వృక్షయోస్సాల స్సాలస్సర్జతరుస్స్మృత''ఇతి యాదవః. మహాభుజో మహాబాహుః ఆత్మకర్మక్షమం-స్వవ్యాపారానురూపం, దేహం, ఆశ్రితః-ప్రాప్తః. క్షాత్రః-క్షత్రసంబంధీ ధర్మ ఇవ స్థితః, మూర్తిమాన్ పరాక్రమ ఇవ స్థిత ఇత్యుత్ప్రేక్షా.

భావము.—విశాలమయినఱొమ్మును, వృషభముయొక్క మూపురమువంటి మూపును, సాలవృక్షమువలె ఔన్నత్యమును, ఆజానుబాహువులునుకలిగి క్షత్రధర్మమయిన పరాక్రమమే పురుషుఁడైపుట్టెనో యను భ్రాంతికలుగఁజేయు దేహముకలిగినవాఁడును.

శ్లో. సర్వాతిరిక్తసారేణ సర్వతేజోభిభావినా,
స్థిత స్సర్వోన్నతే నోర్వీం క్రాంత్వా మేరు రివాత్మనా. ౧౪

పదచ్ఛేదము.—సర్వాతిరిక్తసారేణ, సర్వతేజోభిభావినా, స్థితః, సర్వోన్నతేన, ఉర్వీం, క్రాన్త్వా, మేరుః, ఇవ, ఆత్మనా.

అర్థము.—సర్వాతిరిక్తసారేణ-సర్వ=సమస్తభూతములకంటె, అతిరిక్త=అధికమయిన, సారేణ=బలముగలదియు, సర్వతేజోఽభిభావినా-సర్వ = సమస్తభూతంబులను, తేజః=తేజస్సుచేత, అభిభావినా=తిరస్కరించునట్టిదియు, సర్వోన్నతేన-సర్వ=అందఱికంటెను (సమస్తపదార్థముల కంటెను), ఉన్నతేన=ఉన్నతమయిన, ఆత్మనా=శరీరముచేత, మేరురివ=మేరుపర్వతమువలె, ఉర్వీం=భూమిని, క్రాన్త్వా=ఆక్రమించి, స్థితః=ఉన్నవాఁడును.

ఆకాంక్ష.—సపునః కథంభూతః=ఆదిలీపమహారాజు ఇంక నెటువంటివాఁడు? స్థితః=ఉన్నవాఁడు. కిం కృత్వా=ఏమిచేసి? క్రాన్త్వా = ఆక్రమించి. కాం=దేనిని? ఉర్వీం=భూమిని. క ఇవ=దేనివలె? మేరురివ = మేరుపర్వతమువలె. కేన=దేనిచేతను? ఆత్మనా=శరీరముచేతను. ఆత్మనా కథంభూతేన=ఆశరీర మెటువంటిది? సర్వోన్నతేన-సర్వ = అందఱికంటెను (సమస్తపదార్థముల కంటెను), ఉన్నతేన=ఉన్నతమయినది. పునః కథంభూతేన=ఇంక నెటువంటిది? సర్వ తేజోఽభిభావినా - సర్వ=సమస్తభూతంబులను, తేజః=తేజస్సుచేత, అభిభావినా = తిరస్కరించునట్టిది. పునః కథంభూతేన=ఇంక నెటువంటిది ? సర్వాతిరిక్తసారేణ-సర్వ = సమస్తభూతంబులకంటె, అతిరిక్త=అధికమయిన, సారేణ=బలముకలిగినది.

శబ్దరూపసమాసములు.—సర్వాతిరిక్తసారేణ-సర్వేభ్యః. అతిరిక్తః సర్వాతిరిక్తః, సర్వాతిరిక్తః సారో యస్యసః సర్వాతిరిక్తసారః, తేన సర్వాతిరిక్తసారేణ. సారేణ, సారాభ్యాం, సారైః. సర్వాతిరిక్తసారశబ్దః అకారాంతః పుల్లింగః తృతీయైకవచనాంతః. సర్వతేజోఽభిభావినా-సర్వాణి తేజసా అభిభవతీతి సర్వతేజోఽభిభావీ, తేన సర్వతేజోఽభిభావినా.అభిభావినా,అభిభావిభ్యాం, అభిభావిభిః. సర్వతేజోఽభిభావిన్ శబ్దః నకారాంతః పుల్లింగః తృతీయైకవచనాంతః. స్థితః-స్థితః, స్థితౌ, స్థితాః. స్థిత శబ్దః అకారాంతః పుల్లింగః ప్రథమైకవచనాంతః. సర్వోన్నతేన-సర్వేభ్యః ఉన్నతః సర్వోన్నతః, తేన సర్వోన్నతేన. ఉన్నతేన, ఉన్నతాభ్యాం, ఉన్నతైః. సర్వోన్నత శబ్దః అకారాంతః పుల్లింగః తృతీయైకవచనాంతః. ఉర్వీం-ఉర్వీం, ఉర్వ్యౌ,ఉర్వీః. ఉర్వీశబ్దః ఈకారాంత స్త్రీలింగః ద్వితీయైకవచనాంతః. క్రాంత్వా-క్త్వాప్రత్యయాంత మవ్యయమ్. మేరుః-మేరుః, మేరూ, మేరవః. మేరుశబ్దః ఉకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. ఇవ-అవ్యయమ్. ఆత్మనా-ఆత్మభ్యాం, ఆత్మభిః ఆత్మశబ్దః నకారాంతః పుంలింగః తృతీయైకవచనాంతః.

వ్యాఖ్యా.—సర్వాతిరిక్తేతి-సర్వాతిరిక్తాసారేణ-సర్వేభ్యో భూతేభ్యోఽధిక బలేన. సర్వాణి భూతాని తేజసా అభిభవతీతి సర్వతేజోఽభిభావీ తేన, సర్వేభ్య ఉన్న

పదచ్ఛేదము.—తస్య, దాక్షిణ్యరూఢేన, నామ్నా, మగధవంశజా, పత్నీ, సుదక్షిణా, ఇతి, ఆసీత్, అధ్వరస్య, ఇవ, దక్షిణా.

అర్థము.—తస్య=ఆదిలీపమహారాజునకు, మగధవంశజా-మగధ=మగధదేశాధీశ్వరునియొక్క, వంశ=కులమందు, జా=పుట్టినట్టియు, దాక్షిణ్యరూఢేన-దాక్షిణ్య=పరాభిప్రాయానువర్తనముచేత, రూఢేన=ప్రసిద్ధమైన, నామ్నా=నామధేయముచేత, సుదక్షిణేతి=సుదక్షిణయను ప్రసిద్ధమైన, పత్నీ=భార్య, అధ్వరస్య=యజ్ఞమునకు, దక్షిణేవ=దక్షిణాఖ్యపత్నివలెనే, ఆసీత్=అయెను.

ఆకాంక్ష.— ఆసీత్=అయెను. కా=ఎవతె? పత్నీ=భార్య. 'పత్నీ' అనెడి ప్రథమాంతకర్తృపదమును, 'ఆసీత్' అనెడి క్రియాపదంబు నున్నవి గనుక, అకర్మకకర్తృప్రయోగము. కేవ=ఏదివలె? దక్షిణేవ=దక్షిణాఖ్యపత్నివలెనే. కస్య=దేనికి? అధ్వరస్య = యాగమునకు. పత్నీకథంభూతా = ఆభార్య ఎట్టిది ? సుదక్షిణేతి = సుదక్షిణ అని ప్రసిద్ధమయినది. కేన=దేనిచేత? నామ్నా=నామధేయముచేత, నామ్నా కథంభూతేన=నామధేయమెట్టిది? దాక్షిణ్యరూఢేన-దాక్షిణ్య=పరాభిప్రాయానువర్తనముచేత, రూఢేన=ప్రసిద్ధమైనది. పునఃకథంభూతా = ఇంకనెట్టిది? మగధవంశజా-మగధ=మగధదేశాధీశ్వరునియొక్క, వంశ = కులమందు, జా=పుట్టినది. కస్య=ఎవనికి? తస్య=ఆదిలీపమహారాజునకు.

శబ్దరూపసమాసములు.—తస్య-తస్య, తయోః, తేషాం, తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనాన్తః. దాక్షిణ్యరూఢేన-దక్షిణాయాః, భావః, దాక్షిణ్యం; దాక్షిణ్యేన, రూఢం, దాక్షిణ్యరూఢం, తేన, దాక్షిణ్యరూఢేన; రూఢేన, రూఢాభ్యాం, రూఢైః. దాక్షిణ్యరూఢశబ్దః అకారాన్తనపుంసకలింగః తృతీయైకవచనాన్తః. నామ్నా - నామ్నా, నామభ్యాం, నామభిః. నామన్ శబ్దః నకారాన్తనపుంసకలింగః తృతీయైకవచనాన్తః. మగధవంశజా-మగధస్యవంశః, మగధవంశః, మగధవంశే జాతా, మగధవంశజా; వంశజా, వంశజే, వంశజాః. మగధవంశజాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనాన్తః. పత్నీ-పత్నీ, పత్న్యౌ, పత్న్యః. పత్నీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనాన్తః. సుదక్షిణా-సుదక్షిణా, సుదక్షిణే, సుదక్షిణాః. సుదక్షిణాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనాన్తః. ఇతి, అవ్యయమ్. ఆసీత్ - ఆసీత్, ఆస్తాం, ఆసన్. 'అసభువి' త్యస్మాద్ధాతో రకర్మకాత్కర్తరిభూతేలజి పరస్మైపదే ప్రథమపురుషైకవచనాన్తః. అధ్వరస్య-అధ్వరస్య, అధ్వరయోః, అధ్వరాణాం. అధ్వరశబ్దః అకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనాన్తః. ఇవ. అవ్యయము. దక్షిణా-దక్షిణా, దక్షిణే, దక్షిణాః. దక్షిణాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనాన్తః.

వ్యాఖ్యా.—తస్యేతి. తస్యరాజ్ఞః, మగధవంశే జాతా మగధవంశజా, 'సప్తమ్యాం జనేర్డ' ఇతిడప్రత్యయః, ఏతేనాభిజాత్యముక్తం; దాక్షిణ్యం పరచ్ఛందానువర్తనం, (ని) 'దక్షిణస్సరళోదారపరచ్ఛందానువర్తిష్వి'తి శాశ్వతః, తేన, రూఢం ప్రసిద్ధం, తేన, నామ్నా సుదక్షిణేతి, ప్రసిద్ధా, పత్నీ, అధ్వరస్య, యజ్ఞస్య, దక్షిణా, దక్షిణాఖ్యా, పత్నీవాసీత్, అత్రశ్రుతిః, 'యజ్ఞోగంధర్వస్తస్యదక్షిణా అప్సరస' ఇతి, దక్షిణాయా దాక్షిణ్యంనామ ఋత్విజాం దక్షిణత్వప్రాపకత్వం, (శ్రు) 'తేదక్షంతదక్షిణాం ప్రతిగృహ్యే'తి శ్రుతేః.

భావము.—ఆదిలీపమహారాజునకు శ్రేష్ఠమగుమగధవంశమునఁ బుట్టినదియు దాక్షిణ్యగుణముచే నిరూఢమగు దక్షిణయనునామము గలసతి యన్వర్థమగు పేరు గలదై యజ్ఞమునకు దక్షిణపోలె నెయ్యపుటాలాయెను.

శ్లో. కళత్రవంత మాత్మాన మవరోధే మహత్యపి,
తయా మేనే మనస్విన్యా లక్ష్మ్యాచ వసుధాధిపః. 3.౨

పదచ్ఛేదము.—కళత్రవంతం, ఆత్మానం, అవరోధే, మహతి, అపి, తయా, మేనే, మనస్విన్యా, లక్ష్మ్యా, చ, వసుధాధిపః.

అర్థము.—వసుధాధిపః=భూపతిఅయిన దిలీపమహారాజు, అవరోధే=అంతఃపురస్త్రీజనము, మహతిసత్యపి=అధికముగానున్నను, మనస్విన్యా=దృఢచిత్తముకలిగిన, తయా=ఆసుదక్షిణాదేవిచేతను, లక్ష్మ్యాచ=రాజ్యలక్ష్మిచేతను, ఆత్మానం=తనను, కళత్రవంతం=భార్యావంతునిగాను, మేనే=తలఁచెను.

ఆకాంక్ష.—మేనే=తలఁచెను. కః=ఎవఁడు? వసుధాధిపః=భూపతియయినదిలీపమహారాజు. కం=ఎవనిని? ఆత్మానం=తన్ను. 'వసుధాధిపః' అనెడి ప్రథమాంతకర్తృపదమును, 'ఆత్మానం' అనెడి ద్వితీయాంత కర్మపదమును, 'మేనే' అనెడిక్రియాపదము నున్నదిగనుక సకర్మకకర్తృప్రయోగము. కథంభూతం=ఎట్టివానిగా? కళత్రవంతం=భార్యావంతునిగా. కయాచ=ఎవతెచేతను? లక్ష్మ్యాచ=రాజ్యలక్ష్మిచేతను. పునఃకయాచ=ఇంక నెవ్వతెచేతను? తయా=ఆసుదక్షిణాదేవిచేతను, తయాకథంభూతయా=ఆసుదక్షిణాదేవి ఎటువంటిది? మనస్విన్యా=దృఢచిత్తముకలిగినది. కథంభూతేసత్యపి=ఎటువంటిదైనప్పటికిన్ని? మహతి సత్యపి=అధికముగా నుండినప్పటికిని. కస్మిన్=ఏది? అవరోధే=అంతఃపురస్త్రీజనము.

శబ్దరూపసమాసములు.—కళత్రవంతం - కళత్రమస్యాస్తీతికళత్రవాన్, తం కళత్రవంతం; కళత్రవంతం, కళత్రవంతౌ, కళత్రవంతః. కళత్రవచ్ఛబ్దః తకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనాన్తః. ఆత్మానం-ఆత్మానం, ఆత్మానౌ, ఆత్మనః. ఆత్మన్ శబ్దః నకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనాన్తః. అవరోధే - అవరోధే, అవరోధయోః, అవరోధేషు అవరోధశబ్దః అకారాన్తః పుంలింగః సప్తమ్యేకవచనాన్తః. మహతి-మహతి, మహతోః, మహత్సు మహచ్ఛబ్దః తకారాన్తః పుంలింగః సప్తమ్యేకవచనాన్తః. అపి,అవ్యయమ్. తయా-తయా,తాభ్యాం,తాభిః.తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనాన్తః. మేనే-మేనే, మేనాతే, మేనిరే. 'మనఅవబోధనే' ఇత్యస్మాద్ధాతోస్సకర్మకాత్కర్తరిభూతేలిటిఆత్మనేపదే ప్రథమపురుషైకవచనాన్తః.మనస్విన్యా-మనస్విన్యా,మనస్వినీభ్యాం,మనస్వినీభిః.మనస్వినీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనాన్తః. లక్ష్మ్యా-లక్ష్మ్యా,లక్ష్మీభ్యాం,లక్ష్మీభిః. లక్ష్మీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనాన్తః. చ, అవ్యయమ్. వసుధాధిపః, వసుధాయాః అధిపః, వసుధాధిపః; అధిపః, అధిపౌ, అధిపాః. వసుధాధిపశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనాన్తః.

వ్యాఖ్యా.— కళత్రవంతమితి. వసుధాధిపః, అవరోధే, అంతఃపురే, మహతి సత్యపి మనస్విన్యా దృఢచిత్తయా పతిచిత్తానువృత్యాదినిర్బంధక్షమయేత్యర్థః తయా సుదక్షిణయా లక్ష్మ్యాచ, ఆత్మానం కళత్రవంతం, భార్యావంతం, మేనే, (ని) 'కళత్రం శ్రోణిభార్యయో' రిత్యమరః, వసుధాధిప ఇత్యనేన వసుధయాచేతిగమ్యతే.

భావము.—ఆదిలీపమహారాజు పెక్కండ్రు అంతఃపురస్త్రీలుండియు మనోహరురాలైన యాసుదక్షిణాదేవిచేతను రాజ్యలక్ష్మిచేతను తన్ను సుకళత్రవంతునిగా నెంచుకొనెను.

శ్లో. తస్యా మాత్మానురూపాయా మాత్మజన్మసముత్సుకః,
విలంబితఫలైః కాలం స నినాయ మనోరథైః. 33

పదచ్ఛేదము.— తస్యాం, ఆత్మానురూపాయాం, ఆత్మజన్మసముత్సుకః, విలంబితఫలైః, కాలం, సః, నినాయ, మనోరథైః.

అర్థము.— సః=ఆదిలీపమహారాజు, ఆత్మానురూపాయాం-ఆత్మ=తనకు, అనురూపాయాం=సదృశురాలయిన, తస్యాం=ఆసుదక్షిణాదేవియందు, ఆత్మజన్మసముత్సుకస్సన్-ఆత్మజన్మ=పుత్రునియందు, సముత్సుకస్సన్=ఆసక్తుఁడగుచు, విలంబితఫలైః-విలంబిత=సావకాశమైన,ఫలైః=ఫలముకలిగిన, మనోరథైః=ఆసలచేత, కాలం=కాలమును, నినాయ=కడపెను.

ఆకాంక్ష.—నినాయ=కడపెను. కః=ఎవఁడు? సః=ఆదిలీపమహారాజు. కం=దేనిని? కాలం=కాలమును. 'సః' అనెడిప్రథమాంతకర్తృపదమును, 'కాలం' అనెడిద్వితీయాంత కర్మపదమును, 'నినాయ' అనెడిక్రియాపదమునున్నదిగనుక సకర్మకకర్తృప్రయోగము. కైః=వేనిచేత? మనోరథైః=కోరికలచేత. మనోరథైఃకథంభూతైః=కోరికలెట్టివి? విలంబితఫలైః-విలంబిత=సావకాశమయిన, ఫలైః=పుత్రరూపఫలముకలిగినవి. కథంభూతస్సన్=ఎట్టివాఁడగుచు? ఆత్మజన్మసముత్సుకస్సన్-ఆత్మజన్మ=పుత్రునియందు, సముత్సుకస్సన్=ఆసక్తుఁడయినవాఁడగుచు. కస్యాం=ఎవతెయందు? తస్యాం=ఆసుదక్షిణాదేవియందు. తస్యాంకథంభూతాయాం = ఆసుదక్షిణాదేవి ఎటువంటిది? ఆత్మానురూపాయాం-ఆత్మ=తనకు, అనురూపాయాం=సదృశురాలయినది.

శబ్దరూపసమాసములు.—తస్యాం-తస్యాం, తయోః, తాసు. తచ్ఛబ్దః దకారాంత స్త్రీలింగః సప్తమ్యేకవచనాంతః. ఆత్మానురూపాయాం-ఆత్మనః, అనురూపా, ఆత్మానురూపా; తస్యాం, ఆత్మానురూపాయాం, అనురూపాయాం, అనురూపయోః, అనురూపాసు. ఆత్మానురూపాశబ్దః ఆకారాంతః స్త్రీలింగః సప్తమ్యేకవచనాంతః. ఆత్మజన్మసముత్సుకః-ఆత్మనః, జన్మ, యస్యసః, ఆత్మజన్మా; ఆత్మజన్మని, సముత్సుకః, ఆత్మజన్మసముత్సుకః; సముత్సుకః, సముత్సుకౌ, సముత్సుకాః. ఆత్మజన్మసముత్సుకశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. విలంబితఫలైః; విలంబితం, ఫలం యేషాంతే, విలంబితఫలాః; తైః, విలంబితఫలైః; ఫలేన, ఫలాభ్యాం, ఫలైః. విలంబితఫలశబ్దః అకారాంతః పుంలింగః తృతీయాబహువచనాంతః. కాలం-కాలం, కాలౌ, కాలాన్. కాలశబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. సః-సః, తౌ, తే. తచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. నినాయ-నినాయ, నిన్యతుః, నిన్యుః. 'ణీఞ్ ప్రాపణే' యిత్యస్మాద్ధాతో స్సకర్మకాత్కర్తరి భూతేలిటి పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః. మనోరథైః-మనోరథేన, మనోరథాభ్యాం, మనోరథైః. మనోరథశబ్దః అకారాంతః పుంలింగః తృతీయాబహువచనాంతః.

వ్యాఖ్యా.—తస్యా మితి. సదిలీపః, ఆత్మానురూపాయాం, తస్యాం, ఆత్మనో జన్మయస్యసః, ఆత్మజన్మాపుత్రః తస్మిన్, సముత్సుకః యద్వా, ఆత్మనః, జన్మనిపుత్రరూపేణోత్పత్తౌ సముత్సుకస్సన్. 'ఆత్మావై పుత్రనామాసీ' తిశ్రుతేః, విలంబితం ఫలం పుత్రప్రాప్తిరూపం, యేషాంతైః మనోరథైః కదామేపుత్రోభవే దిత్యాశాభిః కాలం నినాయ యాపయామాస.

భావము.—దిలీపమహారాజు తనకు సమానురాలయినసుదక్షిణాదేవియందు కుమారుండు జనింపవలయు ననెడి యపేక్షకలవాఁడాయెను, అట్లుకొంత కాలము జరిగినది.

శ్లో. సంతానార్థాయ విధయే స్వభుజా దవతారితా,
తేన ధూర్జగతో గుర్వీ సచివేషు నిచిక్షిపే. ౩౮

పదచ్ఛేదము.—సంతానార్థాయ, విధయే, స్వభుజాత్, అవతారితా, తేన, ధూః, జగతః, గుర్వీ, సచివేషు, నిచిక్షిపే.

అర్థము.—తేన = ఆదిలీపమహారాజుచేత, సంతానార్థాయ-సంతాన=సంతానమే, అర్థాయ=ప్రయోజనముగాకలిగిన, విధయే=అనుష్ఠానము కొఱకు, స్వభుజాత్-స్వ=స్వకీయమయిన, భుజాత్=బాహువునుండి, అవతారితా=దింపఁబడిన, జగతః=జగత్తుయొక్క, గుర్వీ=అధికమయిన, ధూః=భారము, సచివేషు=మంత్రులయందు, నిచిక్షిపే=ఉంచఁబడెను.

ఆకాంక్ష.—నిచిక్షిపే=ఉంచఁబడెను. కేన=ఎవనిచేత? తేన=ఆదిలీపమహారాజుచేత. కా=ఏది? ధూః=భారము. 'తేన' అనెడి తృతీయాంతకర్తృవాచకపదమును, 'ధూః' అనెడి ప్రథమాంత కర్మపదమును, 'నిచిక్షిపే' అనెడి క్రియాపదమును ఉన్నవిగనుక కర్మణిప్రయోగము. కేషు=ఎవరియందు? సచివేషు=మంత్రులయందు. ధూః కథంభూతా=భారమెటువంటిది? గుర్వీ=అధికమయినటువంటిది. కస్య=దేనియొక్క? జగతః=జగత్తుయొక్క. పునః కథంభూతా=ఇంకనెటువంటిది? అవతారితా=దింపఁబడినటువంటిది. కస్మాత్=దేనినుండి? స్వభుజాత్-స్వ=స్వకీయమయిన, భుజాత్=భుజంబుననుండి. కస్మై=దేనికొఱకు? విధయే=అనుష్ఠానముకొఱకు. విధయే కథంభూతాయ=అనుష్ఠానమెట్టిది? సంతానార్థాయ-సంతాన = సంతానమే, అర్థాయ=ప్రయోజనముగాఁగలిగినది.

శబ్దరూపసమాసములు.—సంతానార్థాయ-సంతానః, అర్థః, యస్యసః, సంతానార్థః, తస్మై, సంతానార్థాయ; అర్థాయ, అర్థాభ్యాం, అర్థేభ్యః. సంతానార్థశబ్దః అకారాంతః పుంలింగః చతుర్థ్యేకవచనాంతః. విధయే-విధయే, విధిభ్యాం, విధిభ్యః. విధిశబ్దః ఇకారాంతః పుంలింగః చతుర్థ్యేకవచనాంతః. స్వభుజాత్-స్వస్యభుజః, స్వభుజః, తస్మాత్, స్వభుజాత్; స్వభుజాత్, స్వభుజాభ్యాం, స్వభుజేభ్యః. స్వభుజశబ్దః అకారాంతః పుంలింగః పంచమ్యేకవచనాంతః. అవతారితా - అవతారితా, అవతారితే, అవతారితాః. అవతారితాశబ్దః అకారాంత స్త్రీలింగః ప్రథమైకవచనాంతః. తేన - తేన, తాభ్యాం, తైః. తచ్ఛబ్దః దకారాంతః పుంలింగః తృతీయైకవచనాంతః. ధూః-ధూః, ధురౌ, ధురః. ధూర్ శబ్దః రేఫాంతః స్త్రీలింగః ప్రథమైకవచనాంతః. జగతః-జగతః, జగతోః, జగతాం. జగచ్ఛబ్దః తకారాంతనపుంసకలింగః షష్ఠ్యేకవచనాంతః. గుర్వీ-గుర్వీ, గుర్వ్యౌ, గుర్వ్యః. గుర్వీశబ్దః ఈకారాంత స్త్రీలింగః ప్రథమైకవచనాంతః,

సచివేషు-సచివే, సచివయోః, సచివేషు. సచివశబ్దః అకారాంతః పుంలింగః సప్తమీ బహువచనాంతః. నిచిక్షేపే - నిచిక్షిపే, నిచిక్షిపాతే, నిచిక్షిపిరే. నీత్యుపసర్గ పూర్వ కాత్ 'క్షిపప్రేరణ' ఇత్యస్మాద్ధాతోః స్వకర్మణి భూతేలిటి ఆత్మనేపదే ప్రథమపురుషైక వచనాంతః.

వ్యాఖ్యా.—సంతానేతి. తేనదిలీపేన, సంతానః, అర్థః ప్రయోజనం, యస్య తస్మై సంతానార్థాయ, విధయే, అనుష్ఠానాయ, స్వభుజాత్, అవతారితా ఆవరోపితా, జగతః, గుర్వీ, ధూర్భారః, సచివేషు, మంత్రిషు, నిచిక్షిపే, నిక్షిప్తా.

భావము.—దిలీపమహారాజు సంతానప్రతిపాదక మయినయనుష్ఠానముకొఱకు తనరాజ్యభారమును మంత్రులపరము చేసెను.

శ్లో. అథాభ్యర్చ్య విధాతారం ప్రయతౌ పుత్రకామ్యయా,
తౌ దమ్పతీ వసిష్ఠస్య గురో ర్జగ్మతు రాశ్రమమ్. 35

పదచ్ఛేదము.—అథ, అభ్యర్చ్య, విధాతారం, ప్రయతౌ, పుత్రకామ్యయా, తౌ, దంపతీ, వసిష్ఠస్య, గురోః, జగ్మతుః, ఆశ్రమమ్.

అర్థము.—అథ=జగద్భారావతరణానంతరము, పుత్రకామ్యయా=సంతానేచ్ఛ చేత, తౌ=ఆ, దంపతీ=సుదక్షిణాదిలీపులు, ప్రయతౌసంతౌ=పరిశుద్ధులయినటువంటివా రగుచు, విధాతారం=బ్రహ్మను, అభ్యర్చ్య=పూజచేసి, గురోః=కులగురువులయిన, వసి ష్ఠస్య=వసిష్ఠులయొక్క, ఆశ్రమం = ఆశ్రమమునుగూర్చి, జగ్మతుః=తరలిపోయిరి.

ఆకాంక్ష.—జగ్మతుః=తరలిపోయిరి. కౌ=ఎవరు? దంపతీ=సుదక్షిణాదిలీపులు. కం=దేనినిగూర్చి? ఆశ్రమం=ఆశ్రమమునుగూర్చి. 'దంపతీ' అను ప్రథమాంతకర్తృప దమును, 'ఆశ్రమం' అనెడిద్వితీయాంతకర్మపదమును, 'జగ్మతుః' అనెడిక్రియాపదము ను ఉన్నవిగనుక, సకర్మకకర్తృప్రయోగము. కస్య=ఎవరియొక్క? వసిష్ఠస్య=వసిష్ఠుని యొక్క. వసిష్ఠస్యకథంభూతస్య=ఆవసిష్ఠులు ఎటువంటివారు? గురోః=కులగురువయి నవారు. కింకృత్వా=ఏమిచేసి? అభ్యర్చ్య=పూజచేసి కం=ఎవరిని? విధాతారం=బ్రహ్మను. కథంభూతౌసంతౌ=ఎట్టివారలగుచు? ప్రయతౌసంతౌ = పరిశుద్ధులయినవారలగుచు. కయా=దేనిచేత? పుత్రకామ్యయా=సంతానేచ్ఛచేత. కదా=ఎప్పుడు? అథ=జగద్భా రావతరణానంతరము.

శబ్దరూపసమాసములు.—అథ, అవ్యయమ్. అభ్యర్చ్య, ల్యప్ ప్రత్యయాంతమ వ్యయమ్. విధాతారం-విదధాతీతి, విధాతా, తం,విధాతారం; విధాతారం, విధాతారౌ, విధాతౄన్. విధాతృశబ్దః ఋకారాంతఃపుంలింగః ద్వితీయైకవచనాంతః. ప్రయతౌ-ప్ర

యతః, ప్రయతౌ, ప్రయతాః ప్రయతశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమాద్వివచనాంతః. పుత్రకామ్యయా - పుత్ర మాత్మనః ఇచ్ఛా పుత్రకామ్యా తయాపుత్రకామ్యయా; కామ్యయా, కామ్యాభ్యాం, కామ్యాభిః. పుత్రకామ్యాశబ్దః ఆకారాంతః స్త్రీలింగః తృతీయైకవచనాంతః. తౌ - సః, తౌ, తే. తచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ప్రథమాద్వివచనాంతః. దంపతీ - దంపతీ, ౨ దంపతిభ్యాం, 3 దంపత్యోః. ౨ దంపతిశబ్దః ఇకారాంతః పుంలింగః నిత్యంద్వివచనే ప్రథమాద్వివచనాంతః. వసిష్ఠస్య - వసిష్ఠస్య, వసిష్ఠయోః, వసిష్ఠానాం. వసిష్ఠశబ్దః అకారాంతః పుంలింగః షష్ఠ్యేకవచనాంతః. గురోః-గురోః, గుర్వోః, గురూణాం. గురుశబ్దః ఉకారాంతః పుంలింగః షష్ఠ్యేకవచనాంతః. జగ్మతుః-జగామ, జగ్మతుః, జగ్ముః. 'గమ్ల్ గతౌ' విత్యస్మాద్ధాతో స్సకర్మకాత్కర్తరిభూతేలిటి పరస్మైపదే ప్రథమపురుషద్వివచనాంతః. ఆశ్రమం-ఆశ్రమం, ఆశ్రమౌ, ఆశ్రమాన్. ఆశ్రమశబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః.

వ్యాఖ్యా.—అథేతి. అథ జగద్భారావతరణానంతరం, పుత్రకామ్యయా, ఆత్మనః పుత్రేచ్ఛయా,'కామ్యచ్చే'తిపుత్రశబ్దాత్కామ్యచ్ ప్రత్యయః;అప్రత్యయాదితి పుత్రకామ్యశబ్దా దకారప్రత్యయః తతష్టాప్, తయా, తౌ, దంపతీ, జాయాపతీ, రాజదంతాదిషు జాయాశబ్దస్యదంభావనిపాతనాత్సాధుః; ప్రయతౌ నియతౌ, భూత్వా, విధాతారం బ్రహ్మాణం, అభ్యర్చ్య, సఖలు పుత్రార్థిభి రుపాస్యత ఇతి మాంత్రికాః గురోః,కులగురోః వసిష్ఠస్య, ఆశ్రమం, జగ్మతుః, పుత్రప్రాప్త్యుపాయాపేక్షయేతి శేషః.

భావము.—పిమ్మట దిలీపమహారాజు సుదక్షిణాదేవి వీరలిద్దఱు పుత్రార్థనియతులయి బ్రహ్మను బూజించి కులగురు వగువసిష్ఠునియాశ్రమమునకు వెళ్లిరి.

శ్లో. స్నిగ్ధగంభీరనిర్ఘోష మేకస్యందన మాస్థితౌ,
ప్రావృషేణ్యం పయోవాహం విద్యుదైరావతా విన. 3౬

పదచ్ఛేదము.—స్నిగ్ధగంభీరనిర్ఘోషం, ఏకస్యందనం, ఆస్థితౌ, ప్రావృషేణ్యం, పయోవాహం, విద్యుదైరావతౌ, ఇవ.

అర్థము.—స్నిగ్ధగంభీరనిర్ఘోషం-స్నిగ్ధ = మధురమయినట్టియు, గంభీర=గంభీరమయిన, నిర్ఘోషం=ధ్వనికలిగిన, ఏకస్యందనం = ఒక్కతేరును, ప్రావృషేణ్యం=వర్షాకాలమందుపుట్టిన, పయోవాహం = మేఘంబును, విద్యుదైరావతావివ=మెఱుపుఇంద్రగజంబులువలె, ఆస్థితౌసంతౌ=ఎక్కినవారలగుచు, జగ్మతుః=తరలిపోయిరి.

ఆకాంక్ష.—జగ్మతుః=తరలిపోయిరి.కౌ=ఎవరు?దంపతీ=సుదక్షిణాదిలీపులు.కం = దేనినిగూర్చి?ఆశ్రమం=వసిష్ఠాశ్రమమునుగూర్చి.'దంపతీ'అనెడి ప్రథమాంతకర్తృపదము

ను, 'ఆశ్రమం' అనెడిద్వితీయాంతకర్మపదమును, 'జగ్మతుః' అనెడిక్రియాపదమున్న విగనుక సకర్మకకర్తృప్రయోగము. కథం భూతౌసంతౌ=ఎటువంటివారవుచు? ఆస్థితౌ సంతౌ=ఎక్కినవారవుచు. కావివ=ఏవివలె? విద్యుదైరావతావివ=మెఱుపుఇంద్రగజంబులువలె. కం=దేనిని? పయోవాహం = మేఘంబును. పయోవాహం కథంభూతం=మేఘమెటువంటిది? ప్రావృషేణ్యం=వర్షాకాలమునందుపుట్టినట్టిది. కం=దేనిని? ఏకస్యందనం=ఒకరథంబును. ఏకస్యందనంకథంభూతం = ఆ ఒకరథమెట్టిది? స్నిగ్ధగంభీరనిర్ఘోషం-స్నిగ్ధ=మధురమైనట్టియు, గంభీర=గంభీరమయిన, నిర్ఘోషం=ధ్వనికలిగినది.

శబ్దరూపసమాసములు.—స్నిగ్ధగంభీరనిర్ఘోషం-స్నిగ్ధః, గంభీరః, నిర్ఘోషోయస్య సః, స్నిగ్ధగంభీరనిర్ఘోషః; తం, స్నిగ్ధగంభీరనిర్ఘోషం; నిర్ఘోషం, నిర్ఘోషౌ, నిర్ఘోషాన్. స్నిగ్ధగంభీరనిర్ఘోషశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనాన్తః. ఏకస్యందనం-ఏకాశ్చాసౌ స్యందనశ్చ, ఏకస్యందనః; తం, ఏకస్యందనం; స్యందనం, స్యందనౌ, స్యందనాన్. ఏకస్యందనశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనాన్తః. ఆస్థితౌ - ఆస్థితః, ఆస్థితౌ, ఆస్థితాః. ఆస్థితశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాద్వివచనాన్తః. ప్రావృషేణ్యం- ప్రావృషి, భవః, ప్రావృషేణ్యః; తం, ప్రావృషేణ్యం; ప్రావృషేణ్యం, ప్రావృషేణ్యౌ, ప్రావృషేణ్యాన్. ప్రావృషేణ్యశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనాన్తః. పయోవాహం-పయః, వహతీతి,పయోవాహః;తం,పయోవాహం; వాహం, వాహౌ, వాహాన్. పయోవాహశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనాన్తః. విద్యుదైరావతౌ-ఇరాః, సంతీతి, ఇరావాన్; ఇరావతిభవః, ఐరావతః, విద్యుచ్చ, ఐరావతచ్చ, విద్యుదైరావతౌ; విద్యుదైరావతౌ, ౨ విద్యుదైరావతాభ్యాం, ౩ విద్యుదైరావతయోః, ౨ విద్యుదైరావతశబ్దః. అకారాన్తః పుంలింగః నిత్యంద్వివచనే ప్రథమాద్వివచనాన్తః. ఇవ. అవ్యయమ్.

వ్యాఖ్యా.-స్నిగ్ధగంభీరేతి స్నిగ్ధో,మధురః. గంభీరోనిర్ఘోషోయస్యసః ఏకమేవ, స్యందనంరథం, ప్రావృషిభవః ప్రావృషేణ్యః, ప్రావృషఏణ్యఇతి ఏణ్యప్రత్యయః, తం, ప్రావృషేణ్యం, పయోవాహం, మేఘం, విద్యుదైరావతా వివ, ఆస్థితౌ, ఆరూఢౌ,జగ్మతురితిపూర్వేణసంబంధః, ఇరాః, ఆపః, (ని) 'ఇరాభూవాక్సురాప్సుస్యా' దిత్యమరః. ఇరావాన్సముద్రః, తత్రభవః, ఐరావతః, (ని) 'ఐరావతోభ్రమాతంగైరావణాభ్రమువల్లభా' ఇత్యమరః, అభ్రమాతంగత్వంచాస్య ఆభ్రస్థితత్వా దభ్రరూపత్వాద్వేతి క్షీరస్వామీ. అతఏవ మేఘారోహణం విద్యుత్సాహచర్యంచఘటతే, కించ, విద్యుతః, ఐరావతసాహచర్యాదేవ, ఐరావతీ సంజ్ఞాపి, 'ఐరావతస్యస్త్రీఐరావతీ' తి క్షీరస్వామీ తస్మాత్సుష్ఠూక్తం, విద్యుదైరావతావివేతి; ఏకరథారోహణోక్త్యాకార్యసిద్ధేర్బీజం, దంపత్యో రత్యంతసౌమనస్యంచ సూచయతి.

భావము.—అదిలీపసుదక్షిణాదేవులు శ్రావ్యమై గొప్పధ్వనిగల యొకరథము మీఁదఁబోయిరి. నల్లగనుండెడి యారథముపైని తెల్లగనుండెడిదిలీపమహారాజును పచ్చగనుండెడి సుదక్షిణాదేవియును పోవుట నల్లనిమేఘమపైని తెల్లని ఐరావతమనెడిఏనుఁగయుం మెఱపును పోయినట్లుండెను.

శ్లో. మాభూ దాశ్రమపీ డేతి పరిమేయపురస్సరౌ,
అనుభావవిశేషాత్తు సేనాపరివృతా వివ. 38

పదచ్ఛేదము.—మా, భూత్, ఆశ్రమపీడా, ఇతి, పరిమేయపురస్సరౌ, అనుభావవిశేషాత్, తు, సేనాపరివృతౌ, ఇవ.

అర్థము.—ఆశ్రమపీడా-ఆశ్రమ=ఆశ్రమమునకు, పీడా=బాధ, మాభూత్=కావద్దు. ఇతి=ఇట్లను హేతువువలన, పరిమేయపురస్సరౌ-పరిమేయ=స్వల్పమయిన, పురస్సరౌ=పరివారజనము కలిగినవారయినప్పటికి, అనుభావవిశేషాత్తు-అనుభావ=తేజస్సుయొక్క, విశేషాత్తు=విశేషమువలనను, సేనాపరివృతావివస్థితౌ-సేన=సేనలచేత, పరివృతావివస్థితౌ=చుట్టుకొనఁబడినవారో యన నున్నవారలై, జగ్మతుః=తరలిపోయిరి.

ఆకాంక్ష.—జగ్మతుః=తరలిపోయిరి. కథం భూతావివస్థితౌ = ఎట్టివారోయన నున్నవారై? సేనాపరివృతావివస్థితౌ-సేన=సేనలచేత, పరివృతావివస్థితౌ=చుట్టుకొఁబడినవారో యననున్నవారై. కస్మాత్=దేనివలన? అనుభావవిశేషాత్తు-అనుభావ = తేజస్సుయొక్క, విశేషాత్తు=విశేషమువలన. కథంభూతౌ=ఎట్టివారైనను? పరిమేయపురస్సరౌ-పరిమేయ=స్వల్పమైన, పురస్సరౌ=పరివారజనము కలిగినవారలైనప్పటికిని. కిమితి=ఏమను హేతువువలన? ఇతి=ఇట్లను హేతువువలన, మాభూత్=కావద్దు. కా = ఏది? ఆశ్రమపీడా-ఆశ్రమ=ఆశ్రమముయొక్క, పీడా=బాధ. 'ఆశ్రమపీడా' అనెడి ప్రథమాంతకర్తృపదమును 'మాభూత్' అనెడిక్రియాపదమునున్నవిగనుక అకర్మకకర్తృప్రయోగము.

శబ్దరూపసమాసములు.—మా, అవ్యయమ్. భూత్-భూత్, భూతాం, భూవన్. 'భూసత్తాయాం' మిత్యస్మాద్ధాతోరకర్మకాదాశిషి లుఙ్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః. ఆశ్రమపీడా-ఆశ్రమస్య పీడా-ఆశ్రమపీడా; పీడా, పీడే, పీడాః. ఆశ్రమపీడాశబ్దః ఆకారాన్తస్త్రీలింగః ప్రథమైకవచనాన్తః. పరిమేయపురస్సరౌ-పరిమాతుం యోగ్యాః పరిమేయాః; పురః సరంతీతి పురస్సరాః; పరిమేయాః పురస్సరాః యయోస్తౌ పరిమేయపురస్సరౌ; పురస్సరః, పురస్సరౌ, పురస్సరాః. పరిమేయపురస్సరశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాద్వివచనాన్తః. అనుభావవిశేషాత్ - అనుభావస్య

విశేషః అనుభావవిశేషః; తస్మాత్ అనుభావవిశేషాత్; విశేషాత్, విశేషాభ్యాం, విశేషేభ్యః. అనుభావవిశేషశబ్దః అకారాన్తః పుంలింగః పంచమ్యేకవచనాన్తః. తు-అవ్యయమ్. సేనాపరివృతౌ-సేనాభిః పరివృతౌ సేనాపరివృతౌ; పరివృతః, పరివృతౌ, పరివృతాః. సేనాపరివృతశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాద్వివచనాన్తః. ఇవ-అవ్యయమ్.

వ్యాఖ్యా.—మేతి. పునఃకథంభూతౌ దంపతీ, ఆశ్రమపీడా, మాభూత్ మాస్త్వితిహేతోః, 'మాజిలు' ఇత్యాశీరర్థేలుఙ్ 'నమాఙ్ యోగ' ఇత్యడాగమప్రతిషేధః. పరిమేయపురస్సరౌ, పరిమితపరివారౌ, అనుభావవిశేషాత్తు, తేజోవిశేషాత్, సేనాభిః, పరివృతావివస్థితౌ.

భావము.—వసిష్ఠాశ్రమమునకు బాధలేకుండ నుండవలెనని మితపరివారముతో వారలు వెళ్లిరి. అయినను ఆదిలీపమహారాజు ప్రభావాతిశయముచేత సేనతోకూడుకొని యుండిన ట్లగుపడిరి.

శ్లో. సేవ్యమానౌ సుఖస్పర్శైః సాలనిర్యాసగంధిభిః, ౩౮
పుష్పరేణూత్కిరైర్వాతై రాధూతవనరాజిభిః.

పదచ్ఛేదము.—సేవ్యమానౌ, సుఖస్పర్శైః, సాలనిర్యాసగంధిభిః, పుష్పరేణూత్కిరైః, వాతైః, ఆధూతవనరాజిభిః.

అర్థము.—సుఖస్పర్శైః-సుఖ=సుఖకరమయిన, స్పర్శైః=స్పృశించుట కలిగినట్టియు, సాలనిర్యాసగంధిభిః-సాల=సర్జవృక్షములయొక్క, నిర్యాస=స్వరసముయొక్క, గంధిభిః=వాసనగలట్టియు, పుష్పరేణూత్కిరైః-పుష్ప=కుసుమములయొక్క, రేణు=పరాగములను, ఉత్కిరైః=వెదచల్లుచునుండునట్టియు, ఆధూతవనరాజిభిః-ఆధూత=కొంచము కంపింపఁబడిన, వన=వనములయొక్క, రాజిభిః=పంక్తులుకలిగిన, వాతైః=వాయువులచేత, సేవ్యమానౌ=విసరఁబడినవారలయి, జగ్మతుః=తరలిపోయిరి.

ఆకాంక్ష.—జగ్మతుః=తరలిపోయిరి. పునఃకథంభూతౌ=ఇంక నెట్టివారలై? సేవ్యమానౌ=విసరఁబడినవారలై. కైః=వేనిచేత? వాతైః=వాయువులచేత. వాతైఃకథంభూతైః=ఆవాయువులుఎట్టివి? ఆధూతవనరాజిభిః-ఆధూత=కొంచముకంపింపఁబడిన, వన=వనములయొక్క, రాజిభిః=పంక్తులుకలిగినవి. పునః కథంభూతైః = ఇంక నెట్టివి? పుష్పరేణూత్కిరైః-పుష్ప=కుసుమములయొక్క, రేణు=పరాగములను, ఉత్కిరైః=వెదజల్లుచుండునవి. పునః కథంభూతైః=ఇంక నెట్టివి? సాలనిర్యాసగంధిభిః-సాల=సర్జవృక్షములయొక్క,

నిర్యాస=స్వరసముయొక్క, గంధిభిః=వాసనగలవి. పునః కథంభూతైః=ఇంక నెట్టివి? సుఖ స్పర్శైః-సుఖ=సుఖకరమైన, స్పర్శైః=తాఁకుడుగలవి.

శబ్దరూపసమాసములు.—సేవ్యమానౌ-సేవ్యమానః, సేవ్యమానౌ, సేవ్యమానాః. సేవ్యమానశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాద్వివచనాన్తః. సుఖస్పర్శైః - సుఖః స్పర్శో యేషాంతే సుఖస్పర్శాః, తైః సుఖస్పర్శైః; స్పర్శేన, స్పర్శాభ్యాం, స్పర్శైః. సుఖస్పర్శశబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహువచనాన్తః. సాలనిర్యాసగంధిభిః- సాలానాంనిర్యాసః సాలనిర్యాసః, సాలనిర్యాసస్య గంధః సాలనిర్యాసగంధః, సాల నిర్యాసగంధః ఏషామ స్తీతి సాలనిర్యాసగంధినః, తైః సాలనిర్యాసగంధిభిః; గంధినా, గంధిభ్యాం, గంధిభిః. సాలనిర్యాసగంధిన్ శబ్దః నకారాన్తః పుంలింగః తృతీయాబహు వచనాన్తః. పుష్పరేణూత్కిరైః-ఉత్కిరంతీత్యుత్కిరాః, పుష్పాణాం రేణవః పుష్ప రేణవః, పుష్పరేణూనాం ఉత్కిరాః పుష్పరేణూత్కిరాః, తైః పుష్పరేణూత్కిరైః; ఉత్కిరేణ, ఉత్కిరాభ్యాం, ఉత్కిరైః. పుష్పరేణూత్కిరశబ్దః అకారాన్తఃపుంలింగః తృతీయాబహువచనాన్తః. వాతైః-వాతేన, వాతాభ్యాం, వాతైః. వాతశబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహువచనాన్తః. ఆధూతవనరాజిభిః - వనానాం రాజయః వన రాజయః; ఆధూతాః వనరాజయో యైస్తే ఆధూతవనరాజయః, తైః ఆధూతవనరా జిభిః; రాజినా, రాజిభ్యాం, రాజిభిః. ఆధూతవనరాజిశబ్దః ఇకారాన్తః పుంలింగః తృతీయాబహువచనాన్తః.

వ్యాఖ్యా.—సేవ్యమానావితి. పునః కథంభూతౌ, సుఖః, శీతలత్వాత్, ప్రియః స్పర్శోయేషాంతైః, సాలనిర్యాసగంధిభిః సర్జతరునిష్యందగంధవద్భిః, (ని) 'సాలస్సర్జ తరుస్స్మృతః' ఇతి శాశ్వతః. ఉత్కిరంతి విక్షిపంతీత్యుత్కిరాః; 'ఇగుపధే' త్యాదినా కిరతేః కప్రత్యయః. పుష్పరేణూనా ముత్కిరాః, తైః, ఆధూతాః మాంద్యా దీష త్కంపితాః వనరాజయోయైస్తైః, వాతైస్సేవ్యమానౌ.

భావము.—చల్లనైనదియు, సాలతరుస్వరసపరిమళమిళితములైనవియు, కుసుమ రజస్సుల రాల్చునవియు, వనపఙ్త్తుల కదల్చునవియు, సుఖముగుతాఁకుడుగలవియు నగు తెమ్మెరలచేత సేవింపఁబడువారలగుచు తరలి పోయిరి.

శ్లో. మనోభిరామాః శృణ్వంతౌ రథనేమిస్వనోన్ముఖైః,
షడ్జసంవాదినీః కేకా ద్విధా భిన్నాః శిఖండిభిః. 39

పదచ్ఛేదము.— మనోభిరామాః, శృణ్వంతౌ, రథనేమిస్వనోన్ముఖైః, షడ్జసంవా దినీః, కేకాః, ద్విధా, భిన్నాః, శిఖండిభిః.

అర్థము.—రథనేమిస్వనోన్ముఖైః-రథ=రథముయొక్క, నేమి=చక్రాగ్రములయొక్క, స్వన=ధ్వనులచేత,ఉత్=ఎత్తఁబడిన,ముఖైః=ముఖములుకలిగి, శిఖండిభిః=మయూరములచేత, ద్విధా=రెండు ప్రకారములుగా, భిన్నాః=విభాగము చేయఁబడినవిగనుకనే, షడ్జసంవాదినీః-షడ్జ=షడ్జస్వరముతోడను, సంవాదినీః=సదృశములైన, మనోభిరామాః-మనః=మనస్సునకు,అభిరామాః=ఇష్టములైన, కేకాః=మయూరవాక్కులను, శృణ్వంతౌ=వినుచున్నవారలై, జగ్మతుః=తరలి పోయిరి.

అన్వయః.—జగ్మతుః=తరలిపోయిరి. కథంభూతౌ=ఎట్టివారలయి? శృణ్వంతౌ=వినుచున్నవారలై. కాః=వేనిని? కేకాః=మయూరవాక్కులను. కేకాః కథంభూతాః=మయూరవాక్కులు ఎట్టివి? మనోభిరామాః-మనః=మనస్సునకు, అభిరామాః=ఇష్టములైనట్టివి. పునః కథంభూతాః=ఇంకనెట్టివి? షడ్జసంవాదినీః-షడ్జ=షడ్జస్వరముతోడ, సంవాదినీః=సదృశములైనట్టివి. కథంభూతాః=ఎట్టివిగనుకనే? భిన్నాః=విభాగములచేయఁబడినవిగనుకనే. కథం=ఎట్లుగా? ద్విధా=రెండు ప్రకారములుగా. కైః=వేనిచేత? శిఖండిభిః=మయూరములచేత. శిఖండిభిః కథంభూతైః=మయూరములెట్టివి? రథనేమిస్వనోన్ముఖైః-రథ=రథముయొక్క, నేమి=చక్రాగ్రములయొక్క, స్వన=ధ్వనులచేత, ఉత్=ఎత్తఁబడిన, ముఖైః=ముఖములుకలిగినవి.

శబ్దరూపసమాసములు.—మనోభిరామాః-మనసః అభిరామాః మనోభిరామాః, తాః మనోభిరామాః; అభిరామాం, అభిరామే,అభిరామాః. మనోభిరామాశబ్దః ఆకారాన్తస్త్రీలింగః ద్వితీయాబహువచనాన్తః. శృణ్వంతౌ-శృణ్వన్,శృణ్వంతౌ, శృణ్వంతః. శృణ్వచ్ఛబ్దః తకారాన్తః పుంలింగః ప్రథమాద్వివచనాన్తః. రథనేమిస్వనోన్ముఖైః-రథస్య నేమయః రథనేమయః; రథనేమీనాం స్వనాః రథనేమిస్వనాః,రథనేమిస్వనైః ఉన్ముఖాః రథనేమిస్వనోన్ముఖాః, తైః రథనేమిస్వనోన్ముఖైః; ఉన్ముఖేన, ఉన్ముఖాభ్యాం, ఉన్ముఖైః. రథనేమిస్వనోన్ముఖశబ్దః అకారాన్తఃపుంలింగః తృతీయాబహువచనాన్తః. షడ్జసంవాదినీః షడ్జేన సంవాదిన్యః షడ్జసంవాదిన్యః; తాః షడ్జసంవాదినీః; సంవాదినీం, సంవాదిన్యౌ, సంవాదినీః.,షడ్జసంవాదినీశబ్దః ఈకారాన్తస్త్రీలింగః ద్వితీయాబహువచనాన్తః. కేకాః-కేకాం, కేకే, కేకాః. కేకాశబ్దః ఆకారాన్తస్త్రీలింగః ద్వితీయాబహువచనాన్తః.ద్విధా, ధాల్ప్రత్యయాంతమవ్యయమ్.భిన్నాః-భిన్నాం, భిన్నే, భిన్నాః. భిన్నాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయాబహుచవచనాన్తః.శిఖండాః. ఏషాంసంతీతి శిఖండినః,తైః శిఖండిభిః; శిఖండినా, శిఖండిభ్యాం, శిఖండిభిః. శిఖండిన్ శబ్దః నకారాన్తః పుంలింగః తృతీయాబహువచనాన్తః.

వ్యాఖ్యా—మనఇతి. రథనేమిస్వనోన్ముఖైః, మేఘధ్వనిశంకయా ఉన్నమితముఖైః రిత్యర్థః. శిఖండిభిర్మయూరైః,ద్విధాభిన్నాః,శుద్ధవికృతభేదేనవా,వికృతావస్థా

యామేవ చ్యుతాచ్యుతభేదేనవా షడ్జో ద్వివిధః. తత్సాదృశ్యా త్కేకా అపి ద్విధాభి
న్నా ఇత్యుచ్యంతే, అతఏవాహ 'షడ్జసంవాదినీ' రితి, షడ్భ్యః స్థానేభ్యో జాత ష్షడ్జః,
తదుక్తం, శ్లో. 'నాసాం కంఠమురస్తాలు జిహ్వాం దంతాంశ్చ సంస్పృశన్, షడ్భ్యస్సంజాయ
తే యస్మా త్తస్మా షడ్జ ఇతి స్మృతః' ఇతి, సచ తంత్రీకంఠజన్యస్వరవిశేషః, సి. 'నిషాద
ర్షభ గాంధార షడ్జమధ్యమధైవతాః, పంచమశ్చేత్యమీ సప్తతంత్రీ కంఠోత్థితాస్స్వరా'
ఇత్యమరః, షడ్జేన సంవాదినీః సదృశీః, తదుక్తం మతంగేన, 'షడ్జం మయూరో వదతీ' తి,
మనోభిరామాః మనసః ప్రియాః, కేమూర్ధ్ని కాయంతి ధన్వంతీతి కేకాః మయూర
వాణ్యః; సి. 'కేకావాణీ మయూరస్యే' త్యమరః, తాః కేకాః శృణ్వంతావితి శ్లోకార్థః.
ఇతః పర మపరిచితస్వరత్వా న్నా మనుగ్రహాయ కించిదుచ్యతే, ప్రథమం తావ త్స్వ
రాణాం స్వరూపముచ్యతే, శ్రుత్యారబ్ధమనురణనం స్వరః. తదుక్తం రత్నాకరే, శ్లో.
'శ్రుత్యనంతరభావీ యస్స్నిగ్ధో ఽనురణనాత్మకః, స్వతో రంజయతి శ్రోతుశ్చిత్తం సస్వ
ర ఉచ్యతే' ఇతి, తే ద్వివిధాః, శుద్ధా వికృతాశ్చేతి. తత్ర నియతిశ్రుతిసంపన్నా శ్శు
ద్ధాః, అవికృతా ఇత్యర్థః. శ్రుత్యుత్కృష్టాపకృష్టాస్తు వికృతాః. శ్రుతినియమశ్చోక్తో ద
త్తిలేన, 'చతుశ్చతుశ్చతుశ్చైవ షడ్జమధ్యమపంచమాః, ద్వే ద్వే నిషాదగాంధారౌ త్రిస్త్రిరృష
భధైవతా' వితి, తత్ర శుద్ధాస్సప్తైవ. తదుక్తం 'శ్రుతిభ్యస్స్యుస్స్వరాష్షడ్జర్షభగాంధార
మధ్యమాః, పంచమో ధైవతశ్చాథ నిషాదశ్చేతి సప్త తే, తేషాం సంజ్ఞాస్సరిగమపధనీత్యప
రా మతా' ఇతి వివేక్తవ్యం. వికృతాస్తు ద్వాదశ. తదుక్తం, 'తఏవ వికృతావస్థాః ద్వాద
శ ప్రతిపాదితాః' ఇతి, తదేవం శుద్ధవికృతభేదేన సర్వస్వరద్వైవిధ్యే షడ్జస్యాపి ద్వైవి
ధ్యం, తత్సదృశత్వా త్కేకా అపి ద్వివిధా ఇతి ద్విధాభిన్నా ఇత్యుక్తం, అథవా-వికృత
షడ్జ ఏవ చ్యుతాచ్యుతభేదేన ద్వివిధః, సహి ద్విశ్రుతిః. యదా నిషాదో ద్విశ్రుతి
శ్చతుశ్రుతేః షడ్జస్య శ్రుతిద్వయమాశ్రిత్య కాకలీత్వమాపద్యతే, తదా షడ్జో ద్విశ్రుతి
ర్వికృతో భవన్ స్వస్థానాచ్చతుర్థశ్రుతేరచ్యుతత్వాదచ్యుత ఇత్యుచ్యతే. యదా షడ్జః
పూర్వోత్తరయో ర్నిషాదర్షభయో రాద్యంతశ్రుతిదానేన స్వయం సాధారణ్యమాప
ద్యతే, త్రిశ్రుతిరృషభ శ్చతుశ్రుతిర్భవతి. తదా స్వస్థానచ్యుతేః చ్యుత ఇత్యుచ్యతే. తద
ప్యుక్తం 'చ్యుతో ఽచ్యుతో ద్విధా షడ్జో ద్విశ్రుతిర్వికృతో భవేత్, సాధారణే కాకలీత్వే ని
షాదస్య చ దృశ్యతే, సాధారణీం శ్రుతిం షాడ్జీమృషభస్సంశ్రితో యదా, చతుశ్రుతిత్వమా
యాతి తద్వైకో వికృతో భవే' దితి, తదేత ద్వైవిధ్యం సాదృశ్యా త్కేకా స్వప్యాహ 'ద్వి
ధాభిన్నా' ఇతి, షడ్జసంవాదినీరిత్యత్రాపి సంవాదినీశబ్దస్సాదృశ్యమాచష్టే. నతుసంవాదినీస్వ
రం. స్వరో హి స్వరం ప్రతిసంవాదినీ భవతి. కేకాతు నస్వరః. తర్హి - 'మయూరచాతక
చ్ఛాగ క్రౌంచకోకిలదర్దురాః, గజశ్చ సప్తషడ్జాదీన్ క్రమాదుచ్చారయంత్యమీ, షడ్జం
మయూరో వదతీ' త్యాదేః కోఽర్థః? షడ్జాదిసదృశం స్వరం మయూరాదయో వదంతీత్యర్థః.

అథ కేకాపిస్వరః, తథాపి తస్యషడ్జత్వా త్కథంషడ్జసంవాదినీత్వం. నహిస్వాయమేవ స్వస్య సంవాదీత్యల మతివిస్తరేణ లఘుటీకాయా మిత్యుపరమ్యతే.

భావము. ఆదిలీపునిరథచక్రధ్వనిని మేఘనినాదమనితలంచి మోముత్తి నెమిళ్లచే రెండువిధములుగా విభజింపఁబడినవి కనుక నే షడ్జస్వరముతో సమానములును మనోహరములగుమయూరవాక్కులవినుచు తరలిపోయిరి.

శ్లో. పరస్పరాక్షిసాదృశ్య మదూరోజ్ఝితవర్త్మసు,
మృగద్వంద్వేషు పశ్యంతౌ స్యందనాబద్ధదృష్టిషు. ౪౦

పదచ్ఛేదము.— పరస్పరాక్షిసాదృశ్యం, అదూరోజ్ఝితవర్త్మసు, మృగద్వంద్వేషు, పశ్యంతౌ, స్యందనాబద్ధదృష్టిషు.

అర్థము.—అదూరోజ్ఝితవర్త్మసు-అదూర=సమీపమానట్టులుగా, ఉజ్ఝిత=విడువఁబడిన, వర్త్మసు=మార్గముకలిగినట్టియు, స్యందనాబద్ధదృష్టిషు-స్యందన = రథమందు, ఆబద్ధ=సంబంధింపఁబడిన, దృష్టిషు=దృష్టులుకలిగిన, మృగద్వంద్వేషు-మృగ=జింకలయొక్క, ద్వంద్వేషు=స్త్రీపురుషయుగ్మములయందు, పరస్పరాక్షిసాదృశ్యం-పరస్పర=అన్యోన్యముయొక్క, అక్షి=నేత్రములయొక్క, సాదృశ్యం=సామ్యమును, పశ్యంతౌ=చూచుచున్నవారలయి, జగ్మతుః=తరలిపోయిరి.

అన్వయము.—జగ్మతుః=తరలిపోయిరి. పునఃకథంభూతౌ = ఇంకనెట్టివారలయి? పశ్యంతౌ=చూచుచున్నవారలయి. కిం=దేనిని? పరస్పరాక్షిసాదృశ్యం-పరస్పర=అన్యోన్యముయొక్క, అక్షి=నేత్రములయొక్క, సాదృశ్యం=సామ్యమును. కేషు=వేనియందు? మృగద్వంద్వేషు-మృగ=జింకలయొక్క, ద్వంద్వేషు=స్త్రీపురుషయుగ్మములయందు. మృగద్వంద్వేషుకథంభూతేషు=జింకలయొక్క స్త్రీపురుషయుగ్మములెట్టివి? స్యందనాబద్ధదృష్టిషు-స్యందన=రథమందు, ఆబద్ధ=సంబంధింపఁబడిన, దృష్టిషు=దృష్టులుకలిగినవి. పునఃకథంభూతేషు=ఇంకనెట్టివి? అదూరోజ్ఝితవర్త్మసు-అదూర=సమీపమానట్టుగా, ఉజ్ఝిత=విడువఁబడిన, వర్త్మసు=మార్గముకలిగినట్టివి.

శబ్దరూపసమాసములు.—పరస్పరాక్షిసాదృశ్యం-పరస్పరస్య అక్షిణీ పరస్పరాక్షిణీ, పరస్పరాక్ష్ణోః సాదృశ్యం పరస్పరాక్షిసాదృశ్యం, తత్ పరస్పరాక్షిసాదృశ్యం; సాదృశ్యం, సాదృశ్యే, సాదృశ్యాని. పరస్పరాక్షిసాదృశ్యశబ్దః అకారాంతనపుంసకలింగః ద్వితీయైకవచనాన్తః. అదూరోజ్ఝితవర్త్మసు - అదూరంయథాతథా ఉజ్ఝితం అదూరోజ్ఝితం, అదూరోజ్ఝితం వర్త్మయైస్తాని అదూరోజ్ఝితవర్త్మాని, తేషు అదూరోజ్ఝితవర్త్మసు; వర్త్మని, వర్త్మనోః, వర్త్మసు. అదూరోజ్ఝితవర్త్మన్ శబ్దః నకారాంతనపుంసకలింగః సప్తమీబహువచనాన్తః. మృగద్వంద్వేషు-మృగ్యశ్చమృగాశ్చమృగాః, మృగాణాం

ద్వంద్వాని మృగద్వంద్వాని, తేషు మృగద్వంద్వేషు; ద్వంద్వే, ద్వంద్వయోః, ద్వంద్వేషు. మృగద్వంద్వశబ్దః అకారాంత నపుంసకలింగః సప్తమీబహువచనాన్తః. పశ్యంతౌ - పశ్యన్, పశ్యంతౌ, పశ్యంతః. పశ్యచ్ఛబ్దః తకారాన్తః పుంలింగః ప్రథమాద్వివచనాన్తః. స్యందనాబద్ధదృష్టిషు-స్యందనే ఆబద్ధాః స్యందనాబద్ధాః; స్యందనాబద్ధాః దృష్టయో యైస్తాని స్యందనాబద్ధదృష్టీని; తేషు స్యందనాబద్ధదృష్టిషు; దృష్టిని, దృష్టౌ, దృష్టినోః, దృష్ట్యోః, దృష్టిషు. స్యందనాబద్ధదృష్టిశబ్దః ఇకారాంత నపుంసకలింగః సప్తమీ బహువచనాన్తః.

వ్యాఖ్యా.—పరస్పరేతి. విస్రంభాద్విశ్వాసాత్, అదూరంసమీపం యథాభవతి తథా ఉజ్ఝితం వర్త్మయైస్తేషు, స్యందనాబద్ధదృష్టిషు స్యందనేరథే ఆబద్ధా ఆసజ్జితాదృష్టయో యైస్తాని, ని. 'దృగ్దృష్టినేత్రలోచనచక్షుర్నయనాంబకేక్షణాక్షీణీ' తిహలాయుధః. కౌతుకవశాత్ రథాసక్తదృష్టిషు, మృగ్యశ్చమృగాశ్చ మృగాః, 'పుమాం స్త్రియే' త్యేకశేషః. తేషాంద్వంద్వేషు మిథునేషు, ని. 'స్త్రీపుంసౌమిథునంద్వంద్వ' మిత్యమరః, పరస్పరాక్షిసాదృశ్యం పశ్యన్తౌ-ద్వంద్వశబ్దసామర్థ్యాత్ మృగీషు సుదక్షిణాక్షిసాదృశ్యం దిలీపః, దిలీపాక్షిసాదృశ్యంచ మృగేషు సుదక్షిణేత్యేవం వివేక్తవ్యం.

భావము.—మార్గమునకు సమీపమందు తమరథమును చూచుచుండెడు మగ యాఁడు జింకలయొక్క కన్నులును తమకన్నులును ఒకటిగానుండు విశేషమును చూచుచు వెళ్లిరి.

శ్లో. శ్రేణీబంధా ద్వితన్వద్భి రస్తంభాం తోరణస్రజమ్,
సారసైః కలనిర్హ్రాదైః క్వచి దున్నమితాననౌ. ౪౧

పదచ్ఛేదము.—శ్రేణీబంధాత్, వితన్వద్భిః, అస్తంభాం, తోరణస్రజం, సారసైః, కలనిర్హ్రాదైః, క్వ, చిత్, ఉన్నమితాననౌ.

అర్థము—శ్రేణీబంధాత్ -శ్రేణీ=పఙ్క్తులయొక్క, బంధాత్ =కట్టడమువలన, అస్తంభాం=ఆధారస్తంభరహితమయిన, తోరణస్రజం - తోరణ=బహిర్ద్వారమందలి, స్రజం=మాలికను, వితన్వద్భిః = చేయుచున్న, కలనిర్హ్రాదైః - కల=అవ్యక్తమధురములయిన, నిర్హ్రాదైః=ధ్వనులుకలిగిన, సారసైః=సారసపక్షులచేత, క్వచిత్ =ఒకానొకప్రదేశమునందు, ఉన్నమితాననౌ-ఉన్నమిత=పైకెత్తఁబడిన; ఆననౌ=ముఖములుకలిగిన వారై, జగ్మతుః=తరలిపోయిరి.

ఆకాంక్ష—జగ్మతుః = తరలిపోయిరి. కథంభూతౌ=ఎట్టివారై ? ఉన్నమితాననౌ-ఉన్నమిత = పైకెత్తఁబడిన, ఆననౌ=ముఖములుకలిగిన వారై. కుత్ర=ఎక్కడ.

క్వచిత్=ఒకానొకప్రదేశమందు, కైః=వేనిచేత? సారసైః=సారసపక్షులచేత, సారసైః కథంభూతైః=సారసపక్షులెట్టివి? కలనిర్హ్రాదైః-కల=అవ్యక్తమధురములయిన, నిర్హ్రాదైః =ధ్వనులుకలిగినట్టివి. పునఃకథంభూతైః=ఇంకనెట్టివి? వితన్వద్భిః=చేయుచునట్టివి. కాం=దేనిని? తోరణస్రజం-తోరణ=బహిర్ద్వారమందలి, స్రజం=మాలికను. తోరణస్రజం కథంభూతాం=బహిర్ద్వారమందలిమాలికఎట్టిది? అస్తంభాం=ఆధారస్తంభరహితమయినది. కస్మాత్=దేనివలన? శ్రేణీబంధాత్-శ్రేణీ=పఙ్క్తులయొక్క, బంధాత్=కట్టడమువలన.

శబ్దరూపసమాసములు.—శ్రేణీబంధాత్ - శ్రేణీనాం బంధః శ్రేణీబంధః, తస్మాత్ శ్రేణీబంధాత్; బంధాత్, బంధాభ్యాం, బంధేభ్యః. శ్రేణీబన్ధశబ్దః అకారాంతఃపుంలింగః పంచమ్యేకవచనాన్తః. వితన్వద్భిః-వితన్వతా, వితన్వద్భ్యాం, వితన్వద్భిః. వితన్వచ్ఛబ్దః తకారాంతః పుంలింగః తృతీయాబహువచనాన్తః-అస్తంభాం, నవిద్యతే స్తంభః యస్యాస్సా అస్తంభా; తాం అస్తంభాం; అస్తంభాం, అస్తంభే, అస్తంభాః. అస్తంభాశబ్దః ఆకారాంతః స్త్రీలింగః ద్వితీయైకవచనాంతః. తోరణస్రజం - తోరణేస్రక్ తోరణస్రక్; తాం తోరణస్రజం; స్రజం, స్రజౌ, స్రజః. తోరణస్రక్ఛబ్దః జకారాంతః స్త్రీలింగః తృతీయాబహువచనాంతః. కలనిర్హ్రాదైః కలాః నిర్హ్రాదాః యేషాంతే కలనిర్హ్రాదాః, తైః కలనిర్హ్రాదైః; నిర్హ్రాదేన, నిర్హ్రాదాభ్యాం, నిర్హ్రాదైః. కలనిర్హ్రాదశబ్దః అకారాంతః పుంలింగః తృతీయాబహువచనాన్తః. క్వ-అవ్యయమ్. చిత్-అవ్యయమ్. ఉన్నమితాననౌ-ఉన్నమితే ఆననే యాభ్యాం తౌ ఉన్నమితాననౌ; ఉన్నమితాననః, ఉన్నమితాననౌ, ఉన్నమితాననాః. ఉన్నమితాననశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమాద్వివచనాన్తః.

వ్యాఖ్యా.—శ్రేణీతి. శ్రేణీబంధాత్ పఙ్క్తిబన్ధనాద్ధేతోః, అస్తంభాం ఆధారస్తంభరహితాం, తోరణం బహిర్ద్వారం, ని. 'తోరణోఽస్త్రీంబహిర్ద్వార' మిత్యమరః, యాత్రాదౌతత్రయా స్రగ్విరచ్యతే, తాం తోరణస్రజం, వితన్వద్భిః, కుర్వద్భిరివేత్యర్థః. ఉత్ప్రేక్షావ్యంజకేనాదిశబ్దప్రయోగాభావేపి గమ్యోత్ప్రేక్షేయం. కలనిర్హ్రాదైః అవ్యక్తమధురధ్వనిభిః, సారసైః పక్షివిశేషైః కరణైః, క్వచిదున్నమితాననౌ, ని. 'సారసో మైథునీకామీగోనర్దః పుష్కరాహ్వయ' ఇతియాదవః.

భావము.—ఒకానొకప్రదేశమందు స్తంభములులేని బహిర్ద్వారమునందు తోరణములుకట్టినరీతి పఙ్క్తులుగా నేర్పడి కలకలధ్వనులుచేయుచు పోవుసారసపక్షులను తలయెత్తి చూచుచు వెళ్లిరి.

శ్లో. పవనస్యానుకూలత్వా త్ప్రార్థనాసిద్ధిశంసినః,
రజోభి స్తురగోత్కీర్ణై రస్పృష్టాలకవేష్టనా. ౪౨

పదచ్ఛేదము.—పవనస్య, అనుకూలత్వాత్, ప్రార్థనాసిద్ధిశంసినః, రజోభిః, తురగోత్కీర్ణైః, అస్పృష్టాలకవేష్టనా.

అర్థము.—ప్రార్థనాసిద్ధిశంసినః - ప్రార్థనా = ఇష్టార్థముయొక్క, సిద్ధి = సిద్ధిని, శంసినః = చెప్పుచున్న, పవనస్య = వాయువుయొక్క, అనుకూలత్వాత్ =అనుకూల్యము వలన, తురగోత్కీర్ణైః-తురగ=అశ్వములచేత, ఉత్కీర్ణైః = ఎగరకొట్టఁబడిన, రజోభిః= పరాగముచేత, అస్పృష్టాలకవేష్టనా - అస్పృష్ట=స్పృశింపఁబడని, అలక=ముంగురులును, వేష్టనా=శిరోవేష్టనమును కలిగిన వారలయి, జగ్మతుః=తరలిపోయిరి.

ఆకాంక్ష.—జగ్మతుః=తరలిపోయిరి.'కథంభూతౌ=ఎట్టివారలయి? అస్పృష్టాలకవేష్టనా-అస్పృష్ట=స్పృశింపఁబడని, అలక=ముంగురులు, వేష్టనా=శిరోవేష్టనము కలిగినవారలయి. కైః=వేనిచేత? రజోభిః=పరాగములచేత. రజోభిః కథంభూతైః=పరాగములెట్టివి?తురగోత్కీర్ణైః-తురగ=అశ్వములచేత,ఉత్కీర్ణైః=ఎగరకొట్టఁబడినవి. కస్మాత్ =ఎందువలన? అనుకూలత్వాత్ = అనుకూల్యమువలన. కస్య=దేనియొక్క? పవనస్య = వాయువుయొక్క. పవనస్య కథంభూతస్య=వాయువు ఎట్టిది? ప్రార్థనాసిద్ధిశంసినః-ప్రార్థనా=ఇష్టార్థముయొక్క, సిద్ధి=సిద్ధిని, శంసినః=చెప్పుచున్నది.

శబ్దరూపసమాసములు.—పవనస్య - పవనస్య, పవనయోః, పవనానాం. పవనశబ్దః అకారాంతః పుంలింగః షష్ఠ్యేకవచనాన్తః. అనుకూలత్వాత్ -అనుకూలస్యభావః అనుకూలత్వం, తస్మాత్ అనుకూలత్వాత్; అనుకూలత్వాత్, అనుకూలత్వాభ్యాం, అనుకూలత్వేభ్యః. అనుకూలత్వశబ్దః అకారాంతనపుంసకలింగః పంచమ్యేకవచనాన్తః.ప్రార్థనాసిద్ధిశంసినః-ప్రార్థనాయాః సిద్ధిః ప్రార్థనాసిద్ధిః; ప్రార్థనాసిద్ధిం శంసతీతి ప్రార్థనాసిద్ధిశంసీ, తస్య ప్రార్థనాసిద్ధిశంసినః; శంసినః, శంసినోః,శంసినాం. ప్రార్థనాసిద్ధిశంసిన్ శబ్దః నకారాంతఃపుంలింగః షష్ఠ్యేకవచనాన్తః, రజోభిః - రజసా, రజోభ్యాం, రజోభిః. రజశ్శబ్దః నకారాంతనపుంసకలింగః తృతీయాబహువచనాన్తః. తురగోత్కీర్ణైః - తురగైః ఉత్కీర్ణాని తురగోత్కీర్ణాని; తైః తురగోత్కీర్ణైః; ఉత్కీర్ణేన, ఉత్కీర్ణాభ్యాం, ఉత్కీర్ణైః.తురగోత్కీర్ణ శబ్దః. అకారాంతనపుంసకలింగఃతృతీయాబహువచనాన్తః. అస్పృష్టాలకవేష్టనా-అలకాశ్చ వేష్టనంచ అలకవేష్టనాని, అస్పృష్టాని అలక వేష్టనాని యయోస్తౌ అస్పృష్టాలకవేష్టనౌ; వేష్టనః, వేష్టనౌ,వేష్టనాః. అస్పృష్టాలకవేష్టనశబ్దః అకారాంతఃపుంలింగః ప్రథమాద్వివచనాన్తః,

వ్యాఖ్యా.—పవనస్యేతి, ప్రార్థనాసిద్ధిసూచకస్య పవనస్య అనుకూలత్వా ద్గంతవ్య దిగభిముఖత్వాత్ తురగోత్కీర్ణైః, రజోభిః, అస్పృష్టాని అలకా దేవ్యాః-వేష్టనం ఉష్ణీషో రాజ్ఞ శ్చైతానియయోస్తౌ-'శిరసావేష్టనశోభినాన్నృప' ఇతి వక్ష్యతిచ.

భావము.—ఇష్టార్థసిద్ధిని సంపాదించెదురీతి వారల ప్రయాణమునకు అనుకూలముగా వెనుకప్రక్క గాలి విసరుటవలన గుఱ్ఱపువేగముచేత నెగిరెడుదుమ్ము సుదక్షిణాదేవి ముంగురులకును దిలీపమహారాజుశిరోవేష్టనమునకును సోకకయుండఁగను.

శ్లో. సరసీ ష్వరవిందానాం వీచివిక్షోభ శీతలమ్,
ఆమోద ముపజిఘ్రంతౌ స్వనిశ్వాసానుకారిణమ్. ౪౩

పదచ్ఛేదము.—సరసీషు, అరవిందానాం, వీచివిక్షోభశీతలం, ఆమోదం, ఉపజిఘ్రంతౌ, స్వనిశ్వాసానుకారిణం,

అర్థము —సరసీషు=సరస్సులయందు, వీచివిక్షోభశీతలం-వీచి = తరంగములయొక్క, విక్షోభ=చలించుటచేత, శీతలం=చల్లనయిన, స్వనిశ్వాసానుకారిణం-స్వ=తనయొక్క, నిశ్వాస=నిట్టూర్పువాయువులను, అనుకారిణం=అనుకరించుచున్న, అరవిందానాం=కమలములయొక్క, ఆమోదం = పరిమళమును, ఉపజిఘ్రంతౌ=ఆఘ్రాణించువారై, జగ్మతుః=తరలిపోయిరి.

ఆకాంక్ష.—జగ్మతుః=తరలిపోయిరి. పునఃకథంభూతౌ=ఇంక నెటువంటివారలయి? ఉపజిఘ్రంతౌ=ఆఘ్రాణించు వారలయి. కం=దేనిని? ఆమోదం=పరిమళంబును. కేషాం=వేనియొక్క? అరవిందానాం=కమలములయొక్క. ఆమోదం కథంభూతం = పరిమళమెట్టిది? స్వనిశ్వాసానుకారిణం - స్వ=తనయొక్క, నిశ్వాస=నిట్టూర్పువాయువులను, అనుకారిణం=అనుకరించునది. పునఃకథంభూతం=ఇంకనెట్టిది? వీచివిక్షోభశీతలం-వీచి=అలలయొక్క, విక్షోభ=చలించుటచేత, శీతలం=చల్లనైనది. కాసు=వేనియందు? సరసీషు=సరస్సులయందు.

శబ్దరూపసమాసములు —సరసీషు-సరస్యాం, సరస్యోః, సరసీషు. సరసీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః సప్తమీబహువచనాన్తః.అరవిందానాం-అరవిందస్య,అరవిందయోః, అరవిందానాం.అరవిందశబ్దః అకారాన్తనపుంసకలింగః షష్ఠీబహువచనాన్తః. వీచివిక్షోభశీతలం-వీచిభిః విక్షోభః వీచివిక్షోభః, వీచివిక్షోభేన శీతలః వీచివిక్షోభశీతలః,తం వీచివిక్షోభశీతలం;శీతలం,శీతలౌ,శీతలాన్.వీచివిక్షోభశీతలశబ్దః అకారాన్తఃపుంలింగః ద్వితీయైకవచనాన్తః.ఆమోదం-ఆమోదం,ఆమోదౌ,ఆమోదాన్.ఆమోదశబ్దఃఅకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనాన్తః. ఉపజిఘ్రంతౌ-ఉపజిఘ్రన్, ఉపజిఘ్రంతౌ, ఉప

జిఘ్రంతః. ఉపజిఘ్రచ్ఛబ్దః తకారాన్తః పుంలింగః ప్రథమాద్వివచనాన్తః. స్వనిశ్వాసాను కారిణం-స్వయోః నిశ్వాసాః స్వనిశ్వాసాః స్వనిశ్వాసాన్ అనుకరోతీతి స్వనిశ్వాసాను కారీ, తం స్వనిశ్వాసానుకారిణం; అనుకారిణం, అనుకారిణౌ, అనుకారిణః. స్వనిశ్వాసానుకారిన్ శబ్దః నకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనాన్తః.

వ్యాఖ్యా.—సరసీష్వితి, సరసీషు, వీచివిక్షోభశీతలం ఊర్మిసంఘాటనశీతలం, స్వనిశ్వాసమనుకర్తుం శీలమస్యేతిస్వనిశ్వాసానుకారిణం, ఏతేన తయో రుత్కృష్టస్త్రీపుంజాతిత్వముక్తం. అరవిందానాంఆమోదంపరిమళం-ఉపజిఘ్రంతౌ ఘ్రాణేనగృహ్ణంతౌ.

భావము.—మార్గమునందు తామరకొలఁకులలోని అలలవలన జల్లనై యుత్తమమైన పుట్టుకగల తమనిట్టూర్పులవాసనలను అనుసరించినదైన తామరపుష్పములపరిమళము వచ్చుచుండఁగా.

శ్లో. గ్రామేష్వాత్మవిసృష్టేషు యూపచిహ్నేషు యజ్వనామ్,
అమోఘాః ప్రతిగృహ్ణంతా వర్ఘ్యానుపద మాశిషః. ౪౪

పదచ్ఛేదము —గ్రామేషు, ఆత్మవిసృష్టేషు, యూపచిహ్నేషు, యజ్వనాం, అమోఘాః, ప్రతిగృహ్ణంతౌ, అర్ఘ్యానుపదం, ఆశిషః.

అర్థము.—ఆత్మవిసృష్టేషు-ఆత్మ=తనచేత, విసృష్టేషు=విడువఁబడిన, యూపచిహ్నేషు-యూప=యూపస్తంభములే, చిహ్నేషు=చిహ్నములుగాఁగల, గ్రామేషు=గ్రామములందు, అమోఘాః=సఫలములైన, యజ్వనాం=క్రమముగ యాగముచేయువారలయొక్క, ఆశిషః=ఆశీర్వాదములను, అర్ఘ్యానుపదం - అర్ఘ్య=పూజాద్రవ్యస్వీకారముకంటె, అనుపదం=తర్వాతను, ప్రతిగృహ్ణంతౌ=స్వీకరించువారలై, జగ్మతుః=తరలిపోయిరి.

ఆకాంక్ష.—జగ్మతుః=తరలిపోయిరి. పునఃకథంభూతౌ=ఇంకనెట్టివారలై? ప్రతిగృహ్ణంతౌ=స్వీకరించువారలై. కదా=ఎప్పుడు? అర్ఘ్యానుపదం - అర్ఘ్య=పూజాద్రవ్యస్వీకారమునకంటె, అనుపదం=తర్వాత. కాః=వేనిని? ఆశిషః=ఆశీర్వాదములను. కేషాం=ఎవరియొక్క? యజ్వనాం=క్రమముగ యాగముసేయువారలయొక్క. ఆశిషఃకథంభూతాః=ఆశీర్వాదములెట్టివి? అమోఘాః=సఫలములైనవి. కేషు=వేనియందు? గ్రామేషు=గ్రామములయందు. గ్రామేషుకథంభూతేషు=గ్రామములెట్టివి? యూపచిహ్నేషు-యూప=యూపస్తంభములే, చిహ్నేషు = చిహ్నములుగాకలవి. పునఃకథంభూతేషు=ఇంకనెట్టివి? ఆత్మవిసృష్టేషు-ఆత్మ=తనచేత, విసృష్టేషు=విడువఁబడినవి.

శబ్దరూపసమాసములు.—గ్రామేషు-గ్రామే, గ్రామయోః, గ్రామేషు. గ్రామ శబ్దః అకారాన్తః పుంలింగః సప్తమీబహువచనాన్తః. ఆత్మవిసృష్టేషు-ఆత్మనా విసృష్టాః ఆత్మవిసృష్టాః, తేషు ఆత్మవిసృష్టేషు; విసృష్టే, విసృష్టయోః, విసృష్టేషు. ఆత్మవిసృష్ట శబ్దః అకారాన్తః పుంలింగః సప్తమీబహువచనాన్తః. యూపచిహ్నేషు - యూపా ఏవచిహ్నానియేషాంతే యూపచిహ్నాః, తేషు యూపచిహ్నేషు; చిహ్నే, చిహ్నయోః, చిహ్నేషు. యూపచిహ్నశబ్దః అకారాన్తఃపుంలింగః సప్తమీబహువచనాన్తః. యజ్వనాం-యజ్వనః, యజ్వనోః, యజ్వనాం. యజ్వన్ శబ్దః నకారాన్తః పుంలింగః షష్ఠీబహువచనాన్తః. అమోఘాః-మోఘాః నభవంతీత్యమోఘాః, తాః అమోఘాః; అమోఘాం, అమోఘే, అమోఘాః. అమోఘాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయాబహువచనాన్తః. ప్రతిగృహ్ణంతౌ-ప్రతిగృహ్ణన్, ప్రతిగృహ్ణంతౌ, ప్రతిగృహ్ణంతః. ప్రతిగృహ్ణచ్ఛబ్దః తకారాన్తః పుంలింగః ప్రథమాద్వివచనాన్తః. అర్ఘ్యానుపదం-అర్ఘాయ ఇదం అర్ఘ్యం, అర్ఘ్యస్య అనుపదం అర్ఘ్యానుపదం. అవ్యయమ్. ఆశిషః-ఆశిషం, ఆశిషౌ, ఆశిషః. ఆశీశ్శబ్దః షకారాన్తః స్త్రీలింగః ద్వితీయాబహువచనాన్తః.

వ్యాఖ్యా.—గ్రామేష్వితి. ఆత్మవిసృష్టేషు స్వదత్తేషు, యూపోనామ యజ్ఞీయ పశుబంధనదారువిశేషః. యూపాఏవచిహ్నానియేషాంతేషు, గ్రామేషు, అమోఘాః సఫలాః, యజ్వనాం విధినేష్టవతాం, ని. 'యజ్వాతు విధినేష్టవా' నిత్యమరః, 'సుయజోర్ఙ్వనిబి' తి ఙ్వనిప్ప్రత్యయః. ఆశిషః ఆశీర్వాదాన్, అర్ఘ్యః పూజావిధిః, తదర్థం ద్రవ్యమర్ఘ్యం, 'పాదార్ఘాభ్యాంచే'తియత్ ప్రత్యయః, ని. 'షట్తుత్రిష్వర్ఘ్యమర్ఘార్థేపాద్యంపాదాయవారిణీ' త్యమరః, అర్ఘ్యస్య అనుపదమన్వక్, అర్ఘ్యస్వీకారానంతరమిత్యర్థః. ప్రతిగృహ్ణంతౌ స్వీకుర్వంతౌ, పదస్యపశ్చా దనుపదం, పశ్చాదర్థేవ్యయీభావః. ని. 'అన్వగన్వక్షమనుగేఽనుపదం క్లీబమవ్యయ' మిత్యమరః.

భావము.—పూర్వము తమచే నొసఁగఁబడినవియు యజ్ఞముల నొనర్చుటచే యూపస్తంభ చిహ్నముగలదారి యూరులయందు బ్రాహ్మణులచే నర్ఘ్యపాద్యాదుల నాశీర్వచనముల గ్రహించుచును.

శ్లో. హయ్యంగవీన మాదాయ ఘోషవృద్ధా నుపస్థితాన్,
నామధేయాని పృచ్ఛంతౌ వన్యానాం మార్గశాఖినామ్. ४५

పదచ్ఛేదము.—హయ్యంగవీనం, ఆదాయ, ఘోషవృద్ధాన్, ఉపస్థితాన్, నామధేయాని, పృచ్ఛంతౌ, వన్యానాం, మార్గశాఖినాం.

అర్థము.—హయ్యంగవీనం = సద్యోఘృతమును, ఆదాయ = తీసుకొని, ఉపస్థితాన్ = వచ్చిన, ఘోషవృద్ధాన్ - ఘోష = గొల్లపల్లెలనున్న, వృద్ధాన్ =ముదుసళ్లను, వన్యానాం = వనమందుపుట్టిన, మార్గశాఖినాం - మార్గ = మార్గమందలి, శాఖినాం = వృక్షములయొక్క, నామధేయాని = పేళ్లను, పృచ్ఛంతౌ = అడుగువారలై, జగ్మతుః = తరలిపోయిరి.

ఆకాంక్ష.—జగ్మతుః = తరలిపోయిరి. పునఃకథంభూతౌ = ఇంకనెట్టివారలై ? పృచ్ఛంతౌ = అడుగువారలై. కాని = వేనిని? నామధేయాని = పేరులను. కేషాం=వేనియొక్క? మార్గశాఖినాం - మార్గ = మార్గమందలి, శాఖినాం = వృక్షములయొక్క. మార్గశాఖినాంకథంభూతానాం = మార్గమందలివృక్షములెట్టివి? వన్యానాం = వనమందు పుట్టినవి. కాన్ =ఎవరిని? ఘోషవృద్ధాన్-ఘోష=గొల్లపల్లెలనున్న, వృద్ధాన్=ముదుసళ్లను, ఘోషవృద్ధాన్ కథంభూతాన్ = గొల్లపల్లెలయందలి గోపవృద్ధులెట్టివారలు? ఉపస్థితాన్ = వచ్చినవారలు. కింకృత్వా = ఏమిచేసి? ఆదాయ = తీసుకొని. కిం = దేనిని? హయ్యంగవీనం = సద్యోఘృతంబును.

శబ్దరూపసమాసములు.—హయ్యంగవీనం - హ్యః గోదోహోద్భవం హయ్యంగవీనం, తత్ హయ్యంగవీనం; హయ్యంగవీనం, హయ్యంగవీనే, హయ్యంగవీనాని. హయ్యంగవీనశబ్దః అకారాన్తనపుంసకలింగః ద్వితీయైకవచనాన్తః. ఆదాయ-ల్యప్ప్రత్యయాంత మవ్యయమ్. ఘోషవృద్ధాన్ - ఘోషేషు వృద్ధాః ఘోషవృద్ధాః, తాన్ ఘోషవృద్ధాన్; వృద్ధం, వృద్ధౌ, వృద్ధాన్. ఘోషవృద్ధశబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయాబహువచనాన్తః. ఉపస్థితాన్ - ఉపస్థితం, ఉపస్థితౌ, ఉపస్థితాన్. ఉపస్థితశబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయాబహువచనాన్తః. నామధేయాని-నామధేయం, నామధేయే, నామధేయాని. నామధేయశబ్దః అకారాంతనపుంసకలింగః ద్వితీయాబహువచనాన్తః. పృచ్ఛంతౌ - పృచ్ఛన్, పృచ్ఛంతౌ, పృచ్ఛంతః. పృచ్ఛచ్ఛబ్దః తకారాంతః పుంలింగః ప్రథమాద్వివచనాన్తః. వన్యానాం - వనే భవాః వన్యాః, తేషాం వన్యానాం; వన్యస్య, వన్యయోః, వన్యానాం. వన్యశబ్దః అకారాంతః పుంలింగః షష్ఠీబహువచనాన్తః. మార్గశాఖినాం - శాఖాః ఏషాంసంతీతి శాఖినః, మార్గే శాఖినః మార్గశాఖినః, తేషాం మార్గశాఖినాం; శాఖినః, శాఖినోః, శాఖినాం. మార్గశాఖిన్ శబ్దః నకారాంతః పుంలింగః షష్ఠీబహువచనాన్తః.

వ్యాఖ్యా.—హయ్యంగవీనమితి. హ్యస్తనగోదోహోద్భవం ఘృతం హయ్యంగవీనం, హ్యః పూర్వేద్యుః, ని. 'తత్తుహయ్యంగవీనంయద్ధ్యోగోదోహోద్భవంఘృత'మిత్యమరః, ని. 'హయ్యంగవీనంసంజ్ఞాయా' మితి నిపాతనాత్సాధుః, తత్సద్యోఘృత

మాదాయ, ఉపస్థితాన్ ప్రాప్తాన్, ఘోషేషువృద్ధాన్,ని. 'ఘోషఆభీరపల్లీస్యా' దిత్యమరః, వన్యానాం వనోద్భవానాం, మార్గశాఖినాంనామధేయానిపృచ్ఛంతౌ; 'దుహ్యా' జిత్యాదినాపృచ్ఛతే ర్ద్వికర్మకత్వం.

భావము.—ముందుదినమున పిండఁబడిన ఆవుపాలనుండితీసిన వెన్న కాచిన నెయ్యి దీసుకొనివచ్చిన గొల్లపల్లెలోని ముసలివారలను వనమందు మార్గములోనుండెడి చెట్లపేళ్ల నడుగుచును.

శ్లో. కాప్యభిఖ్యా తయో రాసీ ద్వ్రజతో శ్శుద్ధవేషయోః,
హిమనిర్ముక్తయో ర్యోగే చిత్రాచంద్రమసో రివ. ౪౬

పదచ్ఛేదము.—కా, అపి, అభిఖ్యా,తయోః,ఆసీత్, వ్రజతోః,శుద్ధవేషయోః, హిమనిర్ముక్తయోః, యోగే, చిత్రాచంద్రమసోః, ఇవ.

అర్థము.—వ్రజతోః = పోవుచున్నట్టియు, శుద్ధవేషయోః - శుద్ధ=నిర్మలమైన, వేషయోః = అలంకారములుకల, తయోః=ఆసుదక్షిణాదిలీపులకు, హిమనిర్ముక్తయోః - హిమ = మంచుచేత, నిర్ముక్తయోః=విడువఁబడిన, చిత్రాచంద్రమసోరివ=చిత్రానక్షత్ర చంద్రులకువలె, యోగేసతి = సంబంధముకలుగుచుండ, కాపి = అనిర్వచనీయమైన, అభిఖ్యా=శోభ, ఆసీత్=ఆయెను.

ఆకాంక్ష.—ఆసీత్=ఆయెను. కా=ఏది? అభిఖ్యా=శోభ. 'అభిఖ్యా' అనెడి ప్రథమాంతకర్తృపదమును 'ఆసీత్' అనెడిక్రియాపదము నున్నదిగనుక అకర్మకకర్తృ ప్రయోగము. అభిఖ్యాకథంభూతా=శోభఎట్టిది? కాపి=అనిర్వచనీయమయినది. కస్మిన్ సతి=యేమౌచుండఁగా,యోగేసతి=సంబంధముకలుగుచుండఁగా. కయోరివ=ఎవరికివలె? చిత్రాచంద్రమసోరివ=చిత్రానక్షత్రచంద్రులకువలె. చిత్రాచంద్రమసోఃకథంభూతయోః= చిత్రానక్షత్రచంద్రులెట్టివారు? హిమనిర్ముక్తయోః-హిమ = మంచుచేత, నిర్ముక్తయోః= విడువఁబడినవారు. కయోః=ఎవరికి?తయోః=ఆసుదక్షిణాదిలీపులకు. తయోః కథంభూతయోః=ఆసుదక్షిణాదిలీపులెట్టివారు? శుద్ధవేషయోః-శుద్ధ=ప్రకాశించుచుండు, వేషయోః = అలంకారంబులు కలవారు. పునః కథంభూతయోః = ఇంకనెట్టివారు? వ్రజతోః = పోవువారు.

శబ్దరూపసమాసములు.—కా-కా, కే, కాః. కింశబ్దః మకారాంతః స్త్రీలింగః ప్రథమైకవచనాన్తః. అపి-అవ్యయమ్. అభిఖ్యా- అభిఖ్యా, అభిఖ్యే, అభిఖ్యాః. అభిఖ్యా శబ్దః ఆకారాంతః స్త్రీలింగః ప్రథమైకవచనాన్తః. తయోః-తస్య, తయోః, తేషాం.

తచ్ఛబ్దః దకారాంతః పుంలింగః షష్ఠీద్వివచనాన్తః. ఆసీత్-ఆసీత్, ఆస్తాం, ఆసన్. 'అసభువి' త్యస్మాద్ధాతో రకర్మకాత్కర్తరి భూతే లఙ్ పరస్మైపదే ప్రథమపురుషైక వచనాన్తః. వ్రజతోః - వ్రజతః, వ్రజతోః, వ్రజతాం. వ్రజచ్ఛబ్దః తకారాంతః పుంలింగః షష్ఠీద్వివచనాన్తః. శుద్ధవేషయోః-శుద్ధౌ వేషౌ యయోస్తౌ శుద్ధవేషౌ, తయోః శుద్ధవేషయోః; వేషస్య, వేషయోః, వేషాణాం. శుద్ధవేషశబ్దః అకారాంతః పుంలింగః షష్ఠీద్వివచనాన్తః. హిమనిర్ముక్తయోః - హిమేన నిర్ముక్తౌ హిమనిర్ముక్తౌ, తయోః హిమనిర్ముక్తయోః; నిర్ముక్తస్య, నిర్ముక్తయోః, నిర్ముక్తానాం. హిమనిర్ముక్తశబ్దః అకారాంతః పుంలింగః షష్ఠీద్వివచనాన్తః. యోగే-యోగే, యోగయోః, యోగేషు. యోగశబ్దః అకారాంతః పుంలింగః సప్తమ్యేకవచనాంతః. చిత్రాచంద్రమసోః-చిత్రా చ చంద్రమాశ్చ చిత్రాచంద్రమసౌ,తయోః చిత్రాచంద్రమసోః; చిత్రాచంద్రమసౌ, 2 చిత్రాచంద్రమోభ్యాం, 3 చింత్రాచంద్రమసోః. 2 చిత్రాచంద్రమశ్శబ్దః సకారాంతః పుంలింగః నిత్యంద్వివచనే షష్ఠీద్వివచనాంతః.

వ్యాఖ్యా.—కాపీతి. వ్రజతోః గచ్ఛతోః, శుద్ధవేషయోః ఉజ్జ్వలనైపథ్యయోః, తయోస్సుదక్షిణాదిలీపయోః,హిమనిర్ముక్తయోః హిమేన తుహినేన నిర్ముక్తయో, శ్చిత్రాచంద్రమసోరివ యోగేసతి, ఏకస్థానవిద్యమానయోస్సతోరిత్యర్థః, కాప్యనిర్వాచ్యా, అభిఖ్యాశోభా, ఆసీత్, 'అభిఖ్యానామశోభయో' రిత్యమరశాశ్వత విశ్వప్రకాశాః 'ఆతశ్చోపసర్గ' ఇత్యఙ్ప్రత్యయః. చిత్రానక్షత్రవిశేషః. శిశిరాపగమేచైత్ర్యాం చిత్రాపూర్ణచంద్రమసోరివేత్యర్థః.

భావము.—పరిశుద్ధములగు నలంకారములు గలిగి వెళ్లుచున్న యారాజ దంపతులకు మంచుకాల మతిక్రమించినపిదప చిత్రానక్షత్రచంద్రులకువలె ననిర్వాచ్యమగు శోభవొడమెను.

శ్లో. తత్త ద్భూమిపతిః పత్న్యై దర్శయ న్ప్రియదర్శనః,
అపి లంఘిత మధ్వానం బుబుధే న బుధోపమః. ४८

పదచ్ఛేదము.—తత్తత్, భూమిపతిః, పత్న్యై, దర్శయన్, ప్రియదర్శనః, అపి, లంఘితం, అధ్వానం, బుబుధే, న, బుధోపమః.

అర్థము.—ప్రియదర్శనః-ప్రియ=ఇష్టమయిన, దర్శనః=దర్శనముకలిగినట్టియు, బుధోపమః-బుధ=బుధుఁడే, ఉపమః=సామ్యముగాకలిగిన,భూమిపతిః=దిలీపమహారాజు, పత్న్యై=భార్యయగు సుదక్షిణాదేవికొఱకు, తత్తత్=ఆయావస్తువులను, దర్శయన్ = చూపించువాఁడై,లంఘితమపి=దాఁటఁబడినదైనను, అధ్వానం=మార్గంబును, నబుబుధే= తెలియకపోయెను.

ఆకాంక్ష.—నబుబుధే=తెలియకపోయెను. కః=ఎవఁడు? భూమిపతిః=దిలీపమహారాజు. కం=దేనిని? అధ్వానం=మార్గమును. 'భూమిపతిః' అనెడి ప్రథమాంతకర్తృపదమును, 'అధ్వానం' అనెడి ద్వితీయాంతకర్మపదమును, 'నబుబుధే' అనెడి క్రియాపదమును నున్నది గనుక సకర్మకకర్తృప్రయోగము. కథంభూతమపి=ఏదైనను? లంఘితమపి=దాఁటఁబడినదైనను. కథంభూతః=ఎట్టివాఁడై? దర్శయన్=చూపువాఁడై. కిం దేనిని? తత్తత్=ఆయావస్తువులను. కస్యై=ఎవరికొఱకు? పత్న్యై=భార్యయగు సుదక్షిణాదేవికొఱకు, భూమిపతిః కథంభూతః=దిలీపమహారాజెట్టివాఁడు? బుధోపమః - బుధ=బుధుఁడే, ఉపమః=సామ్యముగాకలవాఁడు. పునః కథంభూతః=ఇంకనెట్టివాఁడు? ప్రియదర్శనః-ప్రియ=ఇష్టమయిన, దర్శనః=దర్శనముకలవాఁడు.

శబ్దరూపసమాసములు.—తత్తత్-తత్తత్, తే తే తాని తాని. తచ్ఛబ్దః దకారాంత నపుంసకలింగః ద్వితీయైకవచనాంతః. భూమిపతిః-భూమ్యాః పతిః భూమిపతిః; పతిః, పతీ, పతయః. భూమిపతిశబ్దః ఇకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. పత్న్యై-పత్న్యై, పత్నీభ్యాం, పత్నీభ్యః. పత్నీశబ్దః ఈకారాంతః స్త్రీలింగః చతుర్థ్యేకవచనాంతః. దర్శయన్-దర్శయన్, దర్శయంతౌ, దర్శయంతః. దర్శయచ్ఛబ్దః తకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. ప్రియదర్శనః-ప్రియం దర్శనం యస్య సః ప్రియదర్శనః; దర్శనః, దర్శనౌ, దర్శనాః. ప్రియదర్శనశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః అపి-అవ్యయమ్. లంఘితం-లంఘితం, లంఘితౌ, లంఘితాన్. లంఘితశబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః, అధ్వానం-అధ్వానం, అధ్వానౌ, అధ్వనః, అధ్వన్ శబ్దః నకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. బుబుధే-బుబుధే, బుబుధాతే, బుబుధిరే. 'బుధ అవగమన' ఇత్యస్మాద్ధాతోః సకర్మకాత్కర్తరి భూతే లిట్ ఆత్మనేపదే ప్రథమపురుషైకవచనాంతః. న-అవ్యయమ్. బుధోపమః - బుధ ఉపమా యస్య సః బుధోపమః; బుధోపమః, బుధోపమౌ, బుధోపమాః. బుధోపమశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః.

వ్యాఖ్యా.—తత్తదితి. ప్రియం దర్శనం స్వకర్మకం యస్యాసౌ ప్రియదర్శనః, దర్శనీయ ఇత్యర్థః, బుధోపమో, భూమిపతిః, పత్న్యై, తత్తదద్భుతం వస్తు, దర్శయన్, లంఘితమపి అధ్వానం, న బుబుధే నజ్ఞాతవాన్. బుధః సౌమ్య ఉపమానం యస్యేతి విగ్రహః; ఇదం విశేషణం తత్తద్దర్శయన్నిత్యత్రోపయోగితయైతస్యజ్ఞాతృత్వసూచనార్థం.

భావము.—ప్రియంకరుఁడై వస్తుపరిజ్ఞానమందు బుధునికి సముఁడైన దిలీపమహారాజు, తనభార్యకు ఆయావస్తువులను చూపుచు పోవుచుండినందున, దారలకు దోవ నడిచినట్లు తోఁచకపోయెను.

శ్లో. స దుష్ప్రాపయశాః ప్రాప దాశ్రమం శ్రాంతవాహనః,
సాయం సంయమిన స్తస్య మహర్షే ర్మహిషీసఖః. ౪౮

పదచ్ఛేదము.—సః, దుష్ప్రాపయశాః, ప్రాపత్, ఆశ్రమం, శ్రాంతవాహనః, సాయం, సంయమినః, తస్య, మహర్షేః, మహిషీసఖః.

అర్థము.—దుష్ప్రాపయశాః-దుష్ప్రాప=అన్యదుర్లభమైన, యశాః=కీర్తికలట్టియు, శ్రాంతహవాహనః-శ్రాంత=బడలిన, వాహనః=అశ్వములుగలట్టియు, మహిషీసఖః=భార్యాసమేతుఁడైన, సః=ఆదిలీపమహారాజు, సాయం=సాయంకాలమునందు, సంయమినః=నియమవంతుఁడైన, తస్య=ఆ, మహర్షేః=వసిష్ఠునియొక్క, ఆశ్రమం=ఆశ్రమమును, ప్రాపత్=పొందెను.

ఆకాంక్ష.—ప్రాపత్=పొందెను. కః=ఎవఁడు? సః=ఆదిలీపమహారాజు. కం=దేనిని? ఆశ్రమం=ఆశ్రమమును. 'సః' అనెడిప్రథమాంత కర్తృపదమును, 'ఆశ్రమం' అనెడి ద్వితీయాంతకర్మపదమును, 'ప్రాపత్' అనెడి క్రియాపదమునున్నవిగనుక సకర్మక కర్తృప్రయోగము. కస్య=ఎవరియొక్క? తస్య=ఆ, మహర్షేః=వసిష్ఠునియొక్క. మహర్షేఃకథంభూతస్య=వసిష్ఠుఁడెట్టివాఁడు? సంయమినః=నియమవంతుఁడైనవాఁడు. కదా=ఎప్పుడు? సాయం=సాయంకాలమునందు. సకథంభూతః = ఆదిలీపమహారాజెట్టివాఁడు? మహిషీసఖః=భార్యాసమేతుఁడయినవాఁడు. పునః కథంభూతః=ఇంకనెట్టివాఁడు? శ్రాంతవాహనః-శ్రాంత=బడలిన, వాహనః=అశ్వములుకలవాఁడు. పునఃకథంభూతః=ఇంకనెట్టివాఁడు? దుష్ప్రాపయశాః-దుష్ప్రాప=అన్యదుర్లభమయిన, యశాః=కీర్తికలవాఁడు.

శబ్దరూపసమాసములు.—సః-సః, తౌ, తే. తచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ప్రథమైకవచనాన్తః. దుష్ప్రాయశాః - దుఃఖేనప్రాప్తుం శక్యం దుష్ప్రాపం, దుష్ప్రాపం యశః యస్య సః దుష్ప్రాపయశాః; యశాః, యశసౌ, యశసః. దుష్ప్రాపయశశ్శబ్దః సకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. ప్రాపత్-ప్రాపత్, ప్రాపతాం, ప్రాపన్. ప్రేత్యుపసర్గపూర్వకాత్ 'ఆప్ల్వ్యాప్తౌ' విత్యస్మాద్ధాతోస్సకర్మకాత్కర్తరిభూతేలుఙ్ పరస్మైపదేప్రథమపురుషైకవచనాంతః. ఆశ్రమం-ఆశ్రమం, ఆశ్రమౌ, ఆశ్రమాన్. ఆశ్రమశబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. శ్రాంతవాహనః-శ్రాంతాని వాహనాని యస్యసః శ్రాంతవాహనః; వాహనః, వాహనౌ, వాహనాః. శ్రాంతవాహనశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. సాయం-అవ్యయమ్. సంయమినః-సంయమోఽస్యాస్తీతి సంయమీ, తస్య సంయమినః; సంయమినః, సంయమినోః, సంయమినాం. సంయమిన్ శబ్దః నకారాంతః పుంలింగః. షష్ఠ్యేకవచనాన్తః తస్య-తస్య, తయోః, తేషాం. తచ్ఛబ్దః దకారాంతఃపుంలింగః షష్ఠ్యేకవచనాన్తః. మహర్షేః-మహాం

శ్చాసౌ ఋషిశ్చ మహర్షిః, తస్య మహర్షేః; ఋషేః, ఋష్యోః, ఋషీణాం. మహర్షి శబ్దః ఇకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనాన్తః. మహిషీసఖః-మహిష్యాఃసఖా మహిషీ సఖః; మహిషీసఖః, మహిషీసఖౌ, మహిషీసఖాః. మహిషీసఖశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాన్తః.

వ్యాఖ్యా.—సఇతి. దుష్ప్రాపయశాః దుష్ప్రాపమన్యదుర్లభంయశో యస్యసతథోక్తః, శ్రాంతవాహనః దూరగమనాత్ క్లాంతయుగ్యః, మహిష్యాః సఖామహిషీసఖః, 'రాజాహస్సఖిభ్యష్ట'జితిటచ్ప్రత్యయః. సహాయాంతరనిరపేక్ష ఇతిభావః, సరాజా, సాయం సాయంకాలే, సంయమినః నియమవతః, తస్య మహర్షే ర్వసిష్ఠస్య, ఆశ్రమంప్రాపత్ ప్రాప్తః, పుషాదిత్వాదఙ్.

భా.—ఇతరులకు దుర్లభమయినయశస్సుగలదిలీపమహారాజు మహర్షియైనవసిష్ఠునియాశ్రమమును పత్నీసమేతుఁడై బడలియున్నగుఱ్ఱములతో సాయంకాలమున చేరెను.

అవ. తమాశ్రమంవిశినష్టి.—

శ్లో. వనాంతరా దుపావృత్తైః సమిత్కుశఫలాహరైః,
పూర్యమాణ మదృశ్యాగ్నిప్రత్యుద్యాతై స్తపస్విభిః. ౪౯

పదచ్ఛేదము.—వనాంతరాత్, ఉపావృత్తైః, సమిత్కుశఫలాహరైః, పూర్యమాణం, అదృశ్యాగ్నిప్రత్యుద్యాతైః, తపస్విభిః.

అర్థము.—వనాంతరాత్=అన్యవనములనుండి, ఉపావృత్తైః=వెనుకకుపచ్చిన, సమిత్కుశఫలాహరైః - సమిత్=సమిధలను, కుశ=దర్భలను, ఫల=ఫలములను, ఆహరైః=కొనివచ్చుస్వభావముకల, అదృశ్యాగ్నిప్రత్యుద్యాతైః-అదృశ్య=దర్శనార్హులుకాకుండు, అగ్ని=గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులచేత, ప్రత్యుద్యాతైః=ఎదురుకొనఁబడిన, తపస్విభిః=ఋషులచేత, పూర్యమాణం = నింపఁబడిన, ఆశ్రమం=ఆశ్రమమును, ప్రాపత్=పొందెను.

ఆకాంక్ష.—ప్రాపత్=పొందెను. కః=ఎవఁడు? సః=ఆదిలీపమహారాజు. కం=దేనిని? ఆశ్రమం=ఆశ్రమమును. 'సః' అనెడిప్రథమాంతకర్తృపదమును, 'ఆశ్రమం' అనెడిద్వితీయాంతకర్మపదమును, 'ప్రాపత్' అనెడి క్రియాపదమునున్నదిగనుక, సకర్మక కర్తృప్రయోగము. ఆశ్రమంపునః కథంభూతం=ఆశ్రమమింకనెటువంటిది? పూర్యమాణం=నింపఁబడినది. కైః=ఎవరిచేత? తపస్విభిః=ఋషులచేత. తపస్విభిఃకథంభూతైః=ఋషులెట్టివారు? అదృశ్యాగ్నిప్రత్యుద్యాతైః-అదృశ్య=దర్శనార్హులుకాని, అగ్ని=గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులచేత, ప్రత్యుద్యాతైః=ఎదురుకోఁబడినవారు. పునః కథంభూతైః=ఇంకనెట్టివారు? సమిత్కుశఫలాహరైః-సమిత్=సమిధలను,కుశ=దర్భలను, ఫల=

ఫలములను, ఆహారైః = కొనివచ్చెడుస్వభావముకలవారు. పునః కథంభూతైః=ఇంకనెట్టి వారు? ఉపావృత్తైః=వెనుకకువచ్చినవారు. కస్మాత్ =దేనినుండి? వనాంతరాత్ =అన్య వనమునుండి.

శబ్దరూపసమాసములు.—వనాంతరాత్ -అన్యద్వనం వనాంతరం,తస్మాత్ వనాం తరాత్ ; అంతరాత్, అంతరాభ్యాం, అంతరేభ్యః. వనాంతరశబ్దః అకారాంత నపుం సకలింగః పంచమ్యేకవచనాంతః. ఉపావృత్తైః - ఉపావృత్తేన, ఉపావృత్తాభ్యాం, ఉపావృత్తైః. ఉపావృత్తశబ్దః అకారాంతః పుంలింగః తృతీయాబహువచనాంతః. సమిత్కుశఫలాహారైః-సమిధశ్చకుశాశ్చ ఫలానిచ సమిత్కుశఫలాని, సమిత్కుశఫలాని ఆహరంతీతి సమిత్కుశఫలాహారాః, తైః సమిత్కుశఫలాహారైః;ఆహారేణ,ఆహారాభ్యాం, ఆహారైః. సమిత్కుశఫలాహారశబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహువచనాంతః. పూర్యమాణం-పూర్యమాణం, పూర్యమాణౌ, పూర్యమాణాన్. పూర్యమాణశబ్దః అకా రాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. అదృశ్యాగ్ని ప్రత్యుద్యాతైః-ద్రష్టుంయోగ్యాః దృశ్యాః, దృశ్యానభవంతీత్యదృశ్యాః; అదృశ్యాశ్చతే అగ్నయశ్చ అదృశ్యాగ్నయః, అదృశ్యాగ్నిభిః ప్రత్యుద్యాతాః అదృశ్యాగ్ని ప్రత్యుద్యాతాః, తైః అదృశ్యాగ్ని ప్రత్యు ద్యాతైః; ప్రత్యుద్యాతేన, ప్రత్యుద్యాతాభ్యాం, ప్రత్యుద్యాతైః. అదృశ్యాగ్నిప్రత్యు ద్యాతశబ్దః అకారాంతఃపుంలింగః తృతీయాబహువచనాంతః. తపస్విభిః-తపః ఏషా మ స్తీతి తపస్వినః, తైః తపస్విభిః; తపస్వినా, తపస్విభ్యాం, తపస్విభిః. తపస్విన్ శబ్దః నకారాంతః పుంలింగః తృతీయాబహువచనాంతః.

వ్యాఖ్యా.—వనాంతరాదితి. వనాంతరాదన్యస్మాద్వనాత్, ఉపావృత్తైః ప్ర త్యాగతైః సమిధశ్చఫలానిచ ఆహర్తుంశీలమేషామితి సమిత్కుశఫలాహారాః తైః, 'ఆజితా చ్ఛీల్య' ఇతి హరతేరాఙ్పూర్వాదణ్ప్రత్యయః, అదృశ్యైరదర్శనాయోగ్యైః అగ్నిభిర్వృ తాని కైః, ప్రత్యుద్యాతాః ప్రత్యుద్గతాః, తైః, తపస్విభిః, పూర్యమాణం వ్యాప్యమానం, ప్రోష్యాగచ్ఛతా మాహితాగ్నీనాం అగ్నిప్రత్యుద్యానం శ్రుతిప్రసిద్ధమేవ.

భావము.—ఇతరవనములనుండి సమిధలను దర్భలను పండ్లనుకొనివచ్చువారును, నగుపడనిత్రేతాగ్నులవలన యెదురుకొనఁబడిన ఋషులచేత నిబిడీకృతమయినదియు.

శ్లో. ఆకీర్ణ మృషిపత్నీనా ముటజద్వారరోధిభిః,
అపత్యై రివ నీవారభాగధేయోచితై ర్మృగైః. ౫౦

పదచ్ఛేదము.—ఆకీర్ణం, ఋషిపత్నీనాం, ఉటజద్వారరోధిభిః, అపత్యైః, ఇవ, నీవారభాగధేయోచితైః, మృగైః.

భావము.—పిమ్మట నేను నమస్కరించి యడిగికొనఁగా నే మతంగమహర్షి కిపశాపము కలిగెను. నీళ్ళు అగ్నిచేతఁగాని ఎండచేతఁగాని వేడిమిని పొందినను మరల దాని సహజముగుశైత్యమును పొందుచున్నది గదా! అనఁగా ఋషులు క్రోధులు గా రని భావము.

శ్లో. ఇక్ష్వాకువంశప్రభవో యదా తే
భేత్స్యత్యజః కుంభ మయోముఖేన,
సంయోక్ష్యసే స్వేన వపుర్మహిమ్నా
తదేత్యవోచ త్స తపోనిధి ర్మామ్. ॥౬॥

పదచ్ఛేదము.—ఇక్ష్వాకువంశప్రభవః, యదా, తే, భేత్స్యతి, అజః, కుంభం, అయోముఖేన, సంయోక్ష్యసే, స్వేన, వపుర్మహిమ్నా, తదా, ఇతి, అవోచత్, సః, తపోనిధిః, మాం.

అర్థము.—ఇక్ష్వాకువంశప్రభవః-ఇక్ష్వాకు=ఇక్ష్వాకురాజుయొక్క, వంశ=కులమునందు, ప్రభవః=ఉత్పత్తిగలిగిన, అజః=అజమహారాజు, యదా=ఏకాలమునందు, తే=నీయొక్క, కుంభం=కుంభస్థలమును, అయోముఖేన=బాణముచేత, భేత్స్యతి=భేదింపఁగలఁడో? తదా=ఆకాలమునందు, స్వేన=స్వకీయమయిన, వపుర్మహిమ్నా=శరీరముయొక్కమహత్వముతోడ, సంయోక్ష్యసే=సంబంధింపఁగలవు. ఇతి=ఈప్రకారముగ, సః=ఆ, తపోనిధిః=మతంగఋషి, మాం=నన్నుగూర్చి, అవోచత్=పలికెను.

అకాంక్ష.—అవోచత్=పలికెను. కః=ఎవఁడు? సః=ఆ,తపోనిధిః=మతంగఋషి. కం=ఎవనినిగూర్చి? మాం=నన్నుగూర్చి (సకర్మ...ము). కథం=ఎట్లు? ఇతి=ఈప్రకారముగ. సంయోక్ష్యసే=సంబంధింపఁగలవు. కః=ఎవఁడు? త్వం=నీవు(అకర్మ...ము). కేన=దేనితోడ? వపుర్మహిమ్నా=శరీరముయొక్క మహత్వముతోడ. వపుర్మహిమ్నా కథంభూతేన=శరీరమహత్వమెట్టిది? స్వేన=స్వకీయమైనది. కదా=ఎప్పుడు? తదా=ఆకాలమునందు. భేత్స్యతి=భేదింపఁగలఁడో! కః=ఎవఁడు? అజః=అజమహారాజు. కం=దేనిని? కుంభం=కుంభస్థలమును (సకర్మ...ము). కేన=దేనిచేత? అయోముఖేన=బాణముచేత. కస్య=ఎవనియొక్క? తే=నీయొక్క. కదా=ఎప్పుడు? యదా=ఏకాలమునందు. అజఃకథంభూతః=అజమహారాజెట్టివాఁడు? ఇక్ష్వాకువంశప్రభవః=ఇక్ష్వాకురాజుయొక్కకులమునందు ఉత్పత్తిగలవాఁడు.

శబ్దరూపసమాసములు.—ఇక్ష్వాకువంశ ప్రభవః - ఇక్ష్వాకోః వంశః ఇక్ష్వాకువంశః, ఇక్ష్వాకువంశే ప్రభవో యస్య సః ఇక్ష్వాకువంశప్రభవః; ప్రభవః, ప్రభవౌ,

ప్రభవాః. ఇక్ష్వాకువంశప్రభవశబ్దః అ, పు, ప్ర, ఏ. యదా-యస్మిన్ కాలే యదా-అవ్య. తే-తవ త్వే, యువయోః వాం, యుష్మాకం వః. యుష్మచ్ఛబ్దః ద, పు, ష, ఏ. భేత్స్యతి-భేత్స్యతి, భేత్స్యతః, భేత్స్యంతి. 'భిదుర్విదారణ' ఇత్యస్మాద్ధాతో స్సకర్మకాత్కర్తరి భవిష్యతి లృట్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాన్తః. అజః-అజః, అజౌ, అజాః. అజశబ్దః అ, పు, ప్ర, ఏ. కుంభం-కుంభం, కుంభౌ, కుంభాన్. కుంభశబ్దః అ, పు, ద్వి, ఏ. అయోముఖేన-అయోరూపం ముఖం యస్య సః అయోముఖః, తేన అయోముఖేన; ముఖేన, ముఖాభ్యాం, ముఖైః. అయోముఖశబ్దః అ, పు, తృ, ఏ. సంయోక్ష్యసే-సంయోక్ష్యసే, సంయోక్ష్యేథే, సంయోక్ష్యధ్వే. సమ్పూర్వకాత్ 'యుజిర్ యోగే' ఇత్యస్మాద్ధాతో రకర్మకాత్కర్తరిభవిష్యతి లృట్ ఆత్మనేపదే మధ్యమపురుషైకవచనాన్తః. స్వేన-స్వేన, స్వాభ్యాం, స్వైః. స్వశబ్దః అ, పు, తృ, ఏ. వపుర్మహిమ్నా-మహతోభావః మహిమా, వపుషః మహిమా వపుర్మహిమా, తేన వపుర్మహిమ్నా; మహిమ్నా, మహిమభ్యాం, మహిమభిః. వపుర్మహిమన్ శబ్దః న, పు, తృ, ఏ. తదా-తస్మిన్ కాలే తదా-అవ్య. ఇతి-అవ్య. అవోచత్-అవోచత్, అవోచతాం, అవోచన్. 'వచపరిభాషణ' ఇత్యస్మాద్ధాతో స్సకర్మకాత్కర్తరి భూతే లుఙ్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాన్తః. సః-సః, తౌ, తే. తచ్ఛబ్దః ద, పు, ప్ర, ఏ. తపోనిధిః-తపసాం నిధిః తపోనిధిః, నిధిః, నిధీ, నిధయః. తపోనిధిశబ్దః ఇ, పు, ప్ర, ఏ. మాం-మాం మా, ఆవాం నౌ, అస్మాన్ నః. అస్మచ్ఛబ్దః ద, పు, ద్వి, ఏ.

వ్యాఖ్యా.—ఇక్ష్వాక్వితి. ఇక్ష్వాకువంశే ప్రభవోయస్యసః అజః, యదా, తేతవకుంభం అయోముఖేన లోహాగ్రేణ శరేణ, భేత్స్యతి విదారయిష్యతి, తదాస్వేనవపుషోమహిమ్నా, పునస్సంయోక్ష్యసే సంగచ్ఛసే, ఇతిఅనేనప్రకారేణ, సః తపోనిధిః తపసాం స్థానభూతః, మతంగః మామవోచత్.

భావము.—ఇక్ష్వాకువంశస్థుఁడయినయజమహారాజు నీకుంభస్థలమును బాణముచేత ఎపుడు భేదింపఁగలఁడో అపుడు నీదివ్యరూపమును బొందగల వని యాయన యానతిచ్చెను.

శ్లో. సమ్మోచిత స్సత్త్వవతా త్వయాఽహం
శాపా చ్చిరప్రార్థితదర్శనేన,
ప్రతిప్రియం చే ద్భవతో న కుర్యాం
వృథా హి మే స్యా త్స్వపదోపలబ్ధిః. ౫౮

పదచ్ఛేదము.—సమ్మోచితః, సత్త్వవతా, త్వయా, అహం, శాపాత్, చిరప్రా

ర్థితదర్శనేన, ప్రతిప్రియం, చేత్, భవతః, న, కుర్యాం, వృథా, హి, మే, స్యాత్, స్వపదోపలబ్ధిః.

అర్థము.—చిరప్రార్థితదర్శనేన-చిర=బహుకాలమువలన, ప్రార్థిత=కోరఁబడిన, దర్శనేన=దర్శనముగల, సత్త్వవతా=బలముకలిగిన, త్వయా=నీచేత, అహం=నేను, శాపాత్=శాపమువలన, సమ్మోచితః=విడిపింపఁబడితిని, భవతః=నీకు, ప్రతిప్రియం=ప్రత్యుపకారమును నకుర్యాంచేత్=చేయనివాఁడనైతినా, మే=నాయొక్క, స్వపదోపలబ్ధిః-స్వ=స్వకీయమయిన, పద=స్థానముయొక్క, ఉపలబ్ధిః=ప్రాప్తి, వృథాహి=వ్యర్థమయినట్టిదే, స్యాత్ =అగును.

అన్వయము.—స్యాత్=అగును. కా=ఏది? స్వపదోపలబ్ధిః=స్వకీయమయినస్థానముయొక్కప్రాప్తి (అకర్మ...ము). కథం=ఎట్టిదే? వృథాహి=వ్యర్థమయినదే. కస్య=ఎవనియొక్క? మే=నాయొక్క. నకుర్యాంచేత్=చేయనివాఁడనయితినా. కః=ఎవఁడు? అహం=నేను. కం=దేనిని? ప్రతిప్రియం=ప్రత్యుపకారమును (సకర్మ...ము). కస్య=ఎవనికి? భవతః=నీకు. సమ్మోచితః = విడిపింపఁబడితిని. కేన = ఎవనిచేతను? త్వయా=నీచేతను. కః=ఎవఁడు? అహం=నేను (కర్మణి...ము). కస్మాత్=దేనివలన? శాపాత్ = శాపమువలన. త్వయా కథంభూతేన=నీవెట్టివాఁడవు? సత్త్వవతా=బలముగలవాఁడవు. పునః కథంభూతేన=ఇంకయు నెట్టివాఁడవు? చిరప్రార్థితదర్శనేన=బహుకాలమువలన గోరఁబడిన దర్శనముకలవాఁడవు.

శబ్దరూపసమాసములు.—సమ్మోచితః-సమ్మోచితః, సమ్మోచితౌ, సమ్మోచితాః. సమ్మోచితశబ్దః అ, పు, ప్ర, ఏ. సత్త్వవతా-సత్త్వమస్యాస్తీతి సత్త్వవాన్, తేన సత్త్వవతా; సత్త్వవతా, సత్త్వవద్భ్యాం, సత్త్వవద్భిః. సత్త్వవచ్ఛబ్దః త, పు, తృ, ఏ. త్వయా-త్వయా, యువాభ్యాం, యుష్మాభిః. యుష్మచ్ఛబ్దః ద, పు, తృ, ఏ. అహం-అహం, ఆవాం, వయం అస్మచ్ఛబ్దః ద, పు, ప్ర, ఏ. శాపాత్-శాపాత్, శాపాభ్యాం, శాపేభ్యః. శాపశబ్దః అ, పు, పం, ఏ. చిరప్రార్థితదర్శనేన-చిరంప్రార్థితం చిరప్రార్థితం, చిరప్రార్థితం దర్శనంయస్యసః చిరప్రార్థితదర్శనః, తేన చిర...దర్శనేన; దర్శనేన, దర్శనాభ్యాం, దర్శనైః చిరప్రార్థితదర్శనశబ్దః అ, పు, తృ, ఏ. ప్రతిప్రియం-ప్రతిప్రియం, ప్రతిప్రియే, ప్రతిప్రియాణి. ప్రతిప్రియశబ్దః అ, న, ద్వి, ఏ. చేత్-అవ్య. భవతః-భవతః, భవతోః, భవతాం. భవచ్ఛబ్దః త, పు, ష, ఏ. న-అవ్య. కుర్యామ్-కుర్యామ్, కుర్యావ, కుర్యామ. 'డుకృఞ్ కరణే' ఇత్యస్మాద్ధాతోః స్సకర్మకాత్కర్తరి విధ్యాదౌ లిఙ్ పరస్మైపదే ఉత్తమపురుషైకవచనాన్తః. వృథా-అవ్య. హి-అవ్య. మే-మమ మే, ఆవయోః నౌ, అస్మాకం నః. అస్మచ్ఛబ్దః ద, పు, ష, ఏ. స్యాత్ - స్యాత్,

స్యాతాం, స్యుః. 'అసభువీ'త్యస్మాద్ధాతోరకర్మకాత్కర్తరి విధ్యాదౌ లిఙ్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాన్తః. స్వపదోపలబ్ధిః-స్వస్య పదం స్వపదం, స్వపదస్య ఉపలబ్ధిః స్వపదోపలబ్ధిః ఉపలబ్ధిః, ఉపలబ్ధీ, ఉపలబ్ధయః. స్వపదోపలబ్ధిశబ్దః ఇ, స్త్రీ, ప్ర, ఏ.

వ్యాఖ్యా ...సమ్మోహితఇతి. చిరప్రార్థితం చిరకాలం కాంక్షితం,దర్శనంయస్య తేన, సత్వవతా బలవతా, త్వయా, అహం, శాపాత్, సమ్మోహితః మోహంప్రాపితః, భవతః,ప్రతిప్రియం ప్రత్యుపకారం,నకుర్యాం చేత్,మే స్వపదోపలబ్ధిః స్వస్థానప్రాప్తిః, 'పదం వ్యవసితత్రాణస్థానలక్ష్మాంఘ్రివస్తు' ష్విత్యమరః. వృథా స్యాత్, 'వ్యర్థకే తు వృథా ముధే' త్యమరః. తదుక్తం 'ప్రతికర్తు మశక్యస్య జీవితా న్మరణం వరం' కృతోపకారస్య ప్రత్యుపకారః కర్తవ్య ఇతి భావః.

భావము.—నేను బహుకాలమునుండి నీదర్శనమును నిరీక్షించు చుండఁగా ఇపుడు బలవంతుఁడయిన నీచేత నేను శాపవిముక్తుఁడ నైతిని. నీకు నేను ప్రత్యుపకారము చేయనియెడల నాపదవి వ్యర్థ మగును.

శ్లో. సమ్మోహనం నామ సఖే మమాస్త్రం
ప్రయోగసంహారవిభక్తమన్త్రమ్,
గాన్ధర్వ మాధత్స్వ యతః ప్రయోక్తుః
న చారిహింసా విజయశ్చ హస్తే. ౫౭

పదచ్ఛేదము —సమ్మోహనం, నామ, సఖే, మమ, అస్త్రం, ప్రయోగసంహారవిభక్తమన్త్రం, గాన్ధర్వం, ఆధత్స్వ, యతః, ప్రయోక్తుః, న, చ, అరిహింసావిజయః, చ, హస్తే.

అర్థము.—హేసఖే = ఓయిస్నేహితుఁడా! ప్రయోగసంహారవిభక్తమన్త్రం - ప్రయోగసంహార = ప్రయోగోపసంహారములయందు, విభక్త = విభాగముచేయఁబడిన, మన్త్రం=మన్త్రముకలిగిన,గాన్ధర్వం=గన్ధర్వదేవతాకమైన,సమ్మోహనంనామ=సమ్మోహనము అనిప్రసిద్ధమయిన, మమ=నాయొక్క,అస్త్రం=అస్త్రమును,ఆధత్స్వ=గ్రహింపుము. యతః=యేసమ్మోహనాస్త్రమువలన, ప్రయోక్తుః=ప్రయోగించినవానికి, అరిహింసా-అరి=శత్రువులవలన, హింసా=హింస, నచ==లేదో, విజయశ్చ=విజయమును, హస్తే=హస్తగతమయినదో.

ఆకాంక్ష.—హస్తే=హస్తగతమైనదో. కశ్చ=ఏదియును?విజయశ్చ=విజయమును. అకర్మ...ము). నచ=లేదో.కా=ఏది?అరిహింసా=శత్రువులవలనహింస (అకర్మ...ము).

కస్య=ఎవనికి? ప్రయోక్తుః=ప్రయోగించినవానికి. కుతః=దేనివలన? యతః=ఏసమ్మోహనాస్త్రమువలన, ఆధత్స్వ=గ్రహింపుము. కః=ఎవఁడు? త్వం=నీవు. కిం=దేనిని? అస్త్రం=అస్త్రమును(సకర్మ...ము). కస్య=ఎవనియొక్క? మమ=నాయొక్క. అస్త్రంకథంభూతం=అస్త్రమెట్టిది? సమ్మోహనంనామ=సమ్మోహనము అనిప్రసిద్ధమైనది పునఃకథంభూతం=ఇంకయు నెట్టిది? గాంధర్వం=గంధర్వదేవతాకమైనది. పునః కథంభూతం = ఇంకయు నెట్టిది? ప్రయోగసంహారవిభక్తమంత్రం=ప్రయోగసంహారములయందు విభాగముచేయఁబడిన మంత్రముకలిగినది. కస్యసంబుద్ధిః? హేసఖే=ఓస్నేహితుఁడా!.

శబ్దరూపసమాసములు —సమ్మోహనం-సమ్మోహ్యతే అనేనేతిసమ్మోహనం, తత్ సమ్మోహనం; సమ్మోహనం, సమ్మోహనే, సమ్మోహనాని. సమ్మోహనశబ్దఃఅ, న, ద్వి, ఏ. నామ-అవ్య. సఖే-హేసఖే, హేసఖాయౌ, హేసఖాయః. సఖిశబ్దః ఇ, పు, సం, ఏ. మమ-మమ మే, ఆవయోః నౌ, అస్మాకం నః అస్మచ్ఛబ్దః ద, పు, ష, ఏ. అస్త్రం-అస్త్రం, అస్త్రే, అస్త్రాణి అస్త్రశబ్దః అ, న, ద్వి, ఏ. ప్రయోగసంహారవిభక్తమంత్రం-ప్రయోగశ్చ సంహారశ్చ ప్రయోగసంహారౌ, ప్రయోగసంహారయోః విభక్తః ప్రయోగ ...విభక్తః, ప్రయోగ...విభక్తః మంత్రః యస్యతత్ ప్రయోగ...మంత్రం, తత్ ప్రయోగ...మంత్రం; మంత్రం, మంత్రే, మంత్రాణి. ప్రయోగ ..మంత్రశబ్దః అ, న, ద్వి, ఏ. గాంధర్వం-గంధర్వో దేవతాస్యగాంధర్వం, తత్ గాంధర్వం; గాంధర్వం, గాంధర్వే, గాంధర్వాణి. గాంధర్వశబ్దః అ, న, ద్వి ఏ. ఆధత్స్వ-ఆధత్స్వ, ఆదధాథాం, ఆదధ్వం. ఆఙ్పూర్వకాత్ 'డుధాఞ్ ధారణపోషణయో' రిత్యస్మాద్ధాతో స్సకర్మకాత్కర్తరి విధ్యాదౌ లోట్ ఆత్మనేపదే మధ్యమపురుషైకవచనాంతః. యతః-తసిల్ ప్రత్యయాంతమవ్య. ప్రయోక్తుః - ప్రయోక్తుః, ప్రయోక్త్రోః, ప్రయోక్తౄణాం. ప్రయోక్తృశబ్దః ఋ, పు, ష, ఏ న-అవ్య. చ-అవ్య. అరిహింసా-అరిభ్యః హింసా అరిహింసా; హింసా, హింసే, హింసాః. అరిహింసాశబ్దః ఆ. స్త్రీ, ప్ర, ఏ. విజయః-విజయః, విజయౌ, విజయాః. విజయశబ్దః అ, పు, ప్ర, ఏ. చ-అవ్య. హస్తే - హస్తే, హస్తయోః, హస్తేషు. హస్తశబ్దః అ, పు, స, ఏ.

వ్యాఖ్యా.—సమ్మోహనమితి. హేసఖే, సఖిశబ్దేన సమప్రాణతోక్తా, యథోక్తం, 'ఆత్మాదిగహనో బంధుః సదైకానుమత స్సుహృత్, ఏకక్రియం భవేన్మిత్రం సమప్రాణ స్సఖా మత' ఇతి. ప్రయోగసంహారయోః, విభక్తః మంత్రః యస్య తత్తథోక్తం, వినియుక్తం మంత్రమిత్యర్థః. గాంధర్వం గంధర్వదేవతాకం, సంమోహ్యతే అనేనేతి సంమోహనం నామ మమ అస్త్రం, ఆధత్స్వ గృహాణ, యతః యస్మాత్, ప్రయోక్తుః అస్త్రప్రయోగిణః, అరిహింసా అరిభ్య స్సకాశాత్ హింసా చ, విజయశ్చ హస్తే హస్తగతః, విజయో భవతీత్యర్థః.

భావము — ఓ చెలికాఁడా! ఏయస్త్రప్రయోగముచేత శత్రువులవలనఁ దనకుఉపాధిసంభవింపక వారుజయింపఁబడుచున్నారో అట్టిసమ్మోహన మనెడియస్త్రమును నీకు నేను ఇచ్చుచున్నాను. ఆయస్త్రము ప్రయోగించుటకును ఉపసంహారము (అనఁగా వెనుకకు త్రిప్పుట) చేయుటకును దగిన గంధర్వదేవతాసంబంధములయిన రెండుమంత్రములను నీకు నుపదేశము చేయుచున్నాను,

అవ. వధలజ్జితః కథ మస్త్రగ్రహణపర స్స్యాం? ఇతిచే త్తత్రాహ.—

శ్లో. అలం హ్రియా మాం ప్రతి యన్ముహూర్తం
దయాపరోఽభూః ప్రహర న్నపి త్వమ్,
తస్మా దుపచ్ఛందయతి ప్రయోజ్యం
మయి త్వయా న ప్రతిషేధరౌక్ష్యమ్. ॥౫౮॥

పదచ్ఛేదము.—అలం, హ్రియా, మాం, ప్రతి, యత్, ముహూర్తం, దయాపరః, అభూః, ప్రహరన్, అపి, త్వం, తస్మాత్, ఉపచ్ఛందయతి, ప్రయోజ్యం, మయి, త్వయా, న, ప్రతిషేధరౌక్ష్యం.

అర్థము.—మాంప్రతి=నన్నుగూర్చి, హ్రియా=ప్రహారనిమిత్తమగు లజ్జచేతను, అలం=చాలును. యత్=ఏకారణమువలన, త్వం=నీవు, మాం=నన్ను, ప్రహరన్నపి=ప్రహరించినవాఁడవయినప్పటికిని, ముహూర్తం=ముహూర్తమాత్రమందు, దయాపరః=దయాశాలివైనవాఁడవు, అభూః=అయితివో, తస్మాత్=ఆకారణమువలన, ఉపచ్ఛందయతి=ప్రార్థనచేయుచుండెడి, మయి=నాయందు, త్వయా=నీచేత, ప్రతిషేధరౌక్ష్యం-ప్రతిషేధ=పరిహారమనెడి, రౌక్ష్యం=పరుషత్వము, నప్రయోజ్యం=ప్రయోగింపఁబడఁతగినదికాదు.

ఆకాంక్ష.—నప్రయోజ్యం=ప్రయోగింపఁబడతగినదికాదు. కేన=ఎవనిచేత? త్వయా=నీచేత కిం=ఏది? ప్రతిషేధరౌక్ష్యం=పరిహారమనెడిపరుషత్వము (కర్మణి...ము).కస్మిన్=ఎవనియందు? మయి=నాయందు. మయికథంభూతే=నేనెట్టివాఁడను?ఉపచ్ఛందయతి=ప్రార్థించుచుండెడివాఁడను. కస్మాత్=దేనివలన? తస్మాత్=ఆకారణమువలన. అభూః=అయితివో. కః=ఎవఁడు? త్వం=నీవు (ఆకర్మ...ము). కథంభూతః=ఎట్టివాఁడవు? దయాపరః=దయాశాలివైనవాఁడవు. కం=దేనియందు? ముహూర్తం=ముహూర్తమాత్రమునందు.కథంభూతోఽపి=ఎట్టివాఁడయినప్పటికి? ప్రహరన్నపి=ప్రహరించినవాఁడవయినప్పటికి. కం=ఎవనిని? మాం=నన్ను. కుతః=ఎందువలనను? యత్=ఏకారణమువలనను. అలం=చాలును. కయా=దేనిచేత? హ్రియా=ప్రహారనిమిత్తమగులజ్జచేత. కంప్రతి=ఎవనిగూర్చి? మాంప్రతి=నన్నుగూర్చి.

శబ్దరూపసమాసములు.—అలం-అవ్య. హ్రియా-హ్రియా, హ్రీభ్యాం, హ్రీభిః. హ్రీశబ్దః ఈ, స్త్రీ, తృ, ఏ. మాం-మాం మా, ఆవాం నౌ, అస్మాన్ నః. అస్మచ్ఛబ్దః ద, పు, ద్వి, ఏ ప్రతి-అవ్య. యత్-అవ్య ముహూర్తం-ముహూర్తం, ముహూర్తౌ, ముహూర్తాన్. ముహూర్తశబ్దః అ, పు, ద్వి, ఏ. దయాపరః-దయాయాః పరః దయాపరః; పరః, పరౌ, పరాః. దయాపరశబ్దః అ, పు, ప్ర, ఏ. అభూః-అభూః, అభూతం, అభూత. 'భూసత్తాయా' మిత్యస్మాద్ధాతోరకర్మకాత్కర్తరిభూతేలిట్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః. ప్రహరన్-ప్రహరన్, ప్రహరంతౌ, ప్రహరంతః. ప్రహరచ్ఛబ్దః ద, పు, ప్ర, ఏ. అపి-అవ్య. త్వం-త్వం, యువాం, యూయం. యుష్మచ్ఛబ్దః ద, పు, ప్ర, ఏ. తస్మాత్-తస్మాత్, తాభ్యాం, తేభ్యః. తచ్ఛబ్దః ద, న, పం, ఏ. ఉపచ్ఛందయతి—ఉపచ్ఛందయతి, ఉపచ్ఛందయతోః, ఉపచ్ఛందయత్సు. ఉపచ్ఛందయచ్ఛబ్దః త, పు, స, ఏ. ప్రయోజ్యం-ప్రయోక్తుం యోగ్యం ప్రయోజ్యం; ప్రయోజ్యం, ప్రయోజ్యే, ప్రయోజ్యాని. ప్రయోజ్యశబ్దః అ, న, ప్ర, ఏ. మయి-మయి, ఆవయోః, అస్మాసు. అస్మచ్ఛబ్దః ద, పు, స, ఏ త్వయా-త్వయా, యువాభ్యాం, యుష్మాభిః. యుష్మచ్ఛబ్దః ద, పు, తృ, ఏ. న-అవ్య. ప్రతిషేధరౌక్ష్యం-ప్రతిషేధఏవ రౌక్ష్యం ప్రతిషేధరౌక్ష్యం; రౌక్ష్యం, రౌక్ష్యే, రౌక్ష్యాణి. ప్రతిషేధరౌక్ష్యశబ్దః అ, న, ప్ర, ఏ.

వ్యాఖ్యా.—అలమితి. కించ మాం ప్రతి, హ్రియా ప్రహారనిమిత్తయా లజ్జయా అలం, 'అలంభూషణ పర్యాప్తి శక్తివారణవాచక' మిత్యమరః. కుతః యద్యతో హేతోః, త్వం మాం ప్రహర న్నపి, ముహూర్తం దయాపరః కృపాళు రభూః, తత్తస్మాత్కారణాత్, ఉపచ్ఛందయతి ప్రార్థయమానే తు, మయి త్వయా ప్రతిషేధః పరిహార స్స ఏవ రౌక్ష్యం, పారుష్యం, న ప్రయోజ్యం న కర్తవ్యం.

భావము — దీనిం బ్రహరించి దీనివలన నుపకారము నెట్లుపొందెదనని లజ్జింపకుము. నాపై బాణము వేసినతోడనే పశ్చాత్తాపము నొంది కరుణించితివి. కనుక నాప్రార్థన నంగీకరించి నాయుపకారమును నిషేధింపవలదు.

శ్లో. తథే త్యుపస్పృశ్య పయః పవిత్రం
సోమోద్భవాయా స్సరితో నృసోమః,
ఉదఙ్ముఖ స్సోఽస్త్రవిదస్త్రమంత్రం
జగ్రాహ తస్మా న్నిగృహీతశాపాత్. ౫౯

పదచ్ఛేదము.—తథా, ఇతి, ఉపస్పృశ్య, పయః, పవిత్రం, సోమోద్భవాయాః, సరితః, నృసోమః, ఉదఙ్ముఖః, సః, అస్త్రమంత్రం, జగ్రాహ, తస్మాత్, నిగృహీతశాపాత్.

అర్థము.—నృసోమః=పురుషశ్రేష్ఠుఁడైన, అస్త్రవిత్=అస్త్రజ్ఞుఁడైన, సః=అజమహారాజు, తథేతి=అట్లనే కానియని, సోమోద్భవాయాః-సోమ=చంద్రునివలన, ఉద్భవాయాః=ఉత్పత్తిగలిగిన, సరితః=నర్మదానదియొక్క, పవిత్రం=పరిశుద్ధమైన, పయః=ఉదకమును, ఉపస్పృశ్య=ఆచమనము చేసి, ఉదఙ్ముఖస్సన్=ఉత్తరాభిముఖుఁడైనవాఁడగుచు, నిగృహీతశాపాత్-నిగృహీత=పోఁగొట్టఁబడిన, శాపాత్=శాపముకలిగిన, తస్మాత్=అప్రియంవదునివలన, అస్త్రమంత్రం-అస్త్ర=సమ్మోహనాస్త్రముయొక్క, మంత్రం=మంత్రమును, జగ్రాహ=గ్రహించెను.

ఆకాంక్ష.—జగ్రాహ=గ్రహించెను. కః=ఎవఁడు? సః=అజమహారాజు. కం=దేనిని? అస్త్రమంత్రం=సమ్మోహనాస్త్రముయొక్కమంత్రమును(సకర్మ...ము) కస్మాత్=ఎవనివలన? తస్మాత్=అప్రియంవదునివలన. తస్మాత్ కథంభూతాత్=అప్రియంవదుఁడెట్టివాఁడు? నిగృహీతశాపాత్=పోఁగొట్టఁబడినశాపముగలవాఁడు. కథంభూతస్సన్=ఎట్టివాడగుచు? ఉదఙ్ముఖస్సన్=ఉత్తరాభిముఖుఁడైనవాఁడగుచు. కిం కృత్వా=ఏమిచేసి? ఉపస్పృశ్య=ఆచమనముచేసి. కిం=దేనిని? పయః=ఉదకమును. పయః కథంభూతం=ఉదకమెట్టిది? పవిత్రం=పరిశుద్ధమైనది. కస్యాః=దేనియొక్క? సరితః=నర్మదానదియొక్క. సరితః కథంభూతాయాః=నర్మదానది యెట్టిది? సోమోద్భవాయాః=చంద్రునివలన ఉత్పత్తి గలిగినది. కిమితి=ఏమని? తథేతి=అటులనే కానియని. సః కథంభూతః=అజమహారాజెట్టివాఁడు? అస్త్రవిత్=అస్త్రజ్ఞుఁడైనవాఁడు. పునః కథంభూతః=ఇంకయు నెట్టివాఁడు? నృసోమః=పురుషశ్రేష్ఠుఁడైనవాఁడు.

శబ్దరూపసమాసములు.—తథా-అవ్య. ఇతి-అవ్య. ఉపస్పృశ్య-ల్యబంతమవ్య. పయః-పయః, పయసీ, పయాంసి. పయశ్శబ్దః స, న, ద్వి, ఏ. పవిత్రం - పవిత్రం, పవిత్రే, పవిత్రాణి. పవిత్రశబ్దః అ, న, ద్వి, ఏ. సోమోద్భవాయాః-సోమాత్ ఉద్భవః యస్యాస్సా సోమోద్భవా, తస్యాః సోమోద్భవాయాః; ఉద్భవాయాః, ఉద్భవయోః, ఉద్భవానాం. సోమోద్భవాశబ్దః ఆ, స్త్రీ, ష, ఏ. సరితః-సరితః, సరితోః, సరితాం. సరిచ్ఛబ్దః త, స్త్రీ, ష, ఏ. నృసోమః-నా సోమ ఇవ నృసోమః; సోమః, సోమౌ, సోమాః. నృసోమశబ్దః అ, పు, ప్ర, ఏ. ఉదఙ్ముఖః-ఉదక్ ముఖం యస్య సః ఉదఙ్ముఖః; ఉదఙ్ముఖః, ఉదఙ్ముఖౌ, ఉదఙ్ముఖాః. ఉదఙ్ముఖశబ్దః అ, పు, ప్ర, ఏ. సః-సః, తౌ, తే. తచ్ఛబ్దః ద, పు, ప్ర, ఏ. అస్త్రవిత్-అస్త్రం వేత్తీతి అస్త్రవిత్; విత్, విదౌ, విదః. అస్త్రవిచ్ఛబ్దః ద, పు, ప్ర, ఏ. అస్త్రమంత్రం-అస్త్రస్యమంత్రః అస్త్రమంత్రః, తం అస్త్రమంత్రం; మంత్రం, మంత్రౌ, మంత్రాన్. అస్త్రమంత్రశబ్దః అ, పు, ద్వి, ఏ. జగ్రాహ-జగ్రాహ, జగృహతుః, జగృహుః. 'గ్రహ ఉపాదానే' ఇత్యస్మాద్ధాతోస్సకర్మకాత్కర్తరి భూతేలిట్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాన్తః. తస్మాత్-తస్మాత్, తాభ్యాం,

తేభ్యః. తచ్ఛబ్దః ద,పు, పం, ఏ. నిగృహీతశాపాత్-నిగృహీతః శాపః యస్య సః నిగృహీతశాపః, తస్మాత్ నిగృహీతశాపాత్; శాపాత్, శాపాభ్యాం, శాపేభ్యః. నిగృహీతశాపశబ్దః అ, పు, పం, ఏ.

వ్యాఖ్యా.—తథేతి. నా సోమ శ్చంద్ర ఇవ నృసోమః, 'సోమ ఓషధిచంద్రయో'రితి శాశ్వతః. పురుషశ్రేష్ఠ ఇత్యర్థః. ఉపమితసమాసః. అస్త్రవిత్ అస్త్రజ్ఞః, సః అజః, తథేతి,సోమాత్ ఉద్భవో యస్యా స్తస్యాః సోమోద్భవాయాః సరితః నర్మదాయాః, 'రేవా తు నర్మదా సోమోద్భవా మేఖలకన్యకే' త్యమరః.పవిత్రం పయః ఉపస్పృశ్య పీత్వా,ఆచమ్యేత్యర్థః. ఉదఙ్ముఖస్సన్, నిగృహీతశాపాత్ నివర్తితశాపాత్, ఉపకృతా దిత్యర్థః. తస్మాత్ ప్రియంవదాత్, అస్త్రమంత్రం జగ్రాహ.

భావము.—పురుషశ్రేష్ఠుఁడై అస్త్రపరిజ్ఞానము గలఅజమహారాజు అలాగేయని నర్మదానదీజలముతోఆచమనముఁజేసి ఉదఙ్ముఖుఁడై శాపవిముక్తుఁడైన ప్రియంవదునివద్దనుండి సమ్మోహనాస్త్రమును గ్రహించెను.

శ్లో. ఏవం తయో రధ్వని దైవయోగాత్
ఆసేదుషో స్సఖ్య మచింత్యహేతు,
ఏకో యయౌ చైత్రరథప్రదేశాన్
సౌరాజ్యరమ్యా నపరో విదర్భాన్. ౬౦

పదచ్ఛేదము.—ఏవం, తయోః,అధ్వని, దైవయోగాత్, ఆసేదుషోః, సఖ్యం, అచింత్యహేతు, ఏకః, యయౌ, చైత్రరథప్రదేశాన్, సౌరాజ్యరమ్యాన్, అపరః, విదర్భాన్.

అర్థము.—ఏవం=ఈపూర్వోక్తప్రకారముగాను, అధ్వని=మార్గమునందు, దైవయోగాత్=దైవయోగమువలన,అచింత్యహేతు-అచింత్య=ఆలోచింపకూడనియట్టి, హేతు=కారణముకలిగిన, సఖ్యం==స్నేహమును, ఆసేదుషోః=పొందిన,తయోః=ఆప్రియంవదాదులలోపలను, ఏకః=ఒకఁడైన ప్రియంవదుఁడు, చైత్రరథప్రదేశాన్-చైత్రరథ=కుబేరోద్యానవనముయొక్క,ప్రదేశాన్=ప్రదేశములనుగూర్చి,యయౌ=తరలిపోయెను ఆపరః=మఱియొకఁడైనఅజమహారాజు,సౌరాజ్యరమ్యాన్-సౌరాజ్య=సురాజత్వముచేత, రమ్యాన్=మనోహరములైన, విదర్భాన్=విదర్భదేశములనుగూర్చి, యయౌ = తరలిపోయెను

ఆకాంక్ష.—యయౌ=తరలిపోయెను. కః=ఎవఁడు? అపరః=మఱియొకఁడైనఅజమహారాజు కాన్=వేనినిగూర్చి? విదర్భాన్=విదర్భదేశములనుగూర్చి (సకర్మ...ము).

విదర్భాన్ కథంభూ తాన్ =విదర్భ దేశములెట్టివి? సౌ రాజ్యరమ్యాన్ =సురాజత్వముచేతను మనోహరములైనవి.యయౌ=తరలిపోయెను కః=ఎవఁడు?ఏకః=ఒకఁడైనప్రియంవదుఁడు కాన్ =వేనినిగూర్చి ? చైత్రరథప్రదేశాన్ =కుబేరోద్యానములయొక్క ప్రదేశములను గూర్చి (సకర్మ . . . ము). కయోః=ఎవరిలోపలను? తయోః = ఆప్రియంవదాదులలోపలను. తయోఃకథంభూతయోః=అప్రియంవదాదులెటువంటివారు? ప్రాప్తవతోః=పొందినవారు. కిం=దేనిని? సఖ్యం=స్నేహమును. సఖ్యం కథంభూతం = స్నేహమెట్టిది? అచింత్య హేతుః=ఆలోచింపఁగూడని కారణముగ గలిగినది. కస్మాత్ =దేనివలన? దైవయోగాత్ = దైవవశమువలన. కస్మిన్ =దేనియందు? అధ్వని=మార్గమునందు. కథం=ఎట్లుగా?ఏవం=ఈ పూర్వోక్తప్రకారముగ.

శబ్దరూపసమాసములు.—ఏవం-అవ్య. తయోః-తస్య, తయోః, తేషాం తచ్ఛబ్దః ద, పు, ష, ద్వి. అధ్వని - అధ్వని, అధ్వనోః, అధ్వసు. అధ్వన్ శబ్దః న. పు, స, ఏ. దైవయోగాత్-దైవస్య యోగః దైవయోగః, తస్మాత్ దైవయోగాత్; యోగాత్, యోగాభ్యాం, యోగేభ్యః. దైవయోగశబ్దః అ, పు, పం, ఏ. ఆసేదుషోః - ఆసేదుషః, ఆసేదుషోః, ఆసేదుషాం. ఆసేదివచ్ఛబ్దః స, పు, ష, ద్వి. సఖ్యం - సఖ్యుః భావః సఖ్యం, తత్ సఖ్యం; సఖ్యం, సఖ్యే, సఖ్యాని. సఖ్యశబ్దః అ, న, ద్వి, ఏ. అచింతయిత్వా - క్త్వాంత మవ్య. ఏకః-ఏకః, ఏక, ఏకం, ఏకేన, ఏకస్మై, ఏకస్మాత్, ఏకస్య, ఏకస్మిన్. ఏకశబ్దః అ, పు, నిత్యమేకవచనే ప్ర, ఏ. యయౌ-యయౌ, యయతుః, యయుః. 'యా ప్రాపణ' ఇత్యస్మాద్ధాతోః స్సకర్మకాత్కర్తరి భూతే లిట్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః. చైత్రరథప్రదేశాన్ -చైత్రరథస్య ప్రదేశాః చైత్రరథప్రదేశాః, తాన్ చైత్రరథప్రదేశాన్; ప్రదేశం, ప్రదేశౌ, ప్రదేశాన్. చైత్రరథప్రదేశశబ్దః అ, పు, ద్వి, బ. సౌరాజ్యరమ్యాన్-శోభనః రాజా యస్యసః సురాజా, సురాజ్ఞః భావః సౌరాజ్యం, సౌరాజ్యేనరమ్యా సౌరాజ్యరమ్యాః, తాన్ సౌరాజ్యరమ్యాన్; రమ్యం,రమ్యౌ, రమ్యాన్. సౌరాజ్యరమ్యశబ్దః అ, పు, ద్వి, బ. అపరః-అపరః, అపరౌ, అపరే, అపరాః. అపరశబ్దః అ, పు, ప్ర, ఏ.విదర్భాన్-విదర్భం, విదర్భౌ, విదర్భాన్. విదర్భశబ్దః అ, పు, ద్వి, బ.

వ్యాఖ్యా.—ఏవమితి. ఏవం అధ్వని మార్గే, దైవయోగాత్ దైవవశాత్, అచింత్యహేతు అనిర్ధార్యహేతుకం, సఖ్యం సఖిత్వం, 'సఖ్యుర్య' ఇతి యప్రత్యయః. ఆసేదుషః ప్రాప్తవతోః స్తయోః ర్మధ్యే, ఏకో గంధర్వః, చైత్రరథస్య కుబేరోద్యానస్య, ప్రదేశాన్, 'అస్యోద్యానం చైత్రరథ' మిత్యమరః. అపరః అజః, సౌరాజ్యేన సురాజన్వత్తయా రమ్యాన్, విదర్భాన్, విదర్భదేశాన్, యయౌ.

భావము.—ఈప్రకారము మార్గములో దైవసంకల్పమువలనఁ దలఁపనిమైత్రిని బొందిన ఆయిద్దఱిలో గంధర్వుఁడు కుబేరోద్యానవనమునకును, అజమహారాజు మంచి రాజు గలిగినవిదర్భదేశమునకును తరలిరి.

శ్లో. తం తస్థివాంసం నగరోపకంఠే
తదాగమారూఢగురుప్రహర్షః,
ప్రత్యుజ్జగామ క్రథకైశికేంద్రః
చంద్రం ప్రవృద్ధోర్మి రివోర్మిమాలీ. ౬౧

పదచ్ఛేదము.—తం, తస్థివాంసం, నగరోపకంఠే, తదాగమారూఢగురుప్రహర్షః, ప్రత్యుజ్జగామ, క్రథకైశికేంద్రః, చంద్రం, ప్రవృద్ధోర్మిః, ఇవ, ఊర్మిమాలీ.

అర్థము.—నగరోపకంఠే-నగర=పట్టణముయొక్క, ఉపకంఠే=సమీపమునందు, తస్థివాంసం=ఉండునట్టి, తం=ఆఅజమహారాజును, తదాగమారూఢగురుప్రహర్షః-తత్= ఆ అజమహారాజుయొక్క, ఆగమ=వచ్చుటచేతను, ఆరూఢ=పుట్టిన,గురు=అధికమయిన, ప్రహర్షః=సంతోషముకలిగిన, క్రథకైశికేంద్రః=విదర్భదేశాధీశ్వరుఁడు, ప్రవృద్ధోర్మిః-ప్రవృద్ధ=వృద్ధినొందిన, ఊర్మి=తరంగములుంగలిగిన, ఊర్మిమాలీ=సముద్రుఁడు, చంద్రమివ=చంద్రునివలె, ప్రత్యుజ్జగామ=ఎదురుకొనెను.

అన్వయము.—ప్రత్యుజ్జగామ=ఎదురుకొనెను. కః=ఎవఁడు? క్రథకైశికేంద్రః= విదర్భదేశాధీశ్వరుఁడు కం=ఎవనిని? తం=ఆ అజమహారాజును (సకర్మ...ము). కమివ= ఎవనివలె? చంద్రమివ=చంద్రునివలె. కః=ఎవఁడు?ఊర్మిమాలీ=సముద్రుఁడు.ఊర్మిమాలీ కథంభూతః=సముద్రుఁడెట్టివాఁడు? ప్రవృద్ధోర్మిః = వృద్ధినొందినతరంగములుగలవాఁడు. క్రథకైశికేంద్రఃకథంభూతః = విదర్భదేశాధీశ్వరుఁడెట్టివాఁడు? తదాగమారూఢగురుప్రహర్షః=ఆ అజమహారాజుయొక్కవచ్చుటచేతపుట్టిన అధికమైనసంతోషముగలవాఁడు. తంకథంభూతం=ఆ అజమహారాజెట్టివాఁడు? తస్థివాంసం=ఉండెడివాఁడు. కస్మిన్= ఎందు? నగరోపకంఠే=పత్తనముయొక్క సమీపమునందు.

శబ్దరూపసమాసములు.—తం-తం, తౌ, తాన్. తచ్ఛబ్దః ద, పు,ద్వి, ఏ. తస్థివాంసం-తస్థివాంసం, తస్థివాంసౌ, తస్థుషః. తస్థివచ్ఛబ్దః స,పు, ద్వి,ఏ.నగరోపకంఠే-ఉపకంఠే, ఉపకంఠయోః, ఉపకంఠేషు. నగరోపకంఠశబ్దః అ, పు, స, ఏ. తదాగమారూఢగురుప్రహర్షః - తస్య ఆగమః తదాగమః, తదాగమేన ఆరూఢః తదాగమారూఢః; గురుశ్చాసౌ ప్రహర్షశ్చ గురుప్రహర్షః, తదాగమారూఢః గురుప్రహర్షః యస్య సః తదా...హర్షః; ప్రహర్షః, ప్రహర్షౌ, ప్రహర్షాః. తదాగమారూఢగురుప్రహర్ష

శబ్దః అ, పు, ప్ర, ఏ. ప్రత్యుజ్జగామ-ప్రత్యుజ్జగామ, ప్రత్యుజ్జగ్మతుః, ప్రత్యుజ్జగ్ముః. ప్రతి పూర్వకాత్ 'గమ్లృగతౌ' విత్యస్మాద్ధాతోస్సకర్మకాత్కర్తరిభూతేలిట్ పరస్మైపదే ప్రథమ పురుషైకవచనాన్తః. క్రథకైశికేంద్రః-క్రథకైశికానాం ఇంద్రః క్రథకైశికేంద్రః; ఇంద్రః, ఇంద్రౌ, ఇంద్రాః. క్రథకైశికేంద్రశబ్దః అ, పు, ప్ర, ఏ. చంద్రం - చంద్రం, చంద్రౌ, చంద్రాన్. చంద్రశబ్దః అ,పు, ద్వి, ఏ. ప్రవృద్ధోర్మిః-ప్రవృద్ధాః ఊర్మయో యస్య సః ప్రవృద్ధోర్మిః; ఊర్మిః, ఊర్మీ, ఊర్మయః. ప్రవృద్ధోర్మిశబ్దః ఇ, పు, ప్ర, ఏ.ఇవ-అవ్య.ఊర్మిమాలీ-ఊర్మీణాం మాలా ఊర్మిమాలా, ఊర్మిమాలా అస్యాస్తీతి ఊర్మి మాలీ; మాలీ, మాలినౌ, మాలినః. ఊర్మిమాలిన్ శబ్దః న, పు, ప్ర, ఏ.

వ్యాఖ్యా — తమితి. నగరస్య ఉపకంఠే, తస్థివాంసం స్థితం, తం అజం, తస్య అజస్య ఆగమేన ఆరూఢః ఉత్పన్నః గురుః ప్రహర్షః యస్య సః, క్రథకైశికేంద్రః విదర్భరాజః, ప్రవృద్ధోర్మిః ఊర్మిమాలీ, సముద్రః, చంద్రమివ, ప్రత్యుజ్జగామ.

భావము — విదర్భరాజు తనపట్టణసమీపమునకు నజమహారాజు వచ్చినసంగతి విని సంతోషముచేత నుప్పొంగినసముద్రుఁడు చంద్రునిఁ బోలె నజమహారాజు నెదు ర్కొనెను.

శ్లో. ప్రవేశ్య చైనం పుర మగ్రయాయీ
నీచై స్తథోపాచరదర్పితశ్రీః,
మేనే యథా తత్ర జన స్సమేతః
వైదర్భ మాగంతు మజం గృహేశమ్. ౬౨

పదచ్ఛేదము — ప్రవేశ్యచ, ఏనం, పురం, అగ్రయాయీ, నీచైః, తథా,ఉపా చరత్, అర్పితశ్రీః, మేనే, యథా, తత్ర, జనః, సమేతః, వైదర్భం,ఆగంతుం,అజం, గృహేశం

అర్థము.— అగ్రయాయీ=ముందుపోవుచుండెడి, నీచైః=నమ్రుఁడయిన,సః=ఆభో జరాజు,ఏనం=ఈఅజమహారాజును, పురం=పట్టణమును, ప్రవేశ్య=ప్రవేశింపఁజేసి,అర్పిత శ్రీస్సన్-అర్పిత=సమర్పణచేయఁబడిన, శ్రీస్సన్=సంపత్తుకలిగినవాఁడగుచు, తథా=ఆ ప్రకారముగ, ఉపాచరత్=ఉపచరించెను. యథా=ఏప్రకారముగ, తత్ర=ఆపత్తనము నందు,సమేతః=గుంపుగూడిన, జనః=జనము,వైదర్భం=భోజరాజును,ఆగంతుం=అతిథినిగ, మేనే=ఎంచెనో, అజం=అజమహారాజును, గృహేశం=గృహపతినిగ, మేనే=ఎంచెనో.

ఆకాంక్ష.— మేనే=ఎంచెనో.కః=ఏది?జనః=జనము. కం=ఎవనిని? అజం=అజమహా రాజును (సకర్మ.. ము). కథంభూతం=ఎట్టివానినిగ? గృహేశం=గృహపతినిగ. మేనే=

ఎంచెనో. కః=ఏది? జనః=జనము. కం=ఎవనిని? వైదర్భం=భోజరాజును (సకర్మ...ము). కథంభూతం=ఎట్టివానిని? ఆగంతుం=అతిథినిగ. జనఃకథంభూతః=జనమెట్టిది? సమేతః= గుంపుకూడినది. కుత్ర=ఎక్కడ? తత్ర=ఆపట్టణమందు. కథం=ఎట్లుగ? యథా=ఏప్రకారముగ. ఉపాచరత్ = ఉపచరించెను. కః=ఎవఁడు? సః=ఆభోజరాజు. కం = ఎవనిని? ఏనం=ఈఅజమహారాజును(సకర్మ..ము). కథం=ఎట్లు? తథా=ఆప్రకారముగ. కథంభూతస్సన్=ఎట్టివాఁడగుచు? అర్పితశ్రీస్సన్=సమర్పణముచేయఁబడినసంపత్తుకలవాఁడగుచు కింకృత్వా=ఏమిచేసి? ప్రవేశ్య=ప్రవేశింపఁజేసి. కిం=దేనిని? పురం=పట్టణమును. సకథంభూతః=భోజరాజెట్టివాఁడు? నీచైః=నమ్రుఁడయినవాఁడు. పునఃకథంభూతః=ఇంకయు నెట్టివాఁడు? అగ్రయాయీ=ముందఱపోవుచుండెడివాఁడు.

శబ్దరూపసమాసములు.—ప్రవేశ్య-ల్యబంతమవ్య. చ-అవ్య. ఏనం-ఏనం, ఏనౌ, ఏనాన్. ఇదంశబ్దః మ, పు, ద్వి, ఏ. పురం-పురం, పురే, పురాణి. పురశబ్దః అ, న, ద్వి, ఏ. అగ్రయాయీ-అగ్రే యాతీ త్యగ్రయాయీ, యాయీ, యాయినౌ, యాయినః. అగ్రయాయిన్ శబ్దః న, పు, ప్ర, ఏ. నీచైః-అవ్య. తథా-అవ్య. ఉపాచరత్-ఉపాచరత్, ఉపాచరతాం, ఉపాచరన్. ఉపపూర్వకాత్ 'చరగతిభక్షణయో'రిత్యస్మాద్ధాతో స్సకర్మకాత్కర్తరి భూతే లఙ్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః. అర్పితశ్రీః- అర్పితా శ్రీ ర్యేన సః అర్పితశ్రీః; శ్రీః, శ్రియౌ, శ్రియః. అర్పితశ్రీశబ్దః ఈ, పు, ప్ర, ఏ. మేనే-మేనే, మేనాతే, మేనిరే. 'మన అవబోధనే' ఇత్యస్మాద్ధాతో స్సకర్మకాత్కర్తరిభూతేలిట్ ఆత్మనేపదే ప్రథమపురుషైకవచనాంతః. యథా-అవ్య. తత్ర-త్రలంతమవ్య. జనః-జనః, జనౌ, జనాః. జనశబ్దః అ, పు, ప్ర, ఏ. సమేతః-సమేతః, సమేతౌ, సమేతాః. సమేతశబ్దః అ, పు, ప్ర, ఏ. వైదర్భం-విదర్భాణాంరాజావైదర్భః, తం వైదర్భం; వైదర్భం, వైదర్భౌ, విదర్భాన్. వైదర్భశబ్దః అ, పు, ద్వి, ఏ. ఆగంతుం-ఆగంతుం, ఆగంతూ, ఆగంతూన్. ఆగంతుశబ్దః ఉ, పు, ద్వి, ఏ. అజం-అజం, అజౌ, అజాన్. అజశబ్దః అ, పు, ద్వి, ఏ. గృహేశం - గృహస్య ఈశః గృహేశః, తం గృహేశం; గృహేశం, గృహేశౌ, గృహేశాన్. గృహేశశబ్దః అ, పు, ద్వి, ఏ.

వ్యాఖ్యా.—ప్రవేశ్యేతి. సః భోజః, ఏవం అజం, అగ్రయాయీ, సేవాధర్మేణ పురో గచ్ఛ న్నిత్యర్థః. నీచైః నమ్రః, పురం ప్రవేశ్య ప్రవేశం కారయిత్వా, ప్రీత్యా అర్పితా శ్రీ ర్యేన స తథోక్తస్సన్, తథా తేన ప్రకారేణ, ఉపాచరత్ ఉపచరితవాన్. యథా యేనప్రకారేణ, తత్ర పురే సమేతః మిళితః, జనః, వైదర్భం భోజం, ఆగంతుం ప్రాఘుణికం, అతిథి మిత్యర్థః. 'స్యా దావేశిక ఆగంతు రతిథి ర్నా గృహాగత' ఇత్యమరః. మేనే, అజం గృహేశం గృహాధిపతిం, మేనే.

భావము.—విదర్భరాజగు భోజమహారాజునకు ముందుగా మర్యాదతోఁ బోవుచు నాయనను బట్టణములోనికిం బిలిచికొనిపోయి సకలసంపదలనొసంగి జనులెల్ల గుంపులుగాఁ గూడి భోజరాజుఁ బ్రొత్తవానిఁగను అజమహారాజు నింటివానిఁగను దలఁచునట్లు మర్యాదల నొనర్చెను.

శ్లో. తస్యాధికారపురుషైః ప్రణతైః ప్రదిష్టాం
ప్రాగ్ద్వారవేదివినివేశితపూర్ణకుంభామ్,
రమ్యాం రఘుప్రతినిధి స్స నవోపకార్యాం
బాల్యాత్పరా మివ దశాం మదనో ఒధ్యువాస. ౬3

పదచ్ఛేదము.—తస్య, అధికారపురుషైః, ప్రణతైః, ప్రదిష్టాం, ప్రాగ్ద్వార వేది వినివేశిత పూర్ణ కుంభాం, రమ్యాం, రఘుప్రతినిధిః, సః, నవోపకార్యాం, బాల్యాత్, పరాం, ఇవ, దశాం, మదనః, అధ్యువాస.

అర్థము—రఘుప్రతినిధిః-రఘు=రఘుమహారాజే, ప్రతినిధిః=ఉపమానముగఁగలిగిన, సః=ఆ అజమహారాజు, ప్రణతైః=నమస్కరించిన, తస్య=ఆ భోజరాజుయొక్క, అధికారపురుషైః = అధికారపురుషులచేతను. ప్రదిష్టాం=చూపింపఁబడిన, ప్రాగ్ద్వార వేది వినివేశితపూర్ణకుంభాం - ప్రాగ్ద్వార=పూర్వద్వారముయొక్క, వేది=వేదికయందు, వినివేశిత=ఉంచఁబడిన, పూర్ణ = రత్నాదిపూరితమైన, కుంభాం = కలశముకలిగిన, రమ్యాం=మనోహరమైన, నవోపకార్యాం-నవ=నూతనమైన, ఉపకార్యాం=రాజభవనమును, మదనః=మన్మథుఁడు, బాల్యాత్=బాల్యమునకంటె, పరాం=అనంతరకాలవృత్తియైన, దశామివ=యౌవనావస్థనువలె, అధ్యువాస=అధిష్ఠించెను.

ఆకాంక్ష.—అధ్యువాస=అధిష్ఠించెను. కః = ఎవఁడు? సః=ఆ అజమహారాజు. కాం=దేనిని? నవోపకార్యాం=నూతనమైనరాజభవనమును (సకర్మ...ము). కామివ=దేనివలె? దశామివ=యౌవనావస్థనువలె. దశాంకథంభూతాం=యౌవనావస్థఎట్టిది? పరాం=అనంతరకాలవృత్తియైనది. కస్మాత్=దేనికంటె? బాల్యాత్=బాల్యమునకంటె. కః=ఎవఁడు? మదనః=మన్మథుఁడు నవోపకార్యాంకథంభూతాం=నూతనమైనరాజభవనమెట్టిది? రమ్యాం=మనోహరమైనది. పునఃకథంభూతాం=ఇంకయు నెట్టిది? ప్రాగ్ద్వార వేదివినివేశితపూర్ణకుంభాం-ప్రాగ్ద్వార=పూర్వద్వారముయొక్క, వేది=వేదికయందు, వినివేశిత=ఉంచఁబడిన, పూర్ణ=రత్నాదిపూరితమైన, కుంభాం=కలశములుంగలిగినది. పునఃకథంభూతాం=ఇంకయు నెట్టిది? ప్రదిష్టాం=చూపింపఁబడినది. కైః=ఎవరిచేతను? అధికారపురుషైః=అధికారపురుషులచేతను. కస్య=ఎవనియొక్క? తస్య=ఆ భోజరాజుయొక్క. అధి,

కారపురుషైః కథంభూతైః=అధికారపురుషు లెటువంటివారు? ప్రణతైః=నమస్కరించి నవారు. సకథంభూతః=ఆ అజమహారాజెట్టివాఁడు? రఘుప్రతినిధిః=రఘుమహారాజే ఉపమానముగాఁ గలవాఁడు.

శబ్దరూపసమాసములు.—తస్య-తస్య, తయోః, తేషాం. తచ్ఛబ్దః ద, పు, ష, ఏ. అధికారపురుషైః అధికారస్య పురుషాః అధికారపురుషాః, తైఃఅధికారపురుషైః; పురుషేణ, పురుషాభ్యాం, పురుషైః. అధికారపురుషశబ్దః అ, పు, తృ, బ. ప్రణతేన-ప్రణతేన, ప్రణతాభ్యాం, ప్రణతైః. ప్రణతశబ్దః అ, పు, తృ, ఏ. ప్రదిష్టాం-ప్రదిష్టాం, ప్రదిష్టే, ప్రదిష్టాః. ప్రదిష్టాశబ్దః ఆ, స్త్రీ, ద్వి, ఏ. ప్రాగ్ద్వారవేదివినివేశితపూర్ణకుంభాం-ప్రాక్ ద్వారం ప్రాగ్ద్వారం,ప్రాగ్ద్వారస్య వేదిః ప్రాగ్ద్వారవేదిః, ప్రాగ్ద్వారవేదౌ వినివేశితః ప్రాగ్ద్వారవేదివినివేశితః, పూర్ణశ్చాసౌకుంభశ్చ పూర్ణకుంభః- ప్రాగ్ద్వార... వినివేశితః, పూర్ణకుంభః యస్యాస్సా ప్రాగ్ద్వార..కుంభా, తాం ప్రాగ్ద్వా...కుంభాం; కుంభాం, కుంభే,కుంభాః. ప్రాగ్ద్వార...కుంభాశబ్దః ఆ, స్త్రీ, ద్వి,ఏ. రమ్యాం-రమ్యాం, రమ్యే, రమ్యాః. రమ్యాశబ్దః ఆ, స్త్రీ, ద్వి, ఏ. రఘుః ప్రతినిధిర్యస్యసః రఘుప్రతినిధిః; ప్రతినిధిః, ప్రతినిధీ, ప్రతినిధయః. రఘుప్రతినిధిశబ్దః ఇ, పు, ప్ర, ఏ. సః-సః, తౌ, తే. తచ్ఛబ్దః ద, పు, ప్ర, ఏ. నవోపకార్యాం-నవాచ సా ఉపకార్యాచ నవోపకార్యా, తాం నవోపకార్యాం; ఉపకార్యాం, ఉపకార్యే, ఉపకార్యాః. నవోపకార్యాశబ్దః ఆ, స్త్రీ, ద్వి,ఏ. బాల్యాత్-బాలస్యభావః బాల్యం, తస్మాత్ బాల్యాత్; బాల్యాత్, బాల్యాభ్యాం,బాల్యేభ్యః. బాల్యశబ్దః అ, న, పం, ఏ. పరాం-పరాం, పరే, పరాః. పరాశబ్దః ఆ, స్త్రీ, ద్వి, ఏ. ఇవ-అవ్య. దశాం-దశాం, దశే, దశాః. దశాశబ్దః ఆ, స్త్రీ, ద్వి, ఏ. మదనః - మదనః, మదనౌ, మదనాః. మదనశబ్దః అ, పు, ప్ర, ఏ. అధ్యువాస - అధ్యువాస, అధ్యూషతుః, అధ్యూషుః. అధి పూర్వకాత్ 'వసనివాస' ఇత్యస్మాద్ధాతోః సకర్మకాత్కర్తరి భూతే లిట్ పరస్మైపదే ప్రథమ పురుషైకవచనాంతః.

వ్యాఖ్యా.—స్యేతి. రఘుప్రతినిధిః రఘుకల్పః, రఘుతుల్య ఇత్యర్థః. ఉక్తంచ దండినా, - సాదృశ్యవాచకప్రస్తావే 'కల్పదేశీయదేశ్యాదిప్రఖ్యప్రతినిధీ అపీ' తి. సఅజః, ప్రణతైః నమస్కృతవద్భిః, కర్తరిక్తః. తస్య భోజస్య, అధికారః నియోగః, తస్య పురుషైః అధికృతై రిత్యర్థః. ప్రదిష్టాం నిర్దిష్టాం, ప్రాగ్ద్వారస్య వేద్యాం వినివేశితః ప్రతిష్ఠాపితః పూర్ణకుంభో యస్యాస్తాం, స్థాపితమంగళకలశామిత్యర్థః.రమ్యాం రమణీయాం నవోపకార్యాం నూతనరాజభవనం, 'ఉపకార్యా రాజసద్మన్యుపచారోచితే ఒన్యవ' దితి విశ్వః. మదనః మన్మథః బాల్యాపత్పరాం శైశవానంతరాం, దశాం, యౌవన మివేత్యర్థః. అధ్యువాసఅధిష్ఠితవాన్, 'ఉపాన్వధ్యాఙ్వస' ఇతి కర్మత్వం.

భావము.—రఘుమహారాజుం బోలియజమహారాజు, భోజరాజుభటులు నమస్కరించి నివేదింపఁగాఁ దూర్పుద్వారమున రత్నఖచితములగు సువర్ణమంగళకలశములచే నిండియుండు క్రొత్తవిడిదియింటిలో మన్మథుఁడు యౌవనంబుం బోలె ప్రవేశించెను.

శ్లో. తత్ర స్వయంవరసమాహృతరాజలోకం
కన్యాలలామ కమనీయ మజస్య లిప్సోః,
భావావబోధకలుషా దయితేవ రాత్రౌ
నిద్రా చిరేణ నయనాభిముఖీ బభూవ. ౬౮

పదచ్ఛేదము.—తత్ర, స్వయంవరసమాహృతరాజలోకం, కన్యాలలామకమనీయం, అజస్య, లిప్సోః, భావావబోధకలుషా, దయితా, ఇవ, రాత్రౌ, నిద్రా, చిరేణ, నయనాభిముఖీ, బభూవ.

అర్థము.—తత్ర=ఆరాజభవనమందు, స్వయంవరసమాహృతరాజలోకం-స్వయంవర=స్వయంవరనిమిత్తముగ, సమాహృత=పిలిపింపఁబడిన, రాజలోకం=రాజజనముకలిగిన, కమనీయం=కోరతగిన, కన్యాలలామ=కన్యాశ్రేష్ఠమును, లిప్సోః=పొందుటకు ఇచ్ఛయించిన, అజస్య=అజమహారాజునకు, భావావబోధకలుషా-భావ=పురుషాభిప్రాయము యొక్క, అవబోధ=తెలిసికొనుటయందు, కలుషా=అసమర్థురాలయిన, దయితేవ=ప్రియురాలువలె, రాత్రౌ=రాత్రియందు, నిద్రా=నిద్ర, చిరేణ=బహుకాలము చేత, నయనాభిముఖీ-నయన=నేత్రములకు, అభిముఖీ=అభిముఖమయినది, బభూవ=ఆయెను.

ఆకాంక్ష.—బభూవ=ఆయెను. కా=ఏది? నిద్రా=నిద్ర (ఆకర్త...ము). కథంభూతా=ఎట్టిది? నయనాభిముఖీ=నేత్రములకు అభిముఖమయినది. కథం=ఎట్లు? చిరేణ=బహుకాలముచేత. కస్యాం=దేనియందు? రాత్రౌ=రాత్రియందు. కేన=ఎవ తెవలె? దయితేవ=ప్రియురాలివలె. దయితాకథంభూతా=ప్రియురాలెట్టిది? భావావబోధకలుషా=పురుషాభిప్రాయముయొక్క తెలిసికొనుటయందు అసమర్థురాలయినది. కస్య=ఎవనికి? అజస్య=అజమహారాజునకు, అజస్యకథంభూతస్య=అజమహారాజెట్టివాఁడు? లిప్సోః=పొందుటకు ఇచ్ఛయించినవాఁడు. కిం=దేనిని? కన్యాలలామ=కన్యాశ్రేష్ఠమును. కన్యాలలామ కథంభూతం=కన్యాశ్రేష్ఠమెట్టిది? కమనీయం=కోరతగినది. పునఃకథంభూతం=ఇంకయు నెట్టిది? స్వయంవరసమాహృత రాజలోకం=స్వయంవరార్థముగ పిలుపింపఁబడిన రాజజనముకలిగినది. కుత్ర=ఎక్కడ? తత్ర=ఆరాజభవనమునందు.

శబ్దరూపసమాసములు.—తత్ర - త్రలంతమవ్యయ. స్వయంవరసమాహృతరాజలోకం-స్వయంవరాయ సమాహృతః స్వయంవరసమాహృతః, రాజ్ఞాం లోకో రాజలోకః, స్వయంవరసమాహృతః రాజలోకో యేన తత్ స్వయం...లోకం, తత్ స్వయంవ...లోకం; లోకం, లోకే, లోకాని. స్వయం...లోకశబ్దః అ, న, ద్వి,

ఏ. కన్యాలలామ-కన్యానాం లలామ కన్యాలలామ, తత్ కన్యాలలామ; లలామ, లలామ్నీ, లలామనీ, లలామాని. కన్యాలలామన్‌శబ్దః న, న, ద్వి, ఏ. కమనీయం-కామయితుం యోగ్యం కమనీయం, తత్ కమనీయం; కమనీయం, కమనీయే, కమనీయాని. కమనీయశబ్దః అ, న, ద్వి, ఏ. అజస్య-అజస్య, అజయోః, అజానాం. అజశబ్దః అ, పు, ష, ఏ. లిప్సోః-లబ్ధుమిచ్ఛుః లిప్సుః, తస్య లిప్సోః; లిప్సోః, లిప్స్వోః, లిప్సూనాం. లిప్సుశబ్దః ఉ, పు, ష, ఏ. భావావబోధకలుషా-భావస్య అవబోధః భావావబోధః, భావావబోధే కలుషా భావావబోధకలుషా; కలుషా, కలుషే, కలుషాః. భావావబోధకలుషాశబ్దః ఆ, స్త్రీ, ప్ర, ఏ. దయితా-దయితా, దయితే, దయితాః. దయితాశబ్దః ఆ, స్త్రీ, ప్ర, ఏ. ఇవ-అవ్య. రాత్రౌ-రాత్ర్యాం, రాత్రౌ, రాత్రోర్యోః, రాత్రిషు. రాత్రిశబ్దః ఇ, స్త్రీ, స, ఏ. నిద్రా-నిద్రా, నిద్రే, నిద్రాః. నిద్రాశబ్దః ఆ, స్త్రీ, ప్ర, ఏ. చిరేణ-అవ్య. నయనాభిముఖీ-నయనయోః అభిముఖీ నయనాభిముఖీ; అభిముఖీ, అభిముఖ్యౌ, అభిముఖ్యః. నయనాభిముఖీశబ్దః ఈ, స్త్రీ, ప్ర, ఏ. బభూవ-బభూవ, బభూవతుః, బభూవుః. 'భూ సత్తాయా' మిత్యస్మాద్ధాతో రకర్మకాత్కర్తరి భూతేలిట్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాన్తః.

వ్యాఖ్యా.—తత్రేతి. తత్ర ఉపకార్యాయాం, స్వయంవరనిమిత్తం, సమాహృతః, రాజా లోకో యేన తత్, కమనీయం స్పృహణీయం, కన్యాలలామ కన్యాశ్రేష్ఠం, 'లలామోఽస్త్రీ లలామాఽపి ప్రభావే పురుషే ధ్వజే, శ్రేష్ఠభూషాపుండ్రశృంగపుచ్ఛచిహ్నేశ్వలింగి' ష్వితి యాదవః. లిప్సోః లబ్ధుమిచ్ఛోః, లభేస్సన్నంతాదుప్రత్యయః, అజస్య భావావబోధే పురుషస్య అభిప్రాయపరిజ్ఞానే, కలుషా అసమర్థా, దయితేవ ప్రియతమేవ, రాత్రౌ నిద్రా చిరేణ బహుకాలేన, నయనాభిముఖీ బభూవ. 'రాజానం కామినం చోరం ప్రవిశతి ప్రజాగరా' ఇతివదితిభావః. అభిముఖీశబ్దః జీబంతః చ్వ్యంతో వా.

భావము.—ఆ రాజగృహమందు స్వయంవరార్థ మనేకరాజులు వచ్చియుండుటచేఁ జక్కఁదనముగల యిందుమతి యనుకన్యారత్నము దనకు లభించునో లేదో యను చింతచే నజమహారాజుకన్నులకు నిదుర, పురుషునియభిప్రాయము నెఱుఁగనియువతివలె బహుకాలమునకు దగ్గఱించెను.

శ్లో. తం కర్ణభూషణనిపీడితపీవరాంసం
శయ్యోత్తరచ్ఛదవిమర్దకృశాంగరాగమ్,
సూతాత్మజా స్సవయసః ప్రథితప్రబోధం
ప్రాబోధయ న్నుషసి వాగ్భి రుదారవాచః. ౬౫

పదచ్ఛేదము.—తం, కర్ణభూషణనిపీడితపీవరాంసం, శయ్యోత్తరచ్ఛదవిమర్దకృశాంగరాగం, సూతాత్మజాః, సవయసః, ప్రథితప్రబోధం, ప్రాబోధయన్, ఉషసి, వాగ్భిః, ఉదారవాచః,

అర్థము.— కర్ణభూషణనిపీడితపీవరాంసం-కర్ణభూషణ=కర్ణకుండలములచేత, నిపీడిత=ఒరయఁబడిన, పీవర=బలసిన, అంసం=భుజశిరస్సులుగల,శయ్యోత్తరచ్ఛదవిమర్దకృశాంగరాగం-శయ్యా=పాన్పుయొక్క, ఉత్తరచ్ఛద=ఉపరివస్త్రముయొక్క, విమర్ద=సంఘర్షణచేత, కృశ=విరళమయిన, అఙ్గరాగం=అంగలేపనముగలిగిన, ప్రథితప్రబోధం-ప్రథిత=ఉత్కృష్టమయిన, ప్రబోధం=జ్ఞానముగల, తం=ఆ అజమహారాజును, సవయసః=సమానవయస్కులయిన, ఉదారవాచః-ఉదార=ప్రౌఢములయిన,వాచః=వాక్కులుగల, సూతాత్మజాః=వందిపుత్రులు, వాగ్భిః=స్తుతిపాఠములచేత, ఉషసి=ప్రాతఃకాలమునందు, ప్రాబోధయన్=లేపించిరి.

అన్వయము.—ప్రాబోధయన్=లేపించిరి. కే=ఎవరు? సూతాత్మజాః=వందిపుత్రులు. కం=ఎవనిని? తం=అజమహారాజును(సకర్మక...ము) కస్మిన్=దేనియందు?ఉషసి=ప్రాతఃకాలమునందు. కాభిః=వేనిచేత? వాగ్భిః=స్తుతిపాఠములచేత.సూతాత్మజాః కథంభూతాః=వందిపుత్రులెటువంటివారు? ఉదారవాచః=ప్రౌఢములయినవాక్కులుగలవారు. పునః కథంభూతాః=ఇంకయుం నెట్టివారు? సవయసః=సమానవయస్కులయినవారు. తం కథంభూతం=ఆఅజమహారాజెట్టివాఁడు? ప్రథితప్రబోధం=ఉత్కృష్టమయినజ్ఞానముకలవాఁడు.పునఃకథంభూతం=ఇంకయుం నెట్టివాఁడు? శయ్యోత్తరచ్ఛదవిమర్దకృశాంగరాగం=పానుపుయొక్క ఉపరివస్త్రముయొక్క సంఘర్షణచేత విరళమయిన అంగలేపముకలిగినవాఁడు.పునఃకథంభూతం=ఇంకయుం నెట్టివాఁడు? కర్ణభూషణనిపీడితపీవరాంసం=కర్ణకుండలములచేత ఒరయఁబడిన బలసినభుజశిరస్సులుకలవాఁడు.

శబ్దరూపసమాసములు —తం-తం, తౌ, తాన్. తచ్ఛబ్దః ద, పు,ద్వి,ఏ. కర్ణభూషణనిపీడితపీవరాంసం-కర్ణయోః భూషణే కర్ణభూషణే, కర్ణభూషణాభ్యాం నిపీడితౌ కర్ణ..నిపీడితౌ,పీవరౌచతౌ అంసౌచ పీవరాంసౌ, కర్ణ...నిపీడితౌ,పీవరాంసౌ యస్యసః కర్ణ...పీవరాంసః, తం కర్ణ...పీవరాంసం; అంసం, అంసౌ,అంసాన్.కర్ణ...పీవరాంసశబ్దః అ, పు, ద్వి, ఏ. శయ్యోత్తరచ్ఛదవిమర్దకృశాంగరాగం-ఉత్తరం (ఊర్ధ్వశరీరం) ఛాద్యతే అనేనేతి ఉత్తరచ్ఛదః, శయ్యాయాః ఉత్తరచ్ఛదః శయ్యోత్తరచ్ఛదః, శయ్యోత్తరచ్ఛదస్య విమర్దః శయ్యోత్త...మర్దః, శయ్యో...విమర్దేన కృశః శయ్యో...కృశః, అంగం రజ్యతే అనేనేత్యంగరాగః, శయ్యో...కృశః అంగరాగో యస్యసః శయ్యో...రాగః, తం శయ్యో..అంగరాగం; అంగరాగం, అంగరాగౌ, అంగరాగాన్. శయ్యోత్త...అంగరాగశబ్దః అ, పు, ద్వి, ఏ. సూతాత్మజాః - ఆత్మనః జాతాః ఆత్మజాః, సూతస్య ఆత్మజాః సూతాత్మజాః; ఆత్మజః, ఆత్మజౌ, ఆత్మజాః. సూతాత్మజశబ్దః అ, పు, ప్ర, బ. సవయసః - సమానం వయః యేషాంతే సవయసః; సవయాః, సవయసౌ, సవయసః. సవయశ్శబ్దః

స, పు, ప్ర, బ. ప్రథితప్రబోధం-ప్రథితః ప్రబోధో యస్యసః ప్రథితప్రబోధః, తం ప్రథితప్రబోధం; ప్రబోధం, ప్రబోధౌ, ప్రబోధాన్. ప్రథితప్రబోధశబ్దః అ, పు, ద్వి, ఏ. ప్రాబోధయన్-ప్రాబోధయత్, ప్రాబోధయతాం, ప్రాబోధయన్. ప్రపూర్వకాత్ 'బుధఅవగమన' ఇత్యస్మాద్ధాతో ర్ణిజంతా త్సకర్మకాత్కర్తరి భూతే లఙ్ పరస్మైపదే ప్రథమపురుషబహువచనాన్తః. ఉషసి-ఉషసి, ఉషసోః, ఉషస్సు. ఉషశ్శబ్దః స, స, ఏ. వాగ్భిః; వాచా, వాగ్భ్యాం, వాగ్భిః. వాక్ఛబ్దః చ, స్త్రీ, తృ, బ. ఉదారవాచః-ఉదారాః వాచః యేషాంతే ఉదారవాచః; వాక్, వాచౌ, వాచః. ఉదారవాక్శబ్దః చ, పు, ప్ర, బ.

వ్యాఖ్యా.—తమితి. కర్ణభూషణాభ్యాం నిపీడితౌ పీవరౌ పీనౌ అంసౌ భుజశిరసీ యస్య తం, శయ్యాయాః ఉత్తరచ్ఛదస్య ఉపర్యాస్తరణస్య వస్త్రస్య విమర్దేన ఘర్షణేన కృశః విరళః అంగరాగః యస్య తం, నత్వంగనాసంగా దితిభావః. ప్రథితప్రబోధం ప్రకృష్టజ్ఞానం, త మేన మజం, సవయసః సమానవయస్కాః, ఉదారవాచః ప్రగల్భగిరః, సూతాత్మజాః వందిపుత్రాః, వైతాళికా ఇతి వాపాఠః, 'వైతాళికాబోధకరా' ఇత్యమరః. వాగ్భిః స్తుతిపాఠైః, ఉషసి ప్రాతఃకాలే, ప్రాబోధయన్ ప్రబోధయామాసుః.

భావము.—చెవులపోగు లొరియుచున్నట్లు ఎత్తైనభుజములు కలిగినవాఁడును దట్టముగఁ బూసికొనఁబడి స్త్రీసంయోగములేకయే పఱుపుగుడ్డ యొరిసికొని రాలిపోయిన గంధము కలిగినవాఁడును మంచితెలివి కలిగినవాఁడు నగు నజమహారాజును ఆయనతో పాటివయస్సు కలిగి ప్రౌఢవాక్కులు గలవందిపుత్రులు పొగడి తెల్లవారగ లేపిరి.

శ్లో. రాత్రి ర్గతా మతిమతాంవర ముంచ శయ్యాం
ధాత్రా ద్విధైవ నను ధూ ర్జగతో విభక్తా,
తా మేకత స్తవ బిభర్తి గురు ర్వినిద్రః
తస్యా భవా నపరధుర్యపదావలంబీ. ౬౬

పదచ్ఛేదము.—రాత్రిః, గతా, మతిమతాంవర, ముంచ, శయ్యాం, ధాత్రా, ద్విధా, ఏవ, నను, ధూః, జగతః, విభక్తా, తాం, ఏకతః, తవ, బిభర్తి, గురుః, వినిద్రః, తస్యాః, భవాన్, అపరధుర్యపదావలంబీ.

అర్థము.—హేమతిమతాంవర=ఓయి బుద్ధిమంతులలోపల శ్రేష్ఠుఁడవయిన అజమహారాజా! రాత్రిః=రాత్రి, గతా=గడచిపోయెను. శయ్యాం=పానుపును, ముంచ=విడువుము. ధాత్రా=బ్రహ్మచేత, జగతః=జగత్తుయొక్క, ధూః=భారము, ద్విధైవ=రెండు

ప్రకారములుగానే(అనఁగాఇద్దఱియందే),విభక్తానను=విభజింపఁబడినదిగదా. తాం=ఆజగద్భారమును,ఏకతః=ఒకతట్టు,తవ=నీయొక్క,గురుః=తండ్రి,వినిద్రస్సన్=జాగరూకుఁడైనవాఁడగుచు,బిభర్తి=ధరించుచున్నాఁడు. తస్యాః=ఆభారమునకు,భవాన్=నీవు,అపరధుర్యపదావలంబీ-అపర=మఱియొకఁడైన, ధుర్య=భారవాహకునియొక్క, పద=వాహనస్థానమును, అవలంబి=పొందినవాఁడవు.

ఆకాంక్ష.—అపరధుర్యపదావలంబీ=మఱియొకఁడైనభారవాహకునియొక్కవాహస్థానమును పొందినవాఁడవు. కః=ఎవఁడు?భవాన్=నీవు(అకర్మక...ము). కస్యాః=దేనికి? తస్యాః=ఆభారమునకు. బిభర్తి=ధరించుచున్నాఁడు.కః=ఎవఁడు? పితా=తండ్రి. కాం=దేనిని? తాం=ఆజగద్భారమును (సకర్మ...ము). కథంభూతస్సన్=ఎట్టివాఁడగుచు?వినిద్రస్సన్=జాగరూకుఁడైనవాఁడగుచు.కస్య=ఎవనియొక్క?తవ=నీయొక్క. కుత్ర=ఎక్కడ?ఏకతః=ఒకతట్టు,విభక్తానను=విభజించి యుంచఁబడినదిగదా. కేన=ఎవనిచేత? ధాత్రా=బ్రహ్మచేత. కా=ఏది? ధూః=భారము (కర్మణి...ము). కథమేవ=ఎట్లుగానే? ద్విధైవ=రెండుప్రకారములుగానే (అనఁగా ఇద్దఱియందే), కస్య=దేనియొక్క?జగతః=జగత్తుయొక్క, ముంచ=విడువుము. కః=ఎవఁడు? త్వం=నీవు. కాం=దేనిని? శయ్యాం=పానుపును(సకర్మ...ము) గతా=గడచిపోయెను.కా=ఏది? రాత్రిః=రాత్రి(అకర్మ...ము). కస్య సంబుద్ధిః? హేమతిమతాంవర = ఓయి బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడవయిన అజమహారాజా!

శబ్దరూపసమాసములు.—రాత్రిః - రాత్రిః, రాత్రీ, రాత్రయః. రాత్రిశబ్దః ఇ, స్త్రీ, ప్ర, ఏ. గతా-గతా, గతే, గతాః. గతాశబ్దః ఆ, స్త్రీ, ప్ర, ఏ. మతిమతాంవర - మతిరేషా మ స్తీతి మతిమంతః, తేషాం మతిమతాం, మతిమతాం వరః మతిమతాంవరః,తస్య సంబుద్ధిః హేమతిమతాంవర; హే...వర,హే...వరౌ, హే...వరాః. మతిమతాంవరశబ్దః అ, పు, సం, ఏ. ముంచ-ముంచ, ముంచ తాత్, ముంచతం, ముంచత 'ముచ్ల్ మోక్షణ' ఇత్యస్మాద్ధాతోః స్సకర్మకా త్కర్తరి ప్రార్థనాయాం లోట్ పరస్మైపదే మధ్యమపురుషైకవచనాంతః. శయ్యాం-శయ్యాం, శయ్యే, శయ్యాః. శయ్యాశబ్దః ఆ, స్త్రీ, ద్వి, ఏ. ధాత్రా - ధాత్రా, ధాతృభ్యాం, ధాతృభిః. ధాతృశబ్దః ఋ, పు, తృ, ఏ. ద్విధా-ధాలంతమవ్య. ఏవ-అవ్య. నను-అవ్య. ధూః-ధూః, ధురౌ, ధురః. ధూర్శబ్దః రేఫాంతస్త్రీ, ప్ర,ఏ జగతః-జగతః జగతోః, జగతాం. జగచ్ఛబ్దః త,న, ష, ఏ. విభక్తా-విభక్తా, విభక్తే,విభక్తాః. విభక్తాశబ్దః ఆ, స్త్రీ, ప్ర, ఏ. తాం-తాం, తే, తాః. తచ్ఛబ్దః ద, స్త్రీ, ద్వి, ఏ. ఏకస్మిన్ ఏకతః. తసిలంత మవ్య. తవ-తవ తే, యువయోః వాం, యుష్మాకం వః. యుష్మచ్ఛబ్దః ద, పు, ష, ఏ. బిభర్తి-బిభర్తి, బిభృతః, బిభ్రతి. 'డుభృఞ్ ధారణపోషణయో'రిత్య

స్వాధాతో స్సకర్మకాత్కర్తరి వర్తమానేలట్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః. గురుః-గురుః, గురూ, గురవః. గురుశబ్దః అ, పు, ప్ర, ఏ. వినిద్రః- విగతా నిద్రా యస్య సః వినిద్రః; వినిద్రః, వినిద్రౌ, వినిద్రాః. వినిద్రశబ్దః అ, పు, ప్ర, ఏ. తస్యాః-తస్యాః, తయోః, తాసాం. తచ్ఛబ్దః ద, స్త్రీ, ష, ఏ. భవాన్-భవాన్, భవంతౌ, భవంతః. భవచ్ఛబ్దః త, పు, ప్ర, ఏ. అపరధుర్యపదావలంబీ-ధురం వహతీతి ధుర్యః; ధుర్యస్య పదం ధుర్యపదం, అపరం చ తత్ ధుర్యపదం చ అపరధుర్యపదం, అపరధుర్యపదం అవలంబత ఇతి అపరధుర్యపదావలంబీ; అవలంబీ, అవలంబినౌ, అవలంబినః. అపరధుర్యపదావలంబిన్ శబ్దః న, పు, ప్ర, ఏ.

వ్యాఖ్యా — రాత్రిరితి. హే మతిమతాంవర బుద్ధిమతాం శ్రేష్ఠ, రాత్రిః గతా, శయ్యాం ముంచ, వినిద్రో భవే త్యర్థః. వినిద్రత్వస్య ఫలమాహ-ధాత్రేతి. ధాత్రా బ్రహ్మణా, జగతో ధూః భారః 'ధూః స్యాద్యానముఖే భారే'ఇతి యాదవః ద్విధైవ ద్వయో రే వేత్యర్థః, ఏవకార స్తృతీయనిషేధార్థః. విభక్తా నను విభజ్య స్థాపితా ఖలు తత్క్రమత ఆహ. తాం ధురం, ఏకతః ఏకత్ర కోటౌ, తవ గురుః పితా, వినిద్రస్సన్ బిభర్తి. తస్యాః ధురః భవాన్ ధురం వహతీతి ధుర్యః, భారవాహి తస్యపదం వాహన స్థానం అపరం యద్ధుర్యపదం తదవలంబత ఇతి అపరధుర్యపదావలంబీ, అతో వినిద్రో భవే త్యర్థః, న హ్యుభయవాహ్య మేకో వహతీతి భావః.

భావము — శ్రేష్ఠబుద్ధిగలయజమహారాజా! తెల్లవాఱినది యందును శయ్యనుండి లెండు. బ్రహ్మ రాజ్యభారమును రాజగు మీతండ్రియందును యువరాజైన మీయందును యుంచియున్నాఁడు. మీతండ్రి జాగరూకుఁడై చేయఁదగినభూపరిపాలనమును జేయుచున్నాఁడు. మీరును మీపాలనమును జరిగింపవలెను.

శ్లో. నిద్రావశేన భవతాఽప్యనపేక్షమాణా
పర్యుత్సుకత్వ మబలా నిశి ఖండితేవ,
లక్ష్మీ ర్వినోదయతి యేన దిగంతలంబీ
సోఽపి త్వదాననరుచిం విజహాతి చంద్రః. ౬౭

పదచ్ఛేదము.— నిద్రావశేన, భవతా, అపి, అనపేక్షమాణా, పర్యుత్సుకత్వం, అబలా, నిశి, ఖండితా, ఇవ, లక్ష్మీః, వినోదయతి, యేన, దిగంతలంబీ, సః, అపి, త్వదాననరుచిం, విజహాతి, చంద్రః.

అర్థము.— నిద్రావశేన=నిద్రాధీనుఁడవైన, భవతా=నీయందు, పర్యుత్సుకత్వమపి=అనురక్తిత్వమును, నిశి=రాత్రియందు, ఖండితా=అన్యాసంగజ్ఞానకలుషితురాలైన, అబలేవ=నాయికవలె, అనపేక్షమాణా=ఉపేక్షజేసిన, లక్ష్మీః=లక్ష్మి, యేన=యేచంద్రునితో

కూడ, వినోదయతి=వినోదమును జేయుచున్నదో, సః=ఆ, చన్ద్రోఽపి=చంద్రుడును, దిగంతలంబీసన్-దిక్=పశ్చిమదిక్కుయొక్క, అంత=కొనను, లంబీసన్=పొందినవాడగుచు, త్వదాననరుచిం-త్వత్=నీయొక్క, ఆనన=ముఖముయొక్క, రుచిం=కాంతిని, విజహాతి=విడుచుచున్నాడు.

అన్వయము.—విజహాతి=విడుచుచున్నాడు. కోపి = ఎవడును? సఃచంద్రోపి = ఆచంద్రుడును. కాం=దేనిని? త్వదాననరుచిం=నీయొక్క ముఖముయొక్క కాంతిని (సకర్మ...ము). కథంభూతస్సన్=ఎట్టివాడగుచు? దిగంతలంబీసన్=పశ్చిమదిక్కుయొక్క కొనను పొందినవాడగుచు.వినోదయతి=వినోదమును జేయుచున్నదో. కా=ఎవతె? లక్ష్మీః=లక్ష్మి (అకర్మ...ము). కేన=ఎవరితోఁగూడ, యేన=ఏచంద్రునితోఁగూడ. లక్ష్మీః కథంభూతా=లక్ష్మియెట్టిది? అనపేక్షమాణా=ఉపేక్ష జేసినది. కేవ=ఎవతెవలె? అబలేవ= నాయికవలె. అబలా కథంభూతా=నాయికయెట్టిది? ఖండితా=అన్యాసంగజ్ఞానకలుషితురాలైనది. కస్యాం=దేనియందు? నిశి=రాత్రియందు. కిమపి=దేనిని? పర్యుత్సుకత్వమపి = అనురక్తత్వమును. కేన=ఎవనియందు? భవతా=నీయందు. భవతా కథంభూతేన=నీవెట్టివాఁడవు? నిద్రావశేన=నిద్రాధీనుఁడైనవాఁడవు.

శబ్దరూపసమాసములు.—నిద్రావశేన-నిద్రాయాః వశః నిద్రావశః, తేన నిద్రావశేన; వశేన, వశాభ్యాం, వశైః. నిద్రావశశబ్దః అ, పు, తృ, ఏ. భవతా-భవతా, భవద్భ్యాం, భవద్భిః. భవచ్ఛబ్దః త, పు, తృ, ఏ. అపి-అవ్య. అనపేక్షమాణా - అపేక్షమాణా న భవతీత్యనపేక్షమాణా; అనపేక్షమాణా, అనపేక్షమాణే, అనపేక్షమాణాః. అనపేక్షమాణాశబ్దః ఆ, స్త్రీ, ప్ర, ఏ. పర్యుత్సుకత్వం-పర్యుత్సుకత్వం, పర్యుత్సుకత్వే, పర్యుత్సుకత్వాని. పర్యుత్సుకత్వశబ్దః అ, న, ద్వి, ఏ. అబలా-నవిద్యతే బలం యస్యాస్సా అబలా; అబలా, అబలే, అబలాః అబలాశబ్దః ఆ, స్త్రీ, ప్ర, ఏ. నిశి-నిశాయాం, నిశి, నిశయోః, నిశోః, నిశాసు, నిట్సు. నిశాశబ్దః ఆ, స్త్రీ, స, ఏ. ఖండితా - ఖండితా, ఖండితే, ఖండితాః. ఖండితాశబ్దః ఆ, స్త్రీ, ప్ర, ఏ. ఇవ-అవ్య. లక్ష్మీః-లక్ష్మీః, లక్ష్మ్యౌ, లక్ష్మ్యః. లక్ష్మీశబ్దః ఈ, స్త్రీ, ప్ర, ఏ. వినోదయతి-వినోదయతి, వినోదయతః, వినోదయంతి. వినోదశబ్దాత్తత్కరోతీతి ణిజంతాద్ధాతోరకర్మకాత్కర్తరి వర్తమానే లట్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః. యేన-యేన, యాభ్యాం, యైః. యచ్ఛబ్దః ద, పు, తృ, ఏ దిగంతలంబీ-దిశః అంతః దిగంతః, దిగంతే లంబతే ఇతి దిగంతలంబీ; లంబీ, లంబినౌ, లంబినః. దిగంతలంబిన్ శబ్దః న, పు, ప్ర, ఏ. సః - సః, తౌ, తే. తచ్ఛబ్దః ద, పు, ప్ర, ఏ. అపి-అవ్య. త్వదాననరుచిం-తవ ఆననం త్వదాననం, త్వదాననస్య రుచిః త్వదాననరుచిః, తాం త్వదాననరుచిం; రుచిం, రుచీ, రుచీః. త్వదాననరుచిశబ్దః ఇ, స్త్రీ, ద్వి, ఏ. విజహాతి-విజహాతి, విజహీతః, విజహతి. విపూర్వకాత్ 'ఓహాక్ త్యాగ'

ఇత్యస్మాద్ధాతో స్సకర్మకా త్కర్తరి వర్తమానే లట్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః చంద్రః-చంద్రః, చంద్రౌ, చంద్రాః. చంద్రశబ్దః అ, పు, ప్ర, ఏ.

వ్యాఖ్యా.—నిద్రేతి. చంద్రారవిందరాజవదనాదయో లక్ష్మీనివాసస్థాన మితి ప్రసిద్ధి మాశ్రిత్యోచ్యతే. నిద్రావశేన నిద్రాధీనేన, స్త్ర్యంతరా సంగో౽త్ర ధ్వన్యతే. భవతా త్వయా, పర్యుత్సుకత్వ మపి, త్వయ్యనురక్త మపీ త్యర్థః. 'ప్రసితోత్సుకాభ్యాం తృతీయా' చేతి సప్తమ్యర్థే తృతీయా. అపిశబ్దః తద్విషయానురాగస్య అనుపేక్షత్వద్యోతనార్థః. నిశి ఖండితా భర్తురన్యాసంగజ్ఞానకలుషితా, అబలేవ నాయికేవ, 'జ్ఞాతే౽న్యాసంగవికృతే ఖండితేర్ష్యాకషాయి' తేతి దశరూపకే అనపేక్షమాణా అవిచారయంతీసతీ, ఉపేక్షమాణేత్యర్థః. లక్ష్మీః యేన చంద్రేణ సహ, త్వదాననసదృశత్వా దితి భావః. వినోదయతి వినోదంకరోతి. వినోదశబ్దాత్ 'తత్కరోతీతి తదాచష్ట' ఇతి ణిచ్. సాదృశ్యదర్శనాదయో హి విరహిణాం వినోదస్థానానీతి భావః. సః చంద్రో౽పి, దిగంతలంబీ పశ్చిమాశాంతగత స్సన్, అస్తం గచ్ఛ న్నిత్యర్థః. అత ఏవ త్వదాననరుచిం తవముఖకాంతిం, విజహాతి, త్వన్ముఖసాదృశ్యం త్యజతీత్యర్థః. అతః నిద్రాం విహాయ తాం లక్ష్మీం అనన్యశరణాం పరిగృహాణేత్యర్థః. అథవా నిద్రావశేన భవతా అనపేక్ష్యమాణా అనిరీక్ష్యమాణా, కర్మణి శానచ్. లక్ష్మీః ప్రయోజకకర్త్రీ, యేన చంద్రేణ ప్రయోజ్యేతి, పర్యుత్సుకత్వం త్వద్విరహవేదనాం భర్తృజన్యవిరహవేదనాంచ; 'కాలాక్షమత్వ మౌత్సుక్యం మనస్తాపజ్వరాదికృ' దిత్యలంకారే. వినోదయతి నిరాసయతీతి యోజనా. శేషం పూర్వవత్. నాథస్తు ణిజర్థోపపత్తి మపశ్యన్ ఇమం పక్ష ముపైక్షిష్ట.

భావము.—నీవు నిద్రయనుయువతి కధీనుఁడవై యుండఁగాపురుషుఁడన్య కాంతతోఁగూడినట్లు తెలిసికొని కోపించిన ఖండితనాయికరీతి లక్ష్మి రాత్రియందు వేఱుగతిఁగానక నీ ముఖసామ్యమునొందినచంద్రునితోఁగూడి వినోదించుచుండెడిది. ఆచంద్రుఁడుకూడ లజ్జచేతంబోలె నీముఖశోభను విడిచి వెలవెలఁబాఱుచుఁ గ్రుంకుచున్నాఁడు. కాన నిద్రలేచి నిరాధారురాలగు రాజ్యలక్ష్మిని గ్రహింపుము.

శ్లో. తద్వల్గునా యుగప దున్మిషితేన తావత్
సద్యః పరస్పరతులా మధిరోహతాం ద్వే,
ప్రస్పందమానపరుషేతరతార మంతః
చక్షు స్తవ ప్రచలితభ్రమరం చ పద్మమ్. ౬౮

పదచ్ఛేదము.—తత్, వల్గునా, యుగపత్, ఉన్మిషితేన, తావత్, సద్యః, పరస్పరతులాం, అధిరోహతాం, ద్వే, ప్రస్పందమానపరుషేతరతారం, అంతః, చక్షుః, తవ, ప్రచలితభ్రమరం, చ, పద్మం.

అర్థము.—తత్=ఆ కారణమువలన, వల్గునా=మనోహరమైన, యుగపత్తావత్=ఏక కాలమందే, ఉన్మిషితేన=వికాసముచేతను, ప్రస్పందమానపరుషేతరతారం-ప్రస్పందమాన=చలించుచుండెడి, పరుషేతర=మనోహరమైన, తారం=కనుగ్రుడ్డుకలిగిన, తవ=నీయొక్క, చక్షుః=నేత్రమును, అంతః=లోపలను, ప్రచలితభ్రమరం-ప్రచలిత=చలించుచుండెడి, భ్రమరం=భృంగముకలిగిన, పద్మంచ=కమలమును, ద్వే=రెండును, సద్యః=తత్క్షణమునందు, పరస్పరతులాం=అన్యోన్యసాదృశ్యమును, అధిరోహతాం=పొందుఁగాక!

ఆకాంక్ష.—అధిరోహతాం=పొందుఁగాక. కే=ఏవియు? ద్వే=రెండును. కాం=దేనిని? పరస్పరతులాం=పరస్పరసాదృశ్యమును (సకర్మ...ము) కదా=ఎప్పుడు? సద్యః=తత్క్షణము. కించ=ఏదియు? పద్మంచ=కమలమును. పద్మంకథంభూతం=కమలమెట్టిది? ప్రచలితభ్రమరం-ప్రచలిత=చలించుచుండెడి, భ్రమరం=భృంగముగలిగినది కుత్ర=ఎక్కడ? అంతః=లోపల. కిం=ఏదియుం? చక్షుః=నేత్రమును. కస్య=ఎవనియొక్క? తవ=నియొక్క. చక్షుఃకథంభూతం=నేత్రమెట్టిది? ప్రస్పందమానపరుషేతరతారం=చలించుచుండెడి మనోహరమయిన గ్రుడ్డుకలిగినది. కేన=దేనిచేతను? ఉన్మిషితేన=వికాసముచేతను. కదాతావత్=ఎప్పుడైతే? యుగపత్తావత్=ఏక కాలమునందే. ఉన్మిషితేనకథంభూతేన=వికాసమెట్టిది. వల్గునా=మనోహరమైనది. కుతః=ఎందువలన? తత్=ఆ కారణమువలన.

శబ్దరూపసమాసములు.—తత్-అవ్య. వల్గునా-వల్గునా, వల్గుభ్యాం, వల్గుభిః. వల్గుశబ్దః ఉ, న, తృ, ఏ. యుగపత్-అవ్య. ఉన్మిషితేన-ఉన్మిషితేన, ఉన్మిషితాభ్యాం, ఉన్మిషితైః. ఉన్మిషితశబ్దః అ, న, తృ, ఏ. తావత్-అవ్య. సద్యః-అవ్య. పరస్పరతులాం-పరస్పరేణతులా పరస్పరతులా, తాం పరస్పరతులాం; తులాం, తులే, తులాః. పరస్పరతులాశబ్దః ఆ, స్త్రీ, ద్వి, ఏ. అధిరోహతాం-అధిరోహతు, అధిరోహతాత్, అధిరోహతాం, అధిరోహంతు. అధిపూర్వకాత్ 'రుహ బీజజన్మని ప్రాదుర్భావ' ఇత్యస్మాద్ధాతోః స్వకర్మకా త్కర్తరి ప్రార్థనాయాం లోట్ పరస్మైపదే ప్రథమపురుషద్వివచనాంతః. ద్వే-ద్వే, ౨ ద్వాభ్యాం, 3 ద్వయోః, ౨ ద్విశబ్దః ఇ, న, నిత్యంద్వివచనే ప్ర, ద్వి. ప్రస్పందమానపరుషేతరతారం-పరుషాదితరా పరుషేతరా, పరుషేతరా చ సా తారాచ పరుషేతరతారా, ప్రస్పందమానా పరుషేతరతారా యస్యతత్ ప్రస్పందమానపరుషేతరతారం; తారం తారే, తారాణి. ప్రస్పందమానపరుషేతరతారశబ్దః అ, న, ప్ర, ఏ. అంతః-అవ్య. చక్షుః-చక్షుః, చక్షుషీ, చక్షూంషి. చక్షుశ్శబ్దః స, న, ప్ర, ఏ. తవ-తవ తే, యువయోః వాం, యుష్మాకం వః. యుష్మచ్ఛబ్దః ద, పు, ష, ఏ. ప్రచలితభ్రమరం-ప్రచలితః భ్రమరః యస్మిన్ తత్ ప్రచలితభ్రమరం; భ్రమరం, భ్రమరే, భ్రమరాణి. ప్రచలితభ్రమరశబ్దః అ, న, ప్ర, ఏ. చ-అవ్య. పద్మం-పద్మం, పద్మే, పద్మాని. పద్మశబ్దః అ, న, ప్ర, ఏ.

వ్యాఖ్యా.—తదితి. తత్ తస్మాత్, లక్ష్మీపరిగ్రహా త్కారణాత్, వల్గునా మనోజ్ఞేన, 'వల్గుస్థానే మనోజ్ఞే చ వల్గు భాషిత మన్యవ' దితి విశ్వః. యుగప త్తావత్ ఉన్మిషితేన యుగపదున్మీలితేన, సద్యః ద్వే అపి, పరస్పరతులా మన్యోన్యసాదృశ్యం, అధిరోహతాం ప్రాప్నుతాం. ప్రార్థనాయాం లోట్. కే ద్వే? అంతః ప్రస్పందమానా చలంతీ పరుషేతరా స్నిగ్ధా తారా కనీనికా యస్య త త్తథోక్తం, 'తారకాఽక్ష్ణః కనీనికే' త్యమరః. తవ చక్షుః అంతః, ప్రచలితభ్రమరం చలద్భృంగం పద్మం చ, యుగపదున్మేషే సతి సంపూర్ణసాదృశ్యలాభ ఇతి భావః.

భావము.—కాఁబట్టి మనోజ్ఞము లయి చలించుచు నుండెడి గ్రుడ్లు గలమీకన్నులను ముకుళించినపుడు లోపలనుండి కదలుచునుండెడితుమ్మెద గలతామరపుష్పమును ఒక కాలమునందు వికసించుటచేత పరస్పరము సంపూర్ణసాదృశ్యము బొందుఁగాక. (అనఁగా సూర్యోదయమగుటచేత తామరపుష్పము వికసించుచున్నది. అదేప్రకారము మీరును మనోహరము లయినమీకన్నులు దెఱచుకొనుఁడు)

శ్లో. వృంతా చ్ఛ్లథం హరతి పుష్ప మనోకహానాం
సంసృజ్యతే సరసిజై రరుణాంశుభిన్నైః,
స్వాభావికం పరగుణేన విభాతవాయుః
సౌరభ్య మీప్సు రివ తే ముఖమారుతస్య. ౬౯

పదచ్ఛేదము.—వృంతాత్, శ్లథం, హరతి, పుష్పం, అనోకహానాం, సంసృజ్యతే, సరసిజైః, అరుణాంశుభిన్నైః, స్వాభావికం, పరగుణేన, విభాతవాయుః, సౌరభ్యం, ఈప్సుః, ఇవ, తే, ముఖమారుతస్య

అర్థము.—విభాతవాయుః=ప్రాతఃకాలవాయువు, స్వాభావికం = స్వభావసిద్ధమయిన, తే=నీయొక్క, ముఖమారుతస్య=నిట్టూర్పువాయువుయొక్క, సౌరభ్యం=పరిమళమును, పరగుణేన-పర=అన్యదీయమయిన, గుణేన=సౌరభ్యగుణముచేత, ఈప్సురివ=పొందనిచ్ఛయించినదిపలె, అనోకహానాం=వృక్షములయొక్క, శ్లథం = శిథిలమయిన, పుష్పం=కుసుమమును, వృంతాత్=ప్రసవబంధనమువలన, హరతి=అపహరించుచున్నది. అరుణాంశుభిన్నైః-అరుణ=సూర్యునియొక్క, అంశు=కిరణములచేత, భిన్నైః=వికసింపఁబడిన, సరసిజైః=కమలములతోడ, సంసృజ్యతే=సంబంధిరిచుచున్నది.

ఆకాంక్ష.—సంసృజ్యతే=సంబంధించుచున్నది. కః=ఏది? విభాతవాయుః=ప్రాతఃకాలవాయువు(అకర్మ...ము). కైః=వేనితోడ? సరసిజైః=కమలములతోడ. సరసిజైః కథంభూతైః=కమలములెట్టివి? అరుణాంశుభిన్నైః=సూర్యుని యొక్క కిరణములచేత విక

సింపఁబడినవి, హరతి=అపహరించుచున్నది. కః=ఏది? విభాతవాయుః=ప్రాతఃకాలవాయువు. కిం=దేనిని? పుష్పం=కుసుమమును (సకర్మ...ము). కస్మాత్=దేనివలన?వృంతాత్=ప్రసవబంధనమువలన. పుష్పం కథంభూతం=కుసుమమెట్టిది? శ్లథం=శిథిలమైనది. కేషాం=వేనియొక్క? అనోకహానాం=వృక్షములయొక్క. కథంభూతఇవ=ఎట్టిదివలె? ఈప్సురివ=పొందనిచ్ఛయించినదివలె. కేన=దేనిచేత? పరగుణేన = అన్యదీయమయిన సౌరభ్యగుణముచేత. కిం=దేనిని? సౌరభ్యం=పరిమళమును. కస్య=దేనియొక్క? ముఖమారుతస్య=నిట్టూర్పువాయువుయొక్క. కస్య=ఎవనియొక్క? తే=నీయొక్క. సౌరభ్యం కథంభూతం=పరిమళమెట్టిది? స్వాభావికం=స్వభావసిద్ధమైనది.

శబ్దరూపసమాసములు.—వృంతాత్ - వృతాంత్, వృంతాభ్యాం, వృంతేభ్యః వృంతశబ్దః అ, న, పం, ఏ. శ్లథం - శ్లథం, శ్లథే, శ్లథాని. శ్లథశబ్దః అ, న, ద్వి, ఏ. హరతి-హరతి, హరతః, హరంతి. 'హృఞ్ హరణ' మిత్యస్మాద్ధాతోస్సకర్మకాత్కర్తరి వర్తమానే లట్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః. పుష్పం-పుష్పం, పుష్పే, పుష్పాణి. పుష్పశబ్దః అ, న, ద్వి, ఏ అనోకహానాం - అనస అకః అనోకః, అనోకం ఘ్నంతీతి అనోకహాః, తేషాం అనోకహానాం; అనోకహస్య, అనోకహయోః, అనోకహానాం. అనోకహశబ్దః అ, పు, ష,బ. సంసృజ్యతే-సంసృజ్యతే, సంసృజ్యేతే, సంసృజ్యంతే. సమ్ పూర్వకాత్ 'సృజవిసర్గ' ఇత్యస్మాద్ధాతో రకర్మకా త్కర్తరి వర్తమానే లట్ ఆత్మనేపదే ప్రథమపురుషైకవచనాంతః. సరసిజైః - సరసి జాతాని సరసిజాని, తైః సరసిజైః; సరసిజేన, సరసిజాభ్యాం, సరసిజైః. సరసిజశబ్దః అ, న, తృ, బ. అరుణాంశుభిన్నైః-అరుణస్య అంశవః అరుణాంశవః, అరుణాంశుభిః భిన్నాని అరుణాంశుభిన్నాని, తైః అరుణాంశుభిన్నైః; భిన్నేన, భిన్నాభ్యాం, భిన్నైః. అరుణాంశుభిన్నశబ్దః అ, న, తృ, బ. స్వాభావికం-స్వభావేన నిర్వృత్తం స్వాభావికం, తత్ స్వాభావికం; స్వాభావికం, స్వాభావికే, స్వాభావికాని. స్వాభావికశబ్దః అ, న, ద్వి, ఏ. పరగుణేన-పరస్యగుణః పరగుణః, తేన పరగుణేన; గుణేన, గుణాభ్యాం, గుణైః. పరగుణశబ్దః అ, పు, తృ, ఏ. విభాతవాయుః - విభాతే వాయుః విభాతవాయుః; వాయుః, వాయూ,వాయవః. విభాతవాయుశబ్దః ఉ, పు,ప్ర, ఏ. సౌరభ్యం-సురభే ర్భావః సౌరభ్యం, తత్ సౌరభ్యం; సౌరభ్యం, సౌరభ్యే, సౌరభ్యాణి. సౌరభ్యశబ్దః అ, న,ద్వి, ఏ. ఈప్సుః-ఆప్తుమిచ్ఛుః ఈప్సుః; ఈప్సుః, ఈప్సూ, ఈప్సవః. ఈప్సుశబ్దః ఉ, పు, ప్ర, ఏ. తే-తవ తే, యువయోః వాం, యుష్మాకం వః. యుష్మచ్ఛబ్దః ద, పు,మ,ఏ.ముఖమారుతస్య-ముఖే మారుతః ముఖమారుతః,తస్య ముఖమారుతస్య; మారుతస్య, మారుతయోః, మారుతానాం, ముఖమారుతశబ్దః అ, పు, మ, ఏ.

వ్యాఖ్యా.—వృంతా దితి. విభాతవాయుః ప్రభాతవాయుః, స్వాభావికం నైసర్గికం, తే తవ ముఖమారుతస్య నిశ్వాసపవనస్య, సౌరభ్యం, తాదృక్సౌరభ్యమి

త్యర్థః. పరగుణేన అన్యదీయగుణేన సాంక్రామికగంధేనేత్యర్థః. ఈప్సురాప్తు మిచ్ఛురి వ 'ఆప్జ్ఞపృధా మీ'దితి ఈకారాదేశః. అనోకహానాం వృక్షాణామ్. శ్లథం శిథిలం, పుష్పం వృంతాత్, ప్రసవబంధనాత్ 'వృతం ప్రసవబంధన'మిత్యమరః. హరతి ఆదత్తే, అరుణాంశుభిస్తైః తరణికిరణోద్బోధితైః, సరసిజైఃకమలైస్సహ, 'తత్పురుషే కృతిబహుళ' మితిసప్తమ్యా అలుక్. సంసృజ్యతే సంగచ్ఛతే, సృజే ర్దివాదికాత్కర్తరి లట్.

భావము.—ప్రాతఃకాలవాయువు మీనిట్టూర్పుయొక్క సహజ మయిన పరిమళమును అనుసరింపవలె ననెడిభావము గలదానివలె చెట్లతో నుండి ఊడిపడునట్లు పుష్పములను రాల్చుచు వానియొక్కయు సూర్యకిరణములచేత వికసించు చుండెడి తామరపుష్పములయొక్కయు పరిమళములతో కూడి యున్నది. తెల్లవాఱఁగానే చెట్లలో నుండి పుష్పములు ప్రాయికముగ రాలుచున్నవి. కమలములు వికసించుచున్నవి. తెల్లవారిగాలి ఆవాసనఁ గలిగించుచున్నది. అజమహారాజుయొక్క నిశ్వాసములు సువాసనగలవి.

శ్లో. తామ్రోదరేషు పతితం ద్రుమపల్లవేషు
నిర్ధౌతహారగుళికావిశదం హిమాంభః,
ఆభాతి లబ్ధపరభాగతయాఽధరోష్ఠే
లీలాస్మితం సదశనార్చి రివ త్వదీయమ్. ౭౦

పదచ్ఛేదము.—తామ్రోదరేషు, పతితం, ద్రుమపల్లవేషు, నిర్ధౌతహారగుళికావిశదం, హిమాంభః, ఆభాతి, లబ్ధపరభాగతయా, అధరోష్ఠే, లీలాస్మితం, సదశనార్చిః, ఇవ, త్వదీయం.

అర్థము.—తామ్రోదరేషు, తామ్ర=ఎఱ్ఱనయిన మధ్యప్రదేశములుగల, ద్రుమపల్లవేషు-ద్రుమ=వృక్షములయొక్క, పల్లవేషు=చిగురుటాకులయందు, పతితం=పడిన, నిర్ధౌతహారగుళికావిశదం - నిర్ధౌత=పరిశుద్ధములయిన, హారగుళికా=ముక్తామణులవలె, విశదం=నిర్మలమయిన, హిమాంభః-హిమ=మంచుయొక్క, అంభః=ఉదకము, లబ్ధపరభాగతయా-లబ్ధ=పొందఁబడిన, పరభాగతయా=గుణోత్కర్షము కలిగినదగుటచేత, అధరోష్ఠే=అధరోష్ఠమునందు, త్వదీయం=నీసంబంధియైన, సదశనార్చిః=దంతకాంతిసహితమైన, లీలాస్మితమివ-లీలా=విలాసార్థమయిన, స్మితమివ=చిఱునవ్వువలె, ఆభాతి=ప్రకాశించుచున్నది.

ఆకాంక్ష.—ఆభాతి=ప్రకాశించుచున్నది. కిం=ఏది? హిమాంభః=మంచుయొక్కయుదకము (అకర్మ.. ము). కిమివ=దేనివలె? లీలాస్మితమివ=విలాసార్థమయినచిఱునవ్వువలె. లీలాస్మితంకథంభూతం=విలాసార్థమయినచిఱునవ్వెట్టిది? సదశనార్చిః=దంతకాంతి

